# తెలుగు వాచకము

## (పద్యము - గద్యము - నాటకము)

సామాన్యము

## ఉన్నతోత్తర ద్వితీయ కక్ష్య

## HIGHER SECONDARY - II YEAR

**(Telugu - Part-I Complete)**

అంటరానితనం అమానుషం
అంటరానితనం నేరం
అంటరానితనం పాపం





తమిళనాడు పాఠ్యగ్రంథ సంస్థ
చెన్నై - 600 006.

**Tamilnadu Textbook Corporation**
College Road, Chennai - 600 006.

First Edition - 2005

CHAIRPERSON

Dr. **M. CHANDRAVALLI**
Reader & Head of the Dept. of Telugu,
Presidency College, Chennai - 600 005.

REVIEWERS

Tmt. **M. KAMESWARI**
Head of the Dept. of Telugu,
Queen Mary's College,
Mylapore, Chennai - 600 004.

Thiru **P. CHANDRA SEKHARA SARMA**
SR. SPL. GR. P.G. Asst., (Rtd)
S.K.P.D. Boys'. Hr. Sec. School, Chennai - 600 001.

AUTHORS

Thiru **K. PRABHAKARA NAIDU**
SPL. GR. P.G. Asst., in Telugu
Pachaiyappa's College,
Hr. Sec. School,
Chennai - 600 001.

Thiru **G. RAMESHUDU**
SPL. GR. Telugu Pandit,
S.K.P.D. Boys' Hr. Sec. School,
Chennai - 600 001.

Tmt. **G.K.ANNAPOORNA**
P.G. Asst., in Telugu
Bentinck Girls Hr. Sec School,
Chennai - 600 007.

Dr. **T. PADMALOCHANA DEVI**
P.G. Asst., in Telugu (Rtd)
Sri Venugopala Vidyalaya,
Hr. Sec. School,
Chennai - 600 028.

**Price : Rs.**

**This book has been prepared by the Directorate of School Education on behalf of the Govt. of Tamilnadu**

**This book has been printed on 60 G.S.M. paper**

# జాతీయ గీతము

జనగణ మన అధినాయక జయహే
భారత భాగ్య విధాతా !
పంజాబ సింధు గుజరాత మరాఠా
ద్రావిడ ఉత్కళ వంగ !
వింధ్య హిమాచల యమునా గంగా
ఉచ్ఛల జలధి తరంగ !
తవ శుభనామే జాగే !
తవ శుభ ఆశిష మాగే !
గాహే తవ జయ గాథా !
జన గణ మంగళ దాయక జయహే
భారత భాగ్య విధాతా !
జయహే ! జయహే ! జయహే !
జయ జయ జయ జయహే !

*- రవీంద్రనాథ్ ఠాకూర్*

# జాతీయగీత సారాంశము

సమస్త జనుల హృదయములను పరిపాలించు భారతదేశ సౌభాగ్యకరమైనట్టి నీకు జయమగుగాక ! నీ శుభనామము పంజాబు, సింధు, గుజరాతు, మహారాష్ట్రము, ద్రావిడము, ఉత్కళము, బంగాళము మున్నగు దేశ జనుల మనస్సులను ఉప్పొంగజేయుచున్నది. అది వింధ్య, హిమాచల పర్వతములలో ప్రతిధ్వనించు చున్నది. యమునా గంగా నదుల ప్రవాహ గీతములందు విలీనమై, హిందూ సముద్ర తరంగములచే గానము చేయబడుచున్నది. నీ ఆశీర్వచనముల కొఱకు వారు ప్రార్థించుచు నీ కీర్తిని గానము చేయుచున్నారు. భారతదేశ సౌభాగ్య కర్తవగు నీకు జయమగుగాక ! జయమగుగాక ! జయమగుగాక !

# వందే మాతరమ్

వందే మాతరం,
సుజలాం, సుఫలాం, మలయజ శీతలాం,
సస్య శ్యామలాం మాతరం, వందే మాతరం,
శుభ్ర జ్యోత్స్నా పులకిత యామినీం,
ఫుల్ల కుసుమిత ద్రుమదళ శోభినీం,
సుహాసినీం, సుమధుర భాషిణీం,
సుఖదాం వరదాం మాతరం, వందే మాతరమ్

*- బంకిం చంద్ర ఛటర్జీ*

# ప్రతిజ్ఞ

భారత దేశము నామాతృభూమి. భారతీయులందరు నా సహోదరులు. నేను నా దేశమును ప్రేమించుచున్నాను. సుసంపన్నమైన, బహువిధమైన, నా దేశ వారసత్వ సంపద నాకు గర్వకారణము. దీనికి అర్హత పొందుటకు సర్వదా నేను కృషి చేయుదును.

నా తల్లిదండ్రులను, ఉపాధ్యాయులను, పెద్దలందరను గౌరవింతును. ప్రతివారితోను మర్యాదగా నడుచుకొందును. నా దేశముపట్ల, నా ప్రజలపట్ల సేవానిరతితో ఉందునని ప్రతిజ్ఞ చేయుచున్నాను.

వారి శ్రేయోభివృద్ధులే నా ఆనందమునకు మూలము.

# మా తెలుగు తల్లి

మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మా కన్నతల్లికి మంగళారతులు !
కడుపులో బంగారు, కనుచూపులో కరుణ,
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి !
గల గలా గోదారి కదలిపోతుంటేను,
బిర బిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను,
బంగారు పంటలే పండుతాయి !
మురిపాల ముత్యాలు దొరలుతాయి !
అమరావతీ నగర అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై, నిఖిలమై నిలిచియుండే దాక !
రుద్రమ్మ భుజశక్తి ! మల్లమ్మ పతిభక్తి !
తిమ్మరసు ధీయుక్తి ! కృష్ణరాయల కీర్తి !
మా చెవుల రింగుమని మారుమ్రోగే దాక
నీ ఆటలే ఆడుతాం, నీ పాటలే పాడుతాం !
జై తెలుగు తల్లీ ! జై తెలుగు తల్లీ !

*- శంకరంబాడి సుందరాచారి*

# తమిళ్ తాయ్ వాళ్త్తు

నీరారుం కడలుడుత్త నిలమడందై కెళిలొళుగుమ్
సీరారుం వదన మెనత్తిగళ్ భరత ఖండమిదిల్
తెక్కణముం అదిఱ్ సిరంద ద్రావిడనల్ తిరునాడుమ్
తక్క సిఱు పిఱై నుదలుమ్ దరిత్తనరుమ్ తిలగముమే
అత్తిలగ వాసనైపోల్ అనైత్తులగుమ్ ఇన్బముఱ
ఎత్తిసయుం పుగళ్ మణక్క ఇరుంద పెరుం తమిళణంగే !
తమిళణంగే !

ఉన్ సీరిళమై త్తిఱం వియందు
సెయల్ మఱందు వాళ్త్తుదుమే !
వాళ్త్తుదుమే !
వాళ్త్తుదుమే !

*- మనోన్మణీయం, పె. సుందరం పిళ్ళై*

# జాతీయ సమైక్య ప్రతిజ్ఞ

"నా జాతి స్వాతంత్ర్యమును, ఏకత్వమును సంరక్షించుటకును దృఢతరము చేయుటకును సర్వాత్మనా కృషి చేయగలనని ప్రతిన చేయుచున్నాను."

"మఱియు - హింసా మార్గము నెన్నడును అవలంబింపవలననియు, మత, భాషా, ప్రాంత సంబంధములైన, ఇతర రాజకీయార్థిక అన్యాయ సంబంధములైన సర్వ విభేదములను, వివాదములను శాంతియుతముగానే, చట్ట సమ్మతమైన పద్ధతులలోనే పరిష్కరించుకొనవలెననియు నొక్కి వక్కాణించుచున్నాను."

# తమిళతల్లి వినుతి

భరత ఖండపు భూమి పడతి
జలావృత జలధి వసన;
అతి సుందర మహిమోపేత;
ఆ తల్లి నెలవంక నొసట
తీర్చిన కస్తూరి తిలకం
ద్రావిడనాడు పంట వలతి;
ఆ కమ్మని కస్తూరి వలపు,
తీయదనం, లేబ్రాయం, ధీరం
తమిళభాష, తమిళభాష.
అది సర్వదిశావృతం,
నిత్య నూతనం, ప్రఖ్యాతం;
సర్వదా విజయోఽస్తు,
విజయోఽస్తని మా వినుతి.

*అనువాదము : ఆచార్య దేవళ్ల చిన్నికృష్ణయ్య*

# వినతి

తమిళనాడు ప్రభుత్వం తెలుగు పాఠ్య పుస్తకములను రూపొందించు ప్రణాళికను చేపట్టుట హర్షదాయకము. ఆ ప్రణాళికానుసారముగా ఈ వాచకము రూపొందింప బడినది.

విద్యార్థుల శ్రేయస్సును దృష్టియందుంచుకొని వారిలో మాతృభాషాభిమానము, పఠనాభిలాష, సృజనాత్మకశక్తిని పెంపొందింపచేయుటయే పరమోద్దేశముగా ఇందు పాఠ్యాంశాలు స్వీకరింపబడినవి. దేశ పురోగమనానికి, దేశ ప్రగతికి పునాదుల వంటి బాల బాలికలలో మనో వికాసం కలిగించి, వారి మనస్సులలో సమైక్యతాభావం, మానవతాదృక్పథం, దేశభక్తి మున్నగు లక్షణాలు నాటుకునే విధంగాను పాఠ్యాంశాలు రూపొందింపబడినవి. ప్రాచీనార్వాచీన రచనలకు సమప్రాధాన్యమివ్వబడినవి.

సంస్కృతమున భాసమహాకవి విరచితమై పళ్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులచే తెలుగున కనువదింపబడిన ప్రతిజ్ఞా యౌగంధరాయణము నాటకము పాఠ్యాంశముగా స్వీకరింపబడినది. ఈ నాటక ప్రకాశకులు శ్రీ మొరుసుపల్లి హనుమంతరావుగారికి కృతజ్ఞతలు.

పఠనా సౌలభ్యం కొరకు వ్యాకరణాంశములు, నాటక లక్షణములు ప్రత్యేకముగా ఒకేచోట పొందు పరచడమైనది.

తమ కవితలను, రచనలను స్వీకరించుటకు అనుమతి నొసగిన రచయితలకు, రచయిత్రులకు కృతజ్ఞతలు.

ఈ పాఠ్యగ్రంథమును రూపొందించుటకు సహకరించిన సహృదయులందరికి కృతజ్ఞతలు.

# విషయ సూచిక

## పద్యభాగము



## కంఠస్థము చేయవలసిన పద్యములు

| | | పద్యసంఖ్య | పంక్తులు |
|---|---|---|---|
| 1. క్షీరాబ్ధి వర్ణనము | .... | 2, 5, 10 | 12 |
| 3. యామునాచార్య ప్రభు రాజనీతి | .... | 4, 10, 15, 19 | 16 |
| 5. హంసుని గర్వభంగము | .... | 5, 6, 18 | 12 |
| 6. శిశుపాల వృత్తాంతము | .... | 2, 4, 10, 20 | 16 |
| 7. మైత్రీబల జాతకము | .... | 4, 10, 27, 30, 35 | 20 |
| 8. పార్వతీదేవి తపస్సు | .... | 8, 18, 29 | 12 |
| 9. హంపీయాత్ర | .... | 1, 8, 11 | 12 |
| | | మొత్తము పంక్తులు | 100 |

## గద్యభాగము



## వ్యాకరణము



## నాటకము

# పద్యభాగము

# 1. క్షీరాబ్ధి వర్ణనము

*- ఎఱ్ఱాప్రెగ్గడ*

*ప్రతిభా పాండిత్యములందు **'ఆదికవి'** యైన నన్నయ భట్టారకుడు, **'ఉభయకవి మిత్రు'** డైన తిక్కన సోమయాజులకు సాటివాడై భారత అరణ్యపర్వశేషమును ఆంధ్రీకరించి **'కవిత్రయము'**లో స్థానమును సంపాదించుకొనినవాడు **"ఎఱ్ఱాప్రెగ్గడ"** మహాకవి.*

*అద్దంకిసీమకు ప్రభువగు ప్రోలయ వేమారెడ్డి ఆస్థానకవి. 14వ శతాబ్దము పూర్వ భాగమునకు చెందినవాడు. ప్రోతమాంబ, సూరనార్యుల వ్రతఫలంబీతడు.*

*హరివంశమును రచించి తన ప్రభువైన ప్రోలయ వేమారెడ్డిగారికంకితము గావించెను. నృసింహ పురాణమును రచించి అహోబల నరసింహదేవుని కంకితము గావించి తన జన్మను సార్థకము గావించుకొనెను.*

*"సూక్తి వైచిత్రిని" పాటించుటలో నవనవోన్మేష ప్రతిభాధీగుణములను తన రచనలందు గూర్చి, ప్రబంధ రచనలకు అంకురార్పణసల్పి **"ప్రబంధపరమేశ్వరుడు", "శంభుదాసుడు"** అనెడి బిరుదములు పొందెను.*

*ప్రస్తుత పాఠ్యభాగము **"నృసింహ పురాణము"** లోని ప్రథమాశ్వాసంలోనిది.*

*దేవశ్రవుడనే ముని పుంగవుడు నైమిశారణ్యమునందలి మునులకు అహోబలక్షేత్ర మహిమను, అచ్యుతుని మహిమను వివరించును. ఆ సందర్భమున ఎఱ్ఱనకవి గావించిన **"క్షీరాబ్ధి వర్ణన"** మే ప్రస్తుత పాఠ్యాంశము.*

సీ. అఖిలలోకానందుఁ డగు చంద్రుఁ డెం దేనిఁ
గలిగె నుజ్జ్వల ఫేనకణము మాడ్కి
నై రావణాదిమహాకరు లెందేనిఁ
బ్రభవించె మకరశాబములపగిదిఁ
గమనీయసురతరుసముదయం బెందేని
జనియించె శైవాలచయము భంగి
భువనైకమాత మాధవుపత్ని యెందేనిఁ
బొడమె మాణిక్యంపుబొమ్మపోల్కి

గీ. నాదిమత్స్యకూర్మములు విహారలీలఁ
దనరు నెందేనిప్రకృతి సత్వములకరణి
నట్టియంభోధి యొప్పారు నద్భుతైక
సారమహనీయమహిమ కాధార మగుచు. 1

★క. తాన లవణాబ్ధి యనినను
దాన మధుర జలధి యనినఁ దాన యమృతపా
థోనిధి యనినను సకలా
నూనగుణస్తుతికి నాత్మ యొకఁడ యుదధికిన్. 2

క. కావున దుగ్ధాంభోనిధి
శ్రీవిభవము వర్ణనంబు చేసెద, సాక్షా
చ్ఛ్రీవల్లభమూర్తి యగుటఁ
బావనములు తద్గుణానుభావ స్తవముల్. 3

ఉ. ఒక్కొకయప్డు శీతకిరణోదయవేళలఁ బొంగి నింగికిన్
నిక్కి మహాబ్ధివీచికలు నిర్మలదివ్యవిమానపం క్తిపైఁ
బిక్కటిలంగఁ గ్రొన్నురువు వెట్టినయంతయుఁ జూడనొప్పు న
ల్దిక్కులు శారదాభ్రలవదీ ప్తివిభాగత నొందుచాడ్పునన్. 4

★ఉ. ఎక్కుడువేడ్కఁ గ్రోలికొని యెండకయున్న పయోధి, పల్మఱున్
గ్రక్కెడునో సుధాకిరణకాంతిచయంబు లనంగ, నెంతయున్
మిక్కిలి యుల్ల సిల్లు నునుమించులుదేరెడుము త్తియంబు లిం
పెక్కినవ్రోఁతలన్, దరగ లెందుఁ దటంబులఁ ద్రోవువెట్టఁగన్: 5

చ. తటరుహవిద్రుమ ద్రుమవితానము లొప్పుఁ బయోధి కింకను
త్కట చటులోర్మి హస్తముల గర్వమున న్వెడలంగ ద్రోచినం
బటుతరభావ మేది బహుభంగి వికీర్ణతనొంది క్రింద న
చ్చట నచటన్ బొనుంగువడి స్రగ్గినబాడబకీలలో యనన్ 6

తే. కడలుచేతు లార్చుచు ఫేనఘనతరాట్ట
హాసరుచితోఁ బ్రవాళజటాలి విద్రిచి
యౌర్వశిఖ ఫాలలోచనం బనఁగ సింధు
వమరుఁ దాండవ మాడెడుహరునిఁ బోలి 7

★చ. పొలుపుగ నెల్లనాఁడు నుడివోవక పెల్లుగఁ బూచు తీఁగెలం
దెలుపులుమీఱి తోయనిధితీరవనంబులు చూడ్కి కెప్పుడున్
ఎలమియొనర్చు వేల్పులచలేంద్రునిఁ గవ్వముఁ జేసి ద్రచ్చు
చోఁ జిలికిననాఁటి యయ్యమృతశీకర సేకముపాయదోయనన్ 8

ఉ. ఱెక్కలతోడి కొండల నెఱిం దనలోన నడంచికొన్న నీ
సెక్కి బలారి వంచెనొకొ యీజలపూరము పేర్మి యంతయుం
దక్కువ సేయ నన్నక్రియ దందడి నెందును బేర్చి పెల్లుగా
నొక్కట నీరుగ్రోలెడుఁ బయోధసముచ్చయముల్ పయోనిధిన్. 9

సీ. సిరిపుట్టినిల్లు, రాజీవలోచనుసెజ్జ
        పట్టు, మహీకాంతకట్టుఁజీర,
గిరులు డాఁగెడుగొంది, గిరిభేదిపగఱకు
        బలుకోట, బడబాగ్ని బ్రతుకుచోటు,
పటుపయోధరములపాలిప్రపాసీమ
        యమృతాంశుపొడవున కనుగలంబు,
మర్యాదలకు గుఱి, మహిమల కందువ
        యఖిల రత్నములకు నాకరంబు,

గీ. సురతభవనంబు వాహినీసుందరులకుఁ
గూర్మి నిక్కడ, గంభీరగుణము నెలవు,
తనరునొప్పిదముల కెల్లఁ దానకంబు
వనధి గొనియాడఁ జతురాననునకు వశమె. 10

## అధ్యయన వేదిక

**అర్థములు :**

ఫేనకణము = సముద్రపు నురుగు; కరులు = ఏనుగులు; మకర శాబములు = మొసలి పిల్లలు; సురతరు = కల్పవృక్షము; శైవాల = నీటి పాచి; కూర్మము = తాబేలు; దుగ్ధాంభోనిధి = పాలసముద్రము; స్తవముల్ = స్తోత్రములు; నింగి = ఆకాశము; మహి = భూమి; శీతకిరణోదయము = చంద్రోదయము; వీచికలు = అలలు; శారదాభ్రము = శరత్కాలపు మేఘము; దీప్తి = కాంతి; సుధ = అమృతము; తరగలు = అలలు; పులిన = ఇసుక తిన్నె; దుకూల = తెల్లని వస్త్రము; ఘర్మాంబు = చెమట బిందువు; రోచులు = కాంతులు; వేలావధూటి = చెలియలకట్ట; ప్రేపులు = ఉషః కాలము; హరుడు = శివుడు; అచలేంద్రుడు = మేరు పర్వతము; శీకర = తుంపర; పయోధము = మేఘము; బలారి = ఇంద్రుడు; దందడి = తఱచు; రాజీవలోచనుడు = పద్మరేకుల వంటి కన్నులు గలవాడు (కృష్ణుడు); సెజ్జ = పాన్పు; గిరిభేది = ఇంద్రుడు; ప్రపాసీమ = కొండ చరియ; కందువ = సంకేతము; ఆకరము = స్థానము; తానకము = స్థానము; చతురాననుడు = బ్రహ్మ.

**సంధులు :**

**ఈ క్రింది పదములను విడదీసి, సంధి పేర్లను వ్రాసి, సూత్రములను వ్రాయుము.**

భువనైక, లవణాబ్ధి, కిరణోదయము, క్రొన్నురువు, కెమ్మోవి, చంద్రోదయము, ఘర్మాంబు కణములు, అచలేంద్రుడు, చెలువంపు బింకంబు.

**సమాసములు :**

**ఈ క్రింది సమాసములకు విగ్రహ వాక్యములను వ్రాసి, సమాసముల పేర్లను వ్రాయుము.**

మకరశాబములు, మాధవుపత్ని, మత్స్యకూర్మములు, మధుర జలనిధి, శీతకిరణుడు, నదీపతి, అచలము, రాజీవలోచనుడు, మహీకాంత, చతురాననుడు.

**అర్థ సందర్భములు :**

1. సార మహనీయ మహిమకాధార మగును
2. ఉదధితో తెంచు జంద్రోదయోత్సవమున
3. సింధువమరు దాండవ మాడెడు హరుని బోలి
4. వనధి గొనియాడ జతురాననునకు వశమే.

**ప్రశ్నలు :**

1. పాలసముద్రము నుండి ఎవరెవరు పుట్టిరి?
2. సముద్రమును కవి ఎట్లు వర్ణించెను?
3. పాలసముద్రము ఎవరెవరికి ఎట్లు స్థానమైనది?

***ఉపాధ్యాయులకు సూచన :***

పాలసముద్రమును మథించునపుడు ఉద్భవించినవానిని విద్యార్థులకు వివరింపుడు.

# 2. కవితాపుష్పకం

**- దాశరథి**

*ఆధునిక యుగములో* ***'అభ్యుదయకవి'*** *గా ప్రసిద్ధిగాంచిన దాశరథి కృష్ణమాచార్యులు 1927 సం॥న జన్మించిరి.*

*నిజాంకు వ్యతిరేకముగా తెలంగాణాలో జరిగిన పోరాటంలో జైలుకు వెళ్ళి తన కవిత్వము ద్వారా పోరాటానికి స్ఫూర్తినిచ్చిన అభ్యుదయకవి దాశరథిగారు.*

***'అగ్నిధార, రుద్రవీణ, పునర్నవం, మహాంధ్రోదయం, అమృతాభిషేకం'*** *వీరి రచనలలో పేర్కొనదగినవి.*

***'కళాప్రపూర్ణ'*** *బిరుదాంకితులు; వీరి* ***'తిమిరంతో సమరం'****నకు కేంద్రసాహిత్య అకాడమీ బహుమతి లభించినది.*

*ప్రస్తుత పాఠ్యభాగము కవితాపుష్పకమునుండి గ్రహింపబడినది. ఇందు భావ కవిత లోని సొగసులు చక్కగా వర్ణింపబడియున్నవి.*

*భిన్నత్వంలో ఏకత్వమును చూడమని చాటి చెప్పునదే ఈ కవితయందలి సారాంశము.*

గగనంలో చుక్కలు
తోటలోని పూవులు
కలహించక కలిసుండును;
మనుషు లేల కలహించుట?
సూర్యునితో చంద్రుడు పోట్లాడడు
ఒక మతస్థునితో ఇంకొక మతస్థు డేల పోట్లాడుట?
తోటలోని పూవులు యుద్ధం చేస్తే
తోటంతా రణరంగంగా మారుతుంది

పరిమళాలు నశించి పోతాయి
శవాల దుర్వాసన పెరుగుతుంది;
తోటవంటి లోకాన్ని
ఎడారిలా చేయకండి.

చంద్రుడి భాష మాట్లాడండి;
అందరికీ ఆ భాష అర్థమవుతుంది;
నాల్కలేనివానికికూడా అర్థమయ్యే
నవ్యభాష మాట్లాడండి;
నిశ్శబ్దంగా కొలనులోని కలువ మాట్లాడుతుంది;
ఉదయకాల సూర్యుడు తూర్పు కొండలోనుంచి వెలువడుతూ
ఏదో కొత్త సందేశం చెబుతాడు ;
అదీ సిసలైన భాష ;
ద్వేషాలు కలిగించే భాష మనకు వద్దు.
ప్రేమను రేకెత్తించే కోమల భాష మనకు కావాలి.

మన దేశంలోని అన్ని భాషలూ నావి,
నా కర్థమయినా, నావి కాకున్నా నావి,
మంచుకొండలకు దూరంగా వున్నా — అవి నావి.
సముద్రానికి దూరాన వున్నా — అది నాది.

నా పాతమిత్రు లెవరో తెలుసా ?
గాలిబూ — కాళిదాసు
మరి కొత్త మిత్రులు ?
నజ్రులిస్లాం — టాగోర్

నిజమైన నాగరికునికి భాషాభేదా లుండవు.
భేదాలకు, వాదాలకు అతీతుడే
నిజమైన మనిషి.

మంచి కవిత్వం ఏ భాషలో వుంటే అది నా భాష
మంచి కవి ఎవరైతే అతడు నా మిత్రుడు.
నాకు ఉరుదూ, తెలుగూ రెండు కళ్ళు
ఈ రెండు కళ్ళతో అన్ని భాషలనీ చదవగల్ను
హృదయం ఒకటైతే లోకమంతా ఒకటి.

నీ హృదయాన్ని కోసి ముక్కలు చేసుకోకు
గుండెను ఒక్కటిగా పని చేయనీ
లేకుంటే గుండెజబ్బు వస్తుంది ;
గుండె జబ్బు మృత్యువును తెస్తుంది.
గుండెకు జబ్బును సోకనీయకు
గుండెను ఆరోగ్యంగా వుండనీ,
అన్ని భాషల వాళ్ళను గౌరవించు
అన్ని భాషల వాళ్ళను ఆదరించు.

నీ హృదయం భిన్న సంస్కృతుల కూడలి
ఈ రంగస్థలంమీద కంబరూ, కబీరూ
కలిసి కవిత్వం చదువుతారు.
ప్రతి హృదయంలో రోజూ అఖిల భారత
కవి సమ్మేళనం జరగాలి.
మనిషి మనిషిని విడగొట్టే రాజకీయాలు మరచిపొండి !
మనిషిని మనిషి పడగొట్టే మతాన్ని వదిలేయండి !
మనిషినీ మనిషినీ కలిపే కవితాసౌధంవైపు రండి
ఈ కవితాసౌధం పుష్పకవిమానం వంటిది.

ఇందులో ఎందరు ప్రయాణించినా ఇంకా చోటుంటుంది
అన్ని భాషలవారూ రండి.
మా పుష్పక విమానంలో
ఆనందలోకాలలోకి సంచారం చేయడానికి వెళదాం ;
ఆ విమానం ఇక్కడే బయలుదేరుతుంది.
మంచి హృదయమే దానిలో ఎక్కడానికి
అర్హత నిచ్చే టికెట్టు.

డబ్బు అక్కరలేదు మాకు.
ఏకత్వం అనే పెట్రోల్‌తో ఎగురుతుంది ఆ విమానం
ఏకత్వం చెడిపోయిననాడు అది కూలుతుంది
కనుక ఏకంగా వుందాం... ఏకంగా విందాం కవిత.
ఏకంగా లోకాన్ని స్వర్గం చేసి విహరిద్దాం.

## అధ్యయన వేదిక

**అర్థములు :**

గగనము = ఆకాశము; కలహము = యుద్ధము, గొడవ; రణరంగము = యుద్ధభూమి; పరిమళము = వాసన; ద్వేషము = పగ; సకియ = స్నేహితురాలు.

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహవాక్యములు వ్రాసి, సమాసముల పేర్లను వ్రాయుము.**

నవ్యభాష , భిన్నసంస్కృతులు, కవితాసౌధం.

**సందర్భ వాక్యములు :**

1. పరిమళాలు నశించిపోతాయి
2. లోకాన్ని స్వర్గం చేసి విహరిద్దాం
3. గుండెజబ్బు మృత్యువును తెస్తుంది
4. కవితాసౌధం పుష్పకవిమానం వంటిది.

**ప్రశ్నలు :**

1. 'తోటవంటి లోకాన్ని ఎడారిలా చేయకండి' ఎట్లు?
2. భాషాభేదాలు గురించి కవి దాశరథిగారి మనోవేదన వివరింపుము?
3. "హృదయం భిన్నసంస్కృతుల కూడలి" వివరింపుము?

# 3. యామునాచార్య ప్రభు రాజనీతి

*- శ్రీకృష్ణ దేవరాయలు*

"తెలుగదేల యన్న దేశంబు తెలుగేను
తెలుగు వల్లభుండ తెలుఁగొకండ
ఎల్లనృపులు గొలువ నెఱుగవే బాసాడి
దేశ భాషలందు తెలుగు లెస్స"

*- అని చాటి చెప్పిన సాహితీసమరాంగణ సార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయలు. సంస్కృతములో భోజమహారాజువలె కవులను, పండితులను ఆదరించి వారిచే రసవత్తరములైన కావ్యములు రచింపజేసి 'ఆంధ్రభోజుడ'ను నామమును సార్థకము గావించుకొనెను. తానుకూడా విద్వత్కవియై సంస్కృతములో* ***"మదాలస చరిత్ర" "సకల కథాసార సంగ్రహము" "జ్ఞానచింతామణి" "రసమంజరి"*** *అనెడి కృతులను వెలయించెను.*

*శ్రీకృష్ణదేవరాయలు 1487 ప్రాంతమున నరసరాయలు - నాగాంబలకు జన్మించి, తన కీర్తివల్ల తల్లిదండ్రుల కీర్తిని గూడా సార్థకత గావించిన మహనీయుడు.*

*శ్రీకాకుళ ఆంధ్ర విష్ణువు స్వప్నంలో కనిపించి ఆంధ్రభాషలో కావ్యరచన చేసి అంకితము చేయవలసినదిగా కోరెను. ఆయా దేశముననుసరించి ఆంధ్ర పంచకావ్యములలో రాజనీతి తొణికిసలాడునట్టి* ***ఆముక్తమాల్యద*** *గ్రంథమును రచించి శ్రీమహావిష్ణువునకు అంకితముగావించినాడు.*

*'ఆముక్త మాల్యద' గ్రంథరచనలో, రసస్పష్టిలో, వర్ణనారామణీయకతలో, కథాకథనంలో, పాత్ర చిత్రణములందు తన ప్రత్యేక ప్రతిభను కనబరచినాడు.*

*ప్రస్తుత పాఠ్యభాగము* ***'ఆముక్తమాల్యద'*** *లోని చతుర్థాశ్వాసమునుండి స్వీకరింపబడినది. యామునాచార్యుని రాజనీతివిషయములిందు చక్కగా పొందు పఱుపబడియున్నవి.*

క ఏ పట్టున విసువక ర
క్షాపరుఁడవు గమ్ము ప్రజల చక్కి; విపన్ను
ల్గా పెట్టిన విని తీర్పుము;
కాపురుషుల మీఁద విడకు కార్య భరంబుల్ 1

తే రాష్ట్ర వర్ధన మెదఁ గోరు రాజు మేలు
రాష్ట్రమును గోరు; దానఁ గార్యమె యనంగ
రాదు; బ్రహ్మోత్తరములైన ప్రజల యేక
ముఖపుఁ గోర్కిఁ దదంత రాత్ముండొసఁగఁడె ? 2

ఆ ఆజ్ఞ వలయు నృపతి, కాభీర భిల్లాది
కంపకోల నూల నాజ్ఞ చెల్లు
నంట; సార్వభౌముఁడైన భూపతి యాజ్ఞ
కెల్లవారుఁ దల్ల డిల్లవలదె ? 3

✶ ఆ॥ మొదలఁ బెనిచి పిదపఁ గుదియింప, నెవ్వాఁడుఁ
దనదు తొంటి హీన దశఁ దలంపఁ
డలుగుఁ ; గాన శీల మరయుచుఁ గ్రమవృద్ధిఁ
బెనిచి, వేళ వేళఁ బనులుగొనుము. 4

చ చదివి యధర్మభీరు నృపశాస్త్ర విధిజ్ఞతలన్వయస్సుడె
బ్బదిటికి లోను నేబదికి బాహ్యమునై యరుజస్వపూర్వులై,
మదమతి రాజుప్రార్థన నమాత్యతఁ గైకొని తీర్చు పాఱువా
రొదవిన నంగముల్మిగుల నూర్జిత మౌటకుఁ బూఁట సాలదే 5

వ. అట్టి మంత్రి వర్గంబు దొరకదేని, 6

శా. నీతిం దాన తలంచి చేయుఁబని గానీ కాకపోనీ, బల
వ్రాతార్థాఢ్యత నెమ్మి నుండ కొరుఁ బ్రోవ న్మంత్రి యంచుంగుణా
తీతుం, గుమ్మడికాయ యంతయగు ముత్తెంబై మనంజేర్చ, న
ట్లే తా నాతని చేతిలో బ్రతుకువాఁడే యౌఁజుమీ మీఁదటన్ 7

క. ధనముఖ్యముకేవలమే
పనియుంగా, దాస్థ గలిగి పలువురు ప్రభువుల్
పనిసేయక, తద్వశ్యం
బునకు న లోభా నృశంస్యముల్ బుతముఁ జెలుల్. 8

క. భాండాగార హయాద్యము
లుండియు ననువగు మనుష్యులొదవమి నవియున్;
మండలి నవయ నరి కొదిఁగి
యుండిన సింహాసనంబులుర్వి న్వినమే ? 9

★ఉ. ఆయతకానికీకు మమరాలయ ముఖ్యము, లాతఁడర్థతృ
ష్ణాయుతుడై నిజోర్వినగు నష్టికిఁ దద్ధనముం దొరల్చి, రా
జాయతనంబుఁజేర్చు; మఱియట్టిదపథ్యము, కాన నొంటిగాఁ
డే యధికారిగావలయు, నించుక తిన్ననువాఁడె రూపఱున్ 10

చ. మును దనసీమ చేసికొని, ముల్లిడి, గుద్దట వెండి చేనిమె
త్తనకయి వేరు వెల్లఁకియుఁద్రవ్వెడు కర్షకునట్లు, శత్రుతో
నెనసియయైన దుర్గబలమే కొనియైన, నిజాత్మ చింతలే
క నెగడఁ జేసి, లోన మఱికంటక శోధనఁజేయు టొప్పగున్ 11

క. మొదలనె యొరుదల కానిం
జెదరంగా నాడ కాత్మఁ జింతింపు; పదిం
బదిగ మృషఁయేని మఱి విడు
ముదస్తుఁగాఁ గాక యుండనొక్క మతమునన్ 12

తే. ఆటవిక వశ్యకలన సత్యమున, వైరి
మనుజపతి మైత్రి దూత సమ్మానమునను,
గూర్మి దఱి భృతిఁ గాల్వురకును, స పారి
తోషికపు సేవ నెలమి రౌతులకు గలుగు 13

క. మేలగు ఘోటకమును శుం
డాలంబును నాస్త సుభటునకొయిమ్ము; తఱి
న్మేలగు మెలపున మందురఁ
బాలింపుము; దొరలపాలు పఱుపకు మెపుడున్ 14

★తే. కార్యమొక్కఁడు గనిన మాత్సర్యమున నొ
కండు గాదని ఖండించు; గన్నెఱింగి
యిరువురను గాదనక కొల్వు విరిసి, మీఁద
నల్ల వాఁడెన్నినది సేయ నగు శుభంబు 15

తే. దేశ వైశాల్య మర్థ సిద్ధికిని మూల
మిల యొకింతైన, గుంట కాల్వలు రచించి,
నయము పేదకు నరిఁగోరునను నొసంగి,
ప్రబలఁజేసిన నర్థధర్మములు పెరుఁగు. 16

తే. ప్రజలవసి చన్నఁ బిలువ, కప్పసులఁ గొలుచు
నమ్మి, యిండ్లింధనంబుల కాయె, నెనెడి
కలని నక్కైన యధికారిగల నృపతికి
నేడు దీవులు గొన్న సమృద్ధి లేదు. 17

చ. ఎఱుఁగ నగున్ స్వశక్తి నవనీశుఁడు నాలుగు పాళ్ల మూడుపా,
ళ్లెఱుఁగక మోచినట్టి పని కిష్ట సుహృత్తతి దెల్ప నొక్కపా
లెఱుఁగ నగు న్నయాఢ్యమతి, నిట్లు నిరాగ్రహుఁడైనఁజేయు నె
త్తఱి విపదుగ్ర దండ పరతంత్రుఁడుగాక చిరంబు రాజ్యమున్ 18

★తే. కన్నొకటి నిద్ర వోఁ బెఱకంట జాగ
రంబు గావించు భూరుహాగ్రంబు మీఁది
యచ్చ భల్లంబుగతి భోగమనుభవించు
నెడను బహిరంతర రులపై దృష్టివలయు 19

శా. రేవు ల్మావు మతంగజంబును మణిశ్రీఖండముక్తా దియున్
రా, వాణిజ్యము పెంచి యేలఁగనగు, న్వర్షంపుటెవ్వన్ రుజన్
హా వళ్ళన్ దిగు నన్యభూప్రజల రాజాయాయి జాత్యోచితిన్
బ్రోవంగాఁదగు; దోఁట దొడ్డిగను లాప్తుల్పూడఁబంపందగున్ 20

చ. ద్రవిణము నొవ్వఁగొంట, నొఱద్రాబలతో నిడుచుంట, భూమిగొం
త వలికి నిచ్చుచుంట, బ్రథమాప్తతఁజూడక శంకనుంట, లో
బొవయు నృపాళికై యభయము న్మణిభూషలుగుప్తిఁబంపి భూ
ధవు డరి యందిడందగు భీదం దన యందివి మాన్పుకోఁదగున్ 21

తే. సింధుర మహాశ్వముఖ్యము ల్చేర్చు దొల
దీవి వణిజుల కూర్లు సద్గృహములు పురిఁ
గొలువుఁ దేజంబు వెల మేలు గలుగఁ బ్రాఁత
వారిగాఁ జేయు, నరి నవి చేరకుండ. 22

తే. తా నవంబుగ దొరఁ జేయువాని మంత్ర
మునకు వేగమె లోఁజేయఁజనదు; వాడు
క్రొత్త మన్నన రహి ననుఁగులకుఁజెప్ప
నయిన నది చెడు, మఱివాఁడు నడఁగుఁగాన 23

సీ॥ హిత, బహుశ్రుత ధర్మరత, శూరతా, స్వపూ
ర్వతల మన్ద్విజుల దుర్గములనిలిపి
పులిజున్ను మొదలుగాఁ బురుషాయుషావధి
కందుండ సవరణల్పొందు పఱచి
చీమంత యైనను సామంత కోటికి
మితము దప్పక యుండ క్షితులొసంగి
యా యాధిక వ్యయా నధికంబునుంబ్రజా
విరుజంబు గాఁగ బండరువుఁ గూర్చి

తే. క్షీణ రిపు ధాత్రిఁ జర దృష్టి చేతఁజూచి,
బకగతి హఠాద్గ్రహించి తాఁ బ్రజయు నొవ్వ
కయ పగఱ గాత్రములనె చీకాకు పఱచు
నృపతి డెందానఁ జే యిడి నిద్ర వోవు 24

## అధ్యయన వేదిక

**అర్థములు :**

ప్రజల చక్కిన్ = ప్రజల పక్షమున; కూపెట్టిన = మొర పెట్టగా; కాపురుషులు = దుర్మార్గులు; తదంతరాత్ముండు = వారిలోపలి పరమాత్ముండు (శ్రీమన్నారాయణుడు); అభీర = గొల్లలకును; భిల్లాడికిన్ = బోయవాండ్రు, చెంచువాండ్రు మొదలగువారికిని; అంపకోలన్ = బాణపు కఱ్ఱ చేతను; నూలన్ = దారపు ప్రోగు చేతను; పెనిచి = వృద్ధి చేసి; అరుజ స్వరూపులై = రోగము లేని తమ పూర్వీకులు కలవారై; పాఱువారు = బ్రాహ్మణులు; ఊర్జితము = వృద్ధి పొందుటకు; బలవ్రాత = సేవా సమూహము చేతను; అర్థ = ధనము చేతను; ఆఢ్యతన్ = ఒప్పి యుండుట చేతను; నెమ్మినుండక = నెమ్మదిగా నుండక; అలోభ = లోభరాహిత్యమును; చెలుల్ = స్నేహితులును; భాండాగారము = కోశాగారమును;

హయాద్యములు = గుఱ్ఱములు మొదలగునవి; మండలమున్ = రాష్ట్రమును; నవయన్ = నశించిపోగా; అరికిన్ = శత్రువునకు; ఆయతి కానికిన్ = ధనము రాబట్టువానికి; అమరాలయ ముఖ్యములు = దేవాలయము మొదలగువానిని; అర్థతృష్ణాయుతుడై = ద్రవ్యాశతో కూడినవాడై; దొరల్చి = హరించి; అపథ్యము కానన్ = కీడుగావున; రూపఱున్ = నశించిపోవును; ముల్లిడి = చుట్టును కంచెవేసి; వెండి = మరియును; గుద్దటన్ = పాఱచేత; ఎనసియయైనన్ = కపట స్నేహము చేసియైనను; నెగడఁ జేసి = ఒప్పు చేసి; కంటక శోధనన్ = ముండ్లు ఏరివేయటం (అంతః శత్రువులను) ఒరుదలకానిన్ = కొండెగానిని; మృషయేని = అసత్యమైనచో; ఉదస్తుగాఁగాక = ఉద్యోగము పోగొట్టుకున్నవానినిగా చేయకుండా; ఒక్క మతమునన్ = ఒక పక్షముననను;

అనృశంస్యముల్ = క్రౌర్య రాహిత్యమును; ఋతమున్ = సత్యమును; వశ్యకలన = వశము చేసికొనుట; కాల్బరకున్ = పదాతులకును; ఎలమిన్ = సంతోషము; ఘోటకమును = అశ్వమును; శుండాలంబున్ = ఏనుగును; సుభటుడు = మంచి భటుడు; మందురన్ = గుఱ్ఱపుశాలయందు; దొరలపాలు = అధికారుల వశము; పరపకుము = చేయకుము; అల్లవాడు = మాత్సర్యము లేక మొదట హితము చెప్పినవాడు; అర్థసిద్ధికిన్ = ధనాదాయమునకు; మూలము = కారణము; ఇల యొకింతైనన్ = భూమి కొంచెమైనను ; అరిన్ = పన్నులందు; నవిసి = క్షీణించి; కలని = యుద్ధములోని; నక్కైన = నక్కవలె అశుభమును కోరుచున్న; అవనీశుడు = రాజు; సుహృత్తతి = మిత్రబృందము ; విపత్ = తనకు కలిగిన ఆపదకును; ఉగ్రదండ = అపరాధుల విషయమైన భయంకరమగు శిక్షకును; పరతంత్రుడు గాక = అధీనుడు గాక; చిరంబు = బహుకాలము; అచ్ఛభల్లంబుగతిన్ = ఎలుగుబంటివలె; బహిరంతః = బాహ్యాంతరములయందున్న; అరులపైన్ = శత్రువులమీద; దృష్టి వలయున్ = చూపు ఉంచవలయును; మతంగజములు = ఏనుగులును; శ్రీఖండ = చందనము; ముక్తాదియున్ = ముత్యములు మొదలగునవియును; వర్షంబుటెవ్వన్ = క్షామముచేత; రుజన్ = అంటువ్యాధులచేతను; హావళ్ళన్ = ఉపద్రవముచేతను; దిగు = చేరినటువంటి; అన్యభూప్రజలన్ = కాందిశీకులను; ఆయాయి = వారి వారి; జాత్యౌచితిన్ = కులములకు తగినట్లుగా; ప్రోవంగాన్ తగున్ = రక్షించవలయును; దొడ్డి = పశువుల మందలుంచు స్థలము;

గనులు = రత్నములుండు ప్రదేశములు; ఆప్తుల్ = హితము కోరువారు;

చూడపంపదగున్ = పరామర్శ చేయుటకై పంపుట యుక్తము; ద్రవిణము = ధనమును; నొవ్వఁగొంట = ప్రజలను పీడించి పన్ను తీసికొనుటయు; ఒఱన్ = ఆలోచనను; ద్రాబలతోన్ = నీచ జనులతోడ; ఇడుచుంటన్ = చేయుచుండుటయును; భూమికొంత= కొంత దేశమును; ఆవలికిన్ = వెలుపలికి; ఇచ్చుచుంట = ఇచ్చుటయును; ప్రథమాప్తతన్ = ముఖ్యముగా ఇష్టులైనవారిని; చూడక = విచారింపక; శంకనుంటన్ = సందేహముతో నుండుటచేత; లోన్ = లోలోపల; పోవయు = పొగరాజుచున్నట్టి; నృపాళికై = శత్రువువద్దనుండు రాజుల కొరకు; అభయమున్ = అభయ దానమును; గుప్తిన్ = రహస్యముగా; భూధవుడు = రాజు; భేదన్ = భేదోపాయము చేతను; అరియందిడందగున్ = శత్రువునందు ఉంచదగును; తనయందున్ = తనయొద్ద; మాన్పుకోదగన్ = లేకుండచేసి కొనవలయును; సింధుర = ఏనుగులను; చేర్చు = తెచ్చుచున్నట్టి; దవుల = దూరమందున్న; దివివణిజులకున్ = ద్వీపము యందలి వర్తకులకు; కొలువున్ = నిత్యము నీ సేవయును; బహుమానములను; వెలమేలుకలుగన్ = ఆదాయము ఎక్కువ వచ్చునట్లు; అరిన్ = నీ శత్రువును; ప్రాతవారిగాన్ = వారలను నీవారిగాను; చేయుము = ఒనర్చుకొనుము; నవంబుగన్ = క్రొత్తగా; మంత్రమునకున్ = ఆలోచనలకు; క్రొత్తమన్ననన్ = క్రొత్త బహుమానములకు ఉప్పొంగి; రహిన్ = తేజముతో; అడగున్ = చెడిపోవును; పురుషాయుషావధికిన్ = నూరు సంవత్సరముల వరకును; క్షితులొసగి = భూములిచ్చి; ప్రజావిరుజంబుగాగ = తన దేశపు ప్రజలు బాధపడకుండునట్లుగా; బండరువున్ గూర్చి = ధనాగారమును నింపి; చరదృష్టిచేత = గూఢచారులచేతను; బకగతి = కొంగవలె దాగియుండి; హఠాద్గతిన్ = హఠాత్తుగా ఆక్రమించి; తాన్ = తనయొక్క; ప్రజయున్ = ప్రజలును; నొవ్వకయ = బాధపడకుండ; పగర = శత్రువులయొక్క; గాత్రములనె = దేహములను; నృపతి = రాజు; డెందానం = హృదయమునందు; చేయిడి = చేతిని ఉంచుకొని; నిద్రపోవు = సుఖముగా నిద్రించును.

**సంధులు :**

**ఈ క్రిందివానిని విడదీసి సంధిపేర్లను వ్రాసి, సూత్రములను వ్రాయుము.**

బ్రహ్మోత్తరము, ఎవ్వాడు, గుణాతీతుడు, నిజోర్వి, తృష్ణాయుతుడు, నిద్రవోవు.

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహ వాక్యములు వ్రాసి, సమాసముల పేర్లను వ్రాయుము.**

భూపతి యాజ్ఞ, అధర్మభీతి, నృపశాస్త్రము, దేశవైశాల్యము, అర్థ ధర్మములు, సద్గృహములు.

**అర్థ సందర్భములు :**

1. కాపురుషుల మీదలిడకు కార్యభరంబుల్
2. వేళవేళఁ బనులు గొనుము
3. గుమ్మడికాయంతగు ముత్తెంబై
4. దొరలపాలు పఱుపకు మెపుడన్
5. ప్రబలఁ జేసిన నర్థ ధర్మములు పెరుగు
6. తోటఁ దొడ్డిగను లాప్తు ల్పాడఁ బంపదగున్

**ప్రశ్నలు :**

1. రాజు ఎట్టి మంత్రివర్గమును ఎన్నుకొనవలెను?
2. ద్రవ్యాశతో నున్నవారికి ఉద్యోగము ఏల యివ్వరాదు?
3. రాజు రాష్ట్రాదాయమును ఎట్లు విభజింపవలెను?
4. రాజు ఎటువంటి నీతి సూత్రములు పాటింపవలయును?
5. రాజు, తన రాజ్యము క్షేమముగా నుండుటకు ఏమి చేయవలెను?

***విద్యార్థులకు సూచన :***

రాజనీతి ప్రాముఖ్యతను అవగాహన చేసికొని, శ్రీకృష్ణదేవరాయల పరిపాలన గురించి తెలిసికొనుము.

***ఉపాధ్యాయులకు సూచన :***

ఆముక్తమాల్యదలోని కథలను విద్యార్థులకు తెలియజేయుట యుక్తము.

# 4. కోకిలమ్మ పెళ్లి

**- విశ్వనాథ సత్యనారాయణ**

*__"జ్ఞానపీఠ"__ పురస్కారాన్ని అందుకొన్న తొలి ఆంధ్రుడు, తెలుగువారు గర్వించదగిన సాహిత్యమూర్తులలో శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు ప్రముఖులు.*

*శ్రీ సత్యనారాయణగారు __1895__ సంవ॥న కృష్ణాజిల్లాలోని నందమూరులో జన్మించిరి. చిన్ననాటినుండి తెలుగును, తెలుగుదనాన్ని ప్రేమించి తెలుగు భాషాసాహిత్యమును తన రచనలద్వారా ప్రచారము గావించిన మహనీయుడు.*

*__"రామాయణకల్పవృక్షము, వేయిపడగలు, ఏకవీర"__ మున్నగునవి వీరి రచనలలో పేర్కొనదగినవి. సాహిత్యరంగములో కథలు, నవలలు, నాటకములు, విమర్శలు, అనువాదములు, కవితలు మొదలగు ఎన్నో ప్రక్రియలు వ్రాసి ఆంధ్రకవితామతల్లికి తన జీవితమంకితము గావించుకొన్న మహామనీషి.*

*__'కళాప్రపూర్ణ' 'పద్మభూషణ్'__ బిరుదములు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థానకవి, శాసనమండలి సభ్యత్వం వంటి ఎన్నో పురస్కారాలు, __గజారోహణ__ సన్మానము లందుకొన్నవారు విశ్వనాథవారు.*

*యువతరాన్ని ఉఱ్ఱూతలూగించిన __'కోకిలమ్మ పెండ్లి'__ మన ప్రస్తుత పాఠ్యాంశము. ఇందు తెలుగుతీయందనము, ఆత్మీయత, ప్రకృతివర్ణన చక్కగా వర్ణింపబడియున్నవి.*

లేతబుర్రలు కొక్కిరిస్తే
ఆతగాళ్ళతొ యేమిగానీ
తాత తాతలనాటి కతలూ
తవ్విపోస్తానోయ్ ! 1

ఊగులాడే కడలితరగలు
నాగుబాముల కోడెలల్లే
ఒడ్డుదాకా ప్రాకి ప్రాకి
ఒరిగిపోతా యోయ్ ! 2

ఒడ్డుదాకా అడవి అడవిలో
దొడ్డ చెట్లున్నాయి తరగల
వూగులాడే గాలిచేతా
వూగుతుంటాయోయ్ ! 3

అడవిలోనూ కడలిలోనూ
అద్దరాతిరివేళ అప్పుడు
తొగరుకన్నుల చుక్కకన్నెలు
తొంగి చూస్తారోయ్ ! 4

పొద్దు కూకేవేళ వొడ్డున
ముద్దు ముద్దుగ తిరుగుతుంటూ
సొగసునడకల గాలిపిల్లలు
సోకుపోతారోయ్! 5

సుళ్ళు తిరిగే కడలినడుమా
చూపు కందీ అందకుండా
తెప్ప లేసుకు పాముపడుచులు
తేలిపోతారోయ్ ! 6

ఒడ్డునే బంగారు చేలూ
ఒడ్డునే పూవుల్లు చేత్తో
ఊరికే యిట్లంటె చాల్ పా
లుబికిపోతాయోయ్ ! 7

నేను చెప్పేకతలు జరిగీ
యెన్ని నాళ్ళయ్యిందొ అప్పుడు
మలయ పొదలూ కొండకోనలు
తెలుగునాడంతా ! 8

కడలి వొడ్డున పల్లె వొక్కటి
కలదు. ఛే డున్నాడు దానికి,
అప్పటికె యీ తెలుగు లంతా
గొప్ప యెకిమీళ్ళూ ! 9

దొడ్డదొర, అతగాడి నేలలొ
ఎడ్డెపనులే చేయ రెవ్వరు,
దొంగనాగరికతలో దేశం
తూలిపోలేదోయ్ ! 10

ఉన్న వాళ్ళకు ఎంతనేలా
దున్నుకుంటే చాలుతుందో
మించి ముట్టరుకూడ పైనా
చిన్న చెక్కయినా 11

అందరికి కావలసినంతా
వుంది, యెవ్వరితోడ నెవరికి !
నెన్నడూ చూడ లేమన్నా
చిన్ని తగవైనా ! 12

ఆ దొరకి కూతుళ్ళు ఇద్దరు,
మోదుగులు పూశాయి పెదవులు,
వారి పేరులు, చిలకతల్లీ,
కోకిలమ్మానూ 13

కోకిలమ్మా నల్లనీదీ
చిలకతల్లీ పచ్చనీదీ
చిలకతల్లికి కోకిలమ్మకు
ఎప్పుడూ పడదూ 14

చిలకతల్లీ చిన్ననాడే
పలుక మొదలెట్టింది ముద్దుల
మొలకలై తండ్రికీ మేనూ
పులకరించిందీ 15

ఎన్నొయేళ్ళూ వచ్చినాయీ
కన్ను లింతగ తెరచినాదీ
పాప మేమో ! కోకిలమ్మకు
మాటలే రావూ 16

చిలకతల్లికి రంగు రంగుల
చీరలూ తెస్తాడు తండ్రీ,
కోకిలమ్మను ఊరికేనే
కోప పడతాడూ 17

చిలకతల్లీ నవ్విపోతే
తండ్రి మారూ పలుకకుంటే
తల్లి వంకా చూచి కోకిల
తెల్లపోతుందీ 18

చిలకతల్లీ వెక్కిరిస్తే
తండ్రి వచ్చీ కసురుకుంటే
తల్లి వెనుకా దాగిపోతూ
తల్లడిలుతుందీ 19

తల్లి యేమీ చెయ్యలేకా
తానుకూడా విసుక్కుంటే
కోకిలమ్మా లోనె లోనే
కుమిలిపోతుందీ 20

అడవిలో యే చెట్టుకిందో
అంత యెగ్గా తలచుకోనీ
కూరుచున్నది కూరుచుండే
కుంగిపోతుందీ 21

చెట్టుతోనో పుట్టతోనో
చెప్పుకుందా మన్నగానీ
ఎట్టివాడో వాడు నోరూ
పెట్టలేదాయే 22

కొండవాగుల వెంట పోతూ
కొండపువ్వులవంక చూస్తూ
ఎంత పొద్దోయినా గానీ
యింటికే పోదూ 23

ఒక్కొకప్పుడు తెల్లవార్లూ
అడవిలోనే వుండిపోతే
తల్లి ఊరక తెల్లవార్లూ
తల్లడిలుతుందీ 24

వానరోజులు వచ్చిపోగా
చలి పగళ్ళూ సాగిపోగా
ఆకురాలుట ఆగి చివురులు
జోక తాల్చాయి 25

చివురులో యీనెల్ల పసిరిక
పూవుల్లో తేనెల్ల, పలపల
చిలకతల్లికి కోకిలమ్మకు
వయసు వచ్చిందీ 26

చిలకతల్లీ చదువు చూచీ
చిలకతల్లీ సొగసు చూచీ
గాలిపిల్లలుకూడ లోపల
కలత పడ్డారూ 27

చిలకతల్లీ అందమంతా
చిందిపోయీ అన్నివైపుల
కనుల చూడని వారుకూడా
అనుకునేవారే 28

ఎల్లవారూ చిలకతల్లినె
పెళ్ళికై కోరారు, తండ్రి
తల్లి మాత్రము పిల్లదాన్నీ
కళ్ళుకాస్తారు 29

కడలి అడవులషేండ్ల తమలో
కలుపుకుంటారేమొ అనుకుని
గడపదాటీ చిలకతల్లిని
కదలి పోనీరూ 30

ఇంటిముంగలి దాటనీకా
ఇంటిపనులూ చేయనీకా
కంటికీ రెప్పాకి మల్లే
కాచుకుంటారూ 31

చిలకతల్లీ అంద మేమో
చిలకతల్లీ పెళ్ళి యేమో
తల్లి దండ్రీ కోకిలమ్మను
తలచనే పోరూ 32

ఒక్క మధ్యాహ్నంబునందున
చెక్కులను కుండల ప్రభలవి
పిక్కటిలి బ్రాహ్మణుం డొక్కరు
డక్కడికి వచ్చెన్ 33

చిలకతల్లీ తల్లిదండ్రులు
చేరవచ్చిన అతనికోసము
కోరినట్టివి యన్ని యిచ్చీ
ఆదరించారూ 34

వేదపనసలు చెప్పుకుంచూ
వాదములకూ కాలం త్రవ్వుచూ
ఆయనా తెలుగురాజింట్లో
ఆగివున్నాడూ 35

అతని వేదధ్వనులు వింఛూ
అతని వర్చస్సంత కంఛూ
చిలకతల్లీ అతని తనలో
నిలిపివేసిందీ 36

సంగతంతా తెలిసి ఱేడూ
పొంగిపోయాడేమో కానీ
తల్లికీ చిలకతల్లంటే
వెఌ్ళకొచ్చిందీ 37

కోనలందూ అడవులందూ
కోకిలమ్మా తిరుగుతోందీ
ఎంత యేడుస్తోందొ తల్లీ
యింటికే రాదూ 38

ఏ యెఱుంగని నేలవాడో
యింటికొస్తే వాడిమీదా
చిలకతల్లీ వలపు తానూ
నిలిపివేసిందీ 39

కోకిలమ్మా యింటికైనా
రాక అడవుల్లోనే తిరుగుతు
పోకిళ్ళమారైంది, తల్లి
కాకపోయిందీ 40

అడవులెంటా కోనలెంటా
బుడబుడా చను సెలల వెంటా
అడుగులూ తడబడా వెదుకుతు
నడిచిపోయిందీ 41

అడవి మెకములు తిరుగులాడే
ఎడము లేనీ అడుగులొప్పే
అడవిలోపలి కోనలెల్లా
తడివి చూసిందీ 42

ఎచట పోయీ వెదకినానూ
ఎందు లేదూ కోకిలమ్మా
ఎచ్చటుందో తల్లిగుండే
వ్రచ్చి పోయిందీ 43

ఒక్క సెలయేట్లోకి వేరూ
మిక్కిలీ పోయినా ముషిణి
ప్రక్క చెట్టూ క్రింద కూర్చుని
స్రుక్కిపోయిందీ 44

తల్లి వెనకా యింతసేపూ
మెల్లగా వస్తోంది కోకిల
తల్లి బాధా కళ్ళ చూసీ
గొల్లు మన్నాదీ 45

ఉరుములా వురుమింది కోకిలా
మెరుపులా మెరిసింది కోకిల
వొక్కగంతున తల్లివొళ్ళో
వచ్చి పడ్డాదీ 46

తల్లి బిడ్డను బిడ్డ దల్లిని
కళ్ళు మూసుకు కౌగిలించీ
ఒళ్ళు తెలియక చెట్టు మొదటా
ఒరిగిపోయారూ 47

తల్లి బిడ్డల ప్రేమ అంటే
యిల్లాగు వుండాలంటూ
ప్రకృతిదేవీ వొళ్ళు తెలియక
పాట పాడిందీ 48

ఎప్పుడూ గిలకల్లె అడవిలో
ఎచట చూస్తే అచటవుండే
చిన్న కోకిల లేక అడవీ
చిన్నవోయిందీ 49

కోకిలమ్మా తిరుగులాడని
కోకిలమ్మా లేని అడవీ
కోనలకు తొలు కారుటందం
కొరతపడ్డాదీ 50

తల్లి అంటే అంతప్రేమా
వెళ్ళ గక్కిన కోకిలమ్మకు
చావు లేదని మావిచివురూ
సాగులాడిందీ 51

తల్లి అంటే అంతప్రేమా
వెళ్ళ గ్రక్కిన కోకిలమ్మా
మునిగిపోదని అడవిపూటా
ముర్మురించిందీ 52

తల్లి అంటే అంతప్రేమా
వెళ్ళ గ్రక్కిన కోకిలమ్మా
బ్రతికి వస్తుందంచు అడవీ
పాట పాడిందీ 53

వానలన్నీ వెనుకపట్టీ
కోనలన్నీ నీరుపట్టీ
ఆకురాలే కారుకూడా
ఆగిపోయిందీ 54

చిన్న మొగమున కుంకుమిడినా
కన్నె పేరంటాలి మల్లే
చెలువుగా అడివంత క్రొత్తగా
చివురు తొడిగిందీ 55

ఎక్కడో అడవిలో చివరా
చక్కగా సన్నగా యేదో
చిక్కనైనా తేనెపాటా
జీరు వారిందీ 56

ఆపాట వింటూనె అడివీ
అడివిగా నిలువెల్ల, పోయిన
వొక్కచుట్టం వచ్చినట్లూ
పులికిపడ్డాదీ 57

సన్నగా పోతున్నవూటా
జాలు జా లింతై వెడల్పై
పట్టలేకా ఓర్పు జలజల
పరువులెత్తిందీ 58

కోకిలమ్మా అదుగొ మళ్ళీ
కూసెనంటె వచ్చెనానీ
వచ్చెనంటే వచ్చెనానీ
బ్రతికెనంటే బ్రతికెనానీ 59

చెన్ను తరగని మావిమోకా
చివురు తొడిగిందీ
అంతలోపల అడవి కందం
అతిశయించిందీ 60

అంతలో పూవుల్ల ఱేడు
వింతవింతల సోకు లేలిక
చెక్కులా నవ్వాలు చిలుకుతు
చేరవచ్చాడూ 61

ఏడాది కొకసారి వస్తా
డేడాది కొకసారి తెస్తా
డెన్ని పువ్వులు, అతనివేనూ
వన్నెలూ చిన్నెల్ 62

వచ్చావటయ్యా పూలఱేడా,
తెచ్చావటయ్యా పూలరాజా,
నీవు తెచ్చిన పూవులే కా
నికల కిస్తాము 63

కోకిలమ్మను ముద్దుపెళ్ళీ
కూతురును చేస్తాము, పెళ్ళీ
కొడుకును చేస్తాము నీకూ
కూర్చి వేస్తాము 64

కోరి నీ అందానికీ మా
కోకిలమ్మా గొంతుకునకూ,
సొగసుచేతా పాటచేతా
తగేపోయిందీ 65

రావయ్య ఓ పూలరాజా
రావయ్య ఓ అందగాడా
కోకిలమ్మకు నీవు, నీకూ
కోకిలా తగునూ 66

వారి పెళ్ళికి అడవి అంతా
తోరణాలైనాయి చివురులు
కాపలా కాసినై పూలులూ
గండశిలలందూ 67

సన్నాయి పాడింది తెల్లని
సన్ననీ సెలవూట పూలా
వెన్నెలై ప్రకృతి తల్లేమో
కన్ను తెరిచిందీ 68

పూలసోనలు కురిసినై, తే
నేలపాటలు విరిసినై, అం
దాల త్రోవలు వెలిసినై, రాజ
నాలు పండినవి 69

చిలకతల్లి మహాన్వయంబున
నిలిచినవి సాంస్కృతికవాక్కులు
కోకిలమ్మా తెనుగుపలుకూ
కూడబెట్టిందీ 70

## అధ్యయన వేదిక

**అర్థములు :**

కడలి తరగలు = సముద్రపు అలలు; దొడ్డచెట్లు = గొప్ప చెట్లు; తొగరు = ఎఱుపు; సొగసు = అందము; ఱేడు = రాజు; పేరులు = దండలు; కదురు = నూలువడికెడు సాధనము; ఎడ్డెపనులు = మూర్ఖపు పనులు; కుండల ప్రభ =

కర్ణభూషణములకాంతి; పోకిళ్ళు = చేష్టలు; సెలలు = సెలయేళ్ళు; వ్రచ్చి = చీల్చుట; స్రుక్కి = భయపడి; చెలువుగా = అందంగా; జాలు = నది; పూలసోనలు = పూలవర్షము; రాజనాలు = ధాన్యములు

**సంధులు :**

**ఈ క్రింది పదములను విడదీసి సంధి పేర్లను వ్రాసి, సూత్రములను వ్రాయుము.**

ఊడేడున్నాడు, మహాన్వయంబు.

**సమాసములు :**

**ఈ క్రింది సమాసములకు విగ్రహవాక్యములు వ్రాసి, సమాసముల పేర్లను వ్రాయుము.**

లేతబుర్రలు, చుక్కకన్నెలు, కొండ కోనలు, తల్లిదండ్రులు.

**అర్థ సందర్భములు :**

1. ఎడ్డె పనులే చేయరెవ్వరు
2. ఒక్క గంతున తల్లి వొళ్ళో పడ్డాది
3. అడవి కందం అతిశయించిందీ
4. కాపలాకాసినై పులులూగండశిలలందూ

**ప్రశ్నలు :**

1. కోకిలమ్మపట్ల తండ్రి ఎట్లు వ్యవహరించెను?
2. కోకిలమ్మ ఎట్లు కాలము గడిపెను?
3. చిలకతల్లి సౌందర్యమును కవి ఎట్లు వర్ణించెను?
4. కోకిలమ్మను గూర్చి తల్లి పడిన వేదన యెట్టిది?
5. కోకిలమ్మ పెళ్ళి ఎవరితో ఎట్లు జరిగినది?

***ఉపాధ్యాయులకు సూచన :***

ప్రాచీన సాహిత్యప్రపంచమున సంస్కృత, తెలుగుభాషలకు గల స్థానమును విద్యార్థులకు తెలుపుట యుక్తము.

# 5. హంసుని గర్వభంగము

**- నాచన సోమనాథుడు**

*'సాహిత్యరసపోషణ, సంవిధాన చక్రవర్తి' 'నవీన గుణ సనాథ బిరుదాంకితుడు' నాచన సోమనాథుడు క్రీ.శ. **14**వ శతాబ్దికి చెందినవాడు. విద్యానగరాధిపతి బుక్కదేవరాయల సత్కారములందుకొన్న ప్రౌఢకవి. రెడ్డి రాజ్యమునకు ప్రథమాస్థానకవి ఎఱ్ఱాప్రెగ్గడయైనట్లు నాచన సోముడు విజయనగరరాజ్య ప్రథమాంధ్రకవిగా పేర్కొనబడుచున్నాడు.*

*నన్నయ, తిక్కన్నల ధారాశుద్ధి భావగాంభీర్యమీతని రచనలలో కన్పించును. రసపోషణ, కథా కథనము, కథాప్రవర్తకములైన పాత్రల చిత్రణము, రంగస్థల వర్ణన, అలంకారికములైన శబ్దరచన చేయుటలో సిద్ధహస్తుడు.*

*సోమనాథుని కవితాయశస్సుకు కారణభూతమైనది ఉత్తరహరివంశము. వసంతవిలాస మనెడు గ్రంథమును రచించినట్లు లక్షణగ్రంథములవలన తెలియుచున్నది. కాని అది అలభ్యము.*

*ఉత్తరహరివంశములోని హంసడిభకోపాఖ్యానము వీరరస ప్రధానమైన యొక ప్రత్యేక కావ్యముగా పేర్కొనదగిన ఉపాఖ్యానము. ప్రస్తుత పాఠ్యభాగము ఉత్తరహరివంశములోని చతుర్థాశ్వాసమునుండి స్వీకరింపబడినది. ఇందు హంసుని గర్వమును శ్రీకృష్ణుడు అణచుటయే ముఖ్యమైన యితివృత్తము.*

చ. తమబల మింక వీఁగు నని తత్సమయంబున గృష్ణరేవతీ
రమణులు దాఁకి రయ్యిరువురన్ సురసిద్ధమునీంద్రబృందముల్
సమరము జూచి మెచ్చ హరశాసనతత్పరభూతయుగ్మముం
గ్రమమునఁ దోఁచెఁ దోడుపడ రాజకుమారుల రెండుదిక్కులన్. 1

మ. హరితో హంసుఁడు సీరితో డిభకుఁడున్ హుంకారహుంకారభీ
కరశంఖధ్వని విక్రమం బమర వీఁకం దాఁకినం బాంచజ
న్యరవాడంబరమున్ సహింప కడరెన్ మాహేశుభూతద్వయం
బరవా యించుక లేక హ స్తధృతశూలాకారఘోరంబుగన్. 2

గీ. అడరి హరిమేను శూలంబు నదుముటయును
జిఱునగవుతోడ దివిజు లచ్చెరువు నొంద
వారితేరిపై కుఱికి చేయూరఁ బట్టి
విసరి యుత్తరదిక్కునవీచివైచె. 3

క. వైచిన నిరువురుఁ గైలా
సాచలశిఖరమునఁబడి మహాద్భుతమతు లై
రాచంద మెల్ల హంసుఁడు
చూచి హరిం గ్రోధపరవశుండై పలికెన్. 4

✶ఉ. విఘ్నము చేసె దేల, పృథివీపతి లోకము గప్ప మిచ్చె శ
త్రుఘ్నత రాజసూయమఖదోహలి మాజనకుండు సత్కృపా
నిఘ్నుఁ డొకింత దోడ్పడిన నిన్ను ముదంబునఁ జూచు నీశిరో
దఘ్నము లింకఁ దెమ్ము కరదానముగాఁ గనకంపుఁగాలువల్ 5

✶ఉ. రాజుల కేను రాజ మఱి రాజశిరోమణి రాజు దేవతా
రాజికి నెల్ల నీవసమె రాసెదు నాసరివాఁడుగా విసీ
తేజము మాలి తంచు నతితీక్ష్ణశరం బరిఁబోసి యేసినన్
భ్రాజిత మయ్యె నప్డు హరిఫాలమునం దిలకంబు పోలికన్ 6

వ. ఇట్లేటు వడి విచారించి. 7

మ. ప్రకటస్యందనకేళికిం దగినసారథ్యంబు చేయంగ సా
త్యకిఁ జాలించి తదా త్తచిత్రగతిరథ్యాడంబరం బొప్ప ధా
రుకుఁ డేఁగం గడికాడిఁపై హుతవహక్రూరాస్త్రసంధానకా
ర్ముకహస్తుండు మురాంతకుండు పలుకుం గ్రోధాంధుఁడై హంసుతోన్.
8

ఉ. ఏమిరా హంస! కంసనరకేంధనబంధురమచ్చరానలం
బామిషముం గొనం గలదురా విడిపింపఁగ నిన్ను నేఁడు సం
గ్రామము చేసి నన్నడుగు కప్పము దర్పము నీకు నేల నా
నామునిబాధలం గమరినాఁడవు కాలినత్రాటిచందమై. 9

క. నినుఁ బొరిగొనియెద నిదెపో
జనులు మునులు విని ప్రమోద సంపదఁ దేలన్
మనుజాధమ! యని తొడిగిన
యనలాస్త్రం బేసె నదరు లంటఁగ వాఁడున్. 10

క. వారుణ బాణంబున నది
వారించె మురారి యేసె వాయవ్యాస్త్రం
బారాజకుమారుం డది
బోరన మాహేంద్రబాణమున నడఁగించెన్. 11

తే. హరి ప్రయోగించె మహేశ్వరాస్త్ర మప్పు
డతఁడు రౌద్రాస్త్రమునఁ దోన యడ్డకట్టె
నిట్లు ప్రతిబాణముల హంసుఁ డెచ్చుఁ గుందు
లేక పోరాడె శౌరికుద్రేక మెసఁగ. 12

మ. సరి గాంధర్వము రాక్షసంబు మఱి పైశాచంబు బ్రాహ్మంబనన్
హరి యేసెన్ వరుస న్మహాస్త్రముల నాహంసుండుఁ గౌబేరమా
సురమున్ యామ్యము వారుణంబు ననఁ దేజోరూపశస్త్రంబుల
న్మరలించె న్మొదలింటి నాల్గిటి రణోన్మాదోర్భటాకారుఁడై. 13

గీ. అచ్యుతుఁడు బ్రహ్మశిర మనునస్త్ర మేయ
హంసుఁ డాయస్త్రమున నది యడఁగ జేసె
నచ్చెరువు నొంది మురవైరి యమునలోన
వార్చి వచ్చి మహోగ్రభావంబు దాల్చి. 14

చ. తొడిగిన వైష్ణవాస్త్రమునఁ ద్రుంగితి పొమ్మని హంసు నేసినం
బిడుగులపిండువోలె నతిభీకరతం జనుదేర మాఱుగాఁ
దొడుగుశరంబులే కతఁడుఁ దోరపుబెగ్గల మెత్తి వ్రేయఁగాఁ
గడువడిఁ దేరు డిగ్గి పడెఁ గాళియానాగమహా హ్రదంబునన్ 15

మ. కదువేగంబున హంసుపై నుఱికి యాకంసారి కాళిందిలో
వడిఁ గాలం దన్నె లోకు లెఱుఁగ న్వాఁడంతలో జచ్చెనో
చెడెనో యెక్కడ వోయెనో యొకఁ డునుం జెప్పంగలేఁ డప్పుడే
పడెఁ బాతాళభుజంగ వక్త్రముల నప్పాపాత్ముఁ డం డ్రెప్పుడున్. 16

ఉ. ఈ తెఱఁ గాచరించి రథ మెక్కె మురారి ధరాధినాథ ! నీ
తాతపితామహుం డయినధర్మతనూజుఁడు రాజసూయవి
ఖ్యాతి వహించు నయ్యెడల హంసుఁడు ప్రాణముతోడనున్న నే
లా తుద చేరు నధ్వరము లావున వాఁడొరు నేల కై కొనన్. 17

✶క. వరములు శరములు హరుచే
దిరముగ హంసుండు వడయుదినమునఁ గాదే
ధర నవతరించె లక్ష్మీ
శ్వరుఁడు జగన్నాథుఁ డపుడు వార్ష్ణేయుండై. 18

వ. అద్దేవుండు గలుగుటంజేసి కౌంతేయురాజసూయంబు నిర్వహించె నట్లు
యమున మడువునం బడినహంసుఁడు పొడవడంగుట సకలగంధర్వులు
హరినామసంకీర్తనంబున గీతంబు లొనర్చిరి. 19

## అధ్యయన వేదిక

**అర్థములు :**

వీగు = విజృంభించు; కృష్ణరేవతీరమణులు = శ్రీకృష్ణబలరాములు; సమరము= యుద్ధము; యుగ్మము = జంట; సీరి = బలరాముడు; అడరెన్ = ప్రజ్వలించెను; అరవాయి = సంకోచము; అదుముట = తాకుట; దివిజులు= దేవతలు; అద్రి = కొండ; పృథివీపతిలోకము = రాజలోకము; దోహలి = ఇచ్ఛగలవాడు; దారకుడు = శ్రీకృష్ణుని రథసారథి; పొరిగొనియెద = చంపెదను; ప్రమోద = సంతోషము; అచ్యుతుడు = కృష్ణుడు; పిండు = సమూహము; బెగ్గలము = భయము; హ్రదంబు = లోతైన కాసారము, మడుగు; అధ్వరము = యజ్ఞము; లావు = బలము; హరుడు = శివుడు; వక్త్రములు = నోళ్ళు; వార్ష్ణేయుండు. = వృష్ణి సంతతివాడు (శ్రీకృష్ణుడు).

**సంధులు :**

**ఈ క్రింది పదములను విడదీసి సంధి పేర్లను వ్రాసి, సూత్రములను వ్రాయుము.**

మునీంద్రుడు, మహేశుడు, కనకంపుగాలువల్, మురాంతకుడు,అద్దేవుండు.

**సమాసములు :**

**ఈ క్రింది సమాసములకు విగ్రహ వాక్యములు వ్రాసి, సమాసముల పేర్లను వ్రాయుము.**

కైలాసాచలము, పృథివీపతిలోకము, కరదానము, హరిఫాలము.

**అర్థ సందర్భములు :**

1. విసిరి యుత్తరదిక్కున వీచివైచె
2. తెమ్ము కరదానముగా గనకంపుగాలువల్
3. హరిఫాలమునం దిలకంబు పోలికన్
4. గమరినాడవు కాలిన త్రాటి చందమై
5. లావున వాడొరు నేల కైకొనన్

**ప్రశ్నలు :**

1. శ్రీకృష్ణ బలరాములు హంస డిభకులతో పోరాడిన విధమెట్టిది?
2. హంసునితో కృష్ణుడేమని పలికెను?
3. కృష్ణుడు హంసుని యమునలో అణగద్రొక్కిన విధమెట్టిది?

***ఉపాధ్యాయులకు సూచన :***

హంస డిభకుల కథను పిల్లలకు తెలియజేయుట యుక్తము.

# 6. శిశుపాల వృత్తాంతము

### - నన్నయభట్టు

*11వ శతాబ్దమున రాజమహేంద్రవరమును రాజధానిగాజేసికొని వేంగీదేశమును పరిపాలించుచుండిన రాజరాజనరేంద్రుని ఆస్థానకవి నన్నయ భట్టారకుడు. ఆ రాజు ప్రోత్సాహముతో వేదవ్యాస విరచితమైన సంస్కృతభారతమును నన్నయ భట్టారకుడు ఆది, సభాపర్వములు, అరణ్యపర్వ సగభాగమును ఆంధ్రీకరించి **"ఆదికవి"** అనెడి బిరుదమును సార్థకత గావించుకొనెను.*

*అస్తవ్యస్తముగా నున్న తెలుగుభాషను సంస్కరించి **"ఆంధ్ర శబ్ద చింతామణి"** అనెడి వ్యాకరణ గ్రంథమును రచించి **'శబ్దశాసనుడు', 'వాగనుశాసనుడు'** అనెడి బిరుదములను తన సొంతము గావించుకొనెను. నన్నయ కవిత్వములో **"ప్రసన్న కథా కలితార్థయుక్తి" "అక్షర రమ్యత, నానారుచిరార్థసూక్తి నిధిత్వం"** అనెడి త్రిగుణములు స్పష్టముగా కనిపించును. దీర్ఘజటిల సంస్కృత పదజాలమును వాడినను పండితుల హృదయములందు చిరస్థాయిగా నాటుకొనునట్లు తన భారత రచన గావించి ఆంధ్రులకు, ఆంధ్రభాషకు ఆదర్శప్రాయుడుగా నిలిచిపోయిన మహాపండితుడు.*

*ప్రస్తుత పాఠ్యభాగము సభాపర్వములోని ద్వితీయాశ్వాసమునుండి గ్రహింపబడినది. ధర్మరాజు రాజసూయయాగ పరిసమాప్తి సమయమున భీష్మాదుల ఆనతిపై శ్రీకృష్ణునకు అగ్రతాంబూలమిచ్చుటకు సిద్ధపడెను. ఆ సందర్భమున చేది రాజ్యాధిపతి శిశుపాలుడు దానికి ఆక్షేపణ తెల్పుట, శ్రీకృష్ణుని తూలనాడుట, శ్రీకృష్ణుడాతని నూరు తప్పులను క్షమించుట, చివరకు చక్రముతో అతనిని వధించుటయిందలి యితి వృత్తము.*

వ. అని రూక్షాక్షరవచనముల నాక్షేపించుచున్న శిశుపాలుం జూచి సహింప
నోపక భీమసేనుం డతి రౌద్రాకారంబున నలిగిన. 1

✶చ. ప్రకటితకోపవేగమునఁ బద్మదళాయతనేత్రముల్ భయా
నకతరలీలఁ దాల్చె నరుణద్యుతి నుద్యత మై త్రిశాఖ మై
భ్రుకుటి లలాటదేశమునఁ బొల్చెఁ ద్రికూటతటి త్రిమార్గగా
నుకృతిఁ బ్రభంజన ప్రియతనూజున కంతకమూర్తి కచ్చటన్. 2

వ. ఇట్లు నిఖిలక్షత్రియత్రాసజననంబుగా నలిగి దంతసందష్టదారుణముఖుం
డై శిశుపాలనిర్మూలనాభీలసంరంభంబున నున్న భీమసేను వారించి భీష్ముం
డిట్లని చెప్పె నిద్దురాత్ముండు తొల్లి చేదివంశంబున దమఘోషుం డను
వానికి సాత్వతికిం జతుర్భుజ లలాటనేత్రంబులతో నుదయించి రాసభ
రవంబున నేడ్చుచున్నం జూచి తల్లిదండ్రులు భయవిస్మయాధీన మనస్కు
లయి యున్న వారికి నొక్క యశరీరభూతం బిట్లనియె. 3

✶ఆ. వీని నొరులు చంపఁగానోప రెవ్వరు,
నెవ్వరేని వీని నెత్తికొనుడు
మిగిలియున్న బాహుయుగళంబుఁ గన్నును,
నడఁగు వీనికతఁ డయంతకుండు. 4

వ. అనిన నయ్యశరీరివచనంబులు విని వార లాశ్చర్యమానసు లయి యా
కుమారుం జూడ వచ్చినవారి కెల్ల నెత్తికొన నిచ్చుచున్నంత. 5

చ. అతివికృతస్వరూపధరుఁ డైనకుమారకుఁ బ్రీతితోడ సా
త్వతిఁ దమమేనయత్తను ముదంబునఁ జూడఁగఁ గోరి యద్భుత
ప్రతిభులు రామకేశవులు పన్నుగ నేఁగిరి చేదిధారుణీ
పతిపురి కొక్కనాఁ డఖిలబాంధవ మంత్రి సుహృత్సమేతులై. 6

వ. ఇట్లు వచ్చినరామకేశవులం బ్రియసత్కారంబులఁ బూజించి సాత్వతియు
నబ్బాలు బలదేవుచేతికి నెత్తికొననిచ్చి తదనంతరంబ నారాయణుచేతికి
నిచ్చిన. 7

క. అక్కొడుకు నబ్జనాభుం,
డక్కజముగ నెత్తికొనుడు నందఱుఁజూడన్
గ్రక్కున నొక్కట నడఁగెను,
మిక్కిలిచేతులును వానిమిక్కిలికన్నున్. 8

వ. దానిం జూచి సాత్వతి యద్భుతచిత్తయై యశరీరిపలుకు లప్పుడు దలంచి
తన పుత్రునకు మురవై రివలన మరణం బగుట యెఱింగి యతనికిట్లనియె.
9

★క. కుపథప్రవృత్తుఁ డయి వీఁ,
డపనయమున నీకనిష్టుఁ డయినను గరుణా
నిపుణుఁడ వై నీమఱఁదికి,
నపరాధశతంబు సైపుమయ్య యుపేంద్రా! 10

వ. అని వీనితల్లి తొల్లి జగద్వల్లభుం డైన జనార్దనుం బ్రార్థించి తత్ప్రసా
దంబున వరంబు వడయుటంజేసి శతాపరాధంబులు నిండునంతకు
వీఁడన్యులచేత నప్రతిహతుండు కృష్ణునిచేత నిహతుం డగు నది
కార ణంబుగా. 11

చ. ఇతనికి నిట్లు నన్నుఱక యెగ్గులు పల్కఁగఁ బోలెఁ గాక యు
ద్ధతమతి నన్ను లీతనివిధంబునఁ బల్కి మదీయచాప ని
ర్గతచటులోగ్రమార్గణనికాయపయోధి మునుంగ కిట్లు ద
ర్పితు లయి పోవనేర్తురె గభీరపరాక్రమ! మారుతాత్మజా! 12

వ. అని పలుకుచున్న భీష్మభీముల నతిక్రమించి శిశుపాలుండు
జనార్దనున కభిముఖుం డయి యిట్లనియె. 13

మ. అవమాన్యున్ సభలోన మాన్యుఁ డని సౌహార్దంబునం గౌరవ
స్థవిరప్రేరణ నిన్నుఁ బాండుతనయుల్ తప్పంగఁ బూజించి ర
య్యవివేకాస్పదు లైనపాండవులు మోహాంధుండు భీష్ముండుఁ గే
శవ! నీవుం గడఁగుండు నాకు నెదురై సంగ్రామరంగంబునన్. 14

వ. అని శిశుపాలుండు గర్వించి పలికిన విని చక్రధరుఁ డఖిలరాజచక్రంబు
విన నిట్లనియె. 15

సీ. ప్రాగ్జ్యోతిషంబున భగదత్తుపయి నేము
వోయిన నీతఁ డ న్యాయవృత్తి
నిట బాలవృద్ధుల కెల్ల భయంబుగా
ద్వారకాపురిఁ గాల్చె, వీరులైన
భోజరాజన్యులు పొలఁతులతోడ రై
వతకాద్రిఁ గ్రీడాభిరతిఁ బ్రమత్తు
లయి యున్న వారల ననయుఁ డై వధియించె,
దేవాభుఁడగువసుదేవుచేయు

ఆ. నశ్వమేధమునకు నభ్యర్చితం బైన,
హయము నపహరించి యజ్ఞమునకు
విఘ్న మాచరించె వీఁడతిపాపుఁ డై,
బభ్రుభార్యఁ దనకు భార్యఁ జేసె. 16

వ. మఱియు వాగ్విషయంబు అయిన యపకారంబు లనేకంబులు సేసె, మాయత్త సాత్వతి నన్నుం బ్రార్థించుటంజేసి యిద్దురాత్ముండు సేసిన యపరాధశతంబు సహించితి నిప్పుడు మీ రిందఱు నెఱుంగ నాయం ద కారణవ్యతిక్రమం బుపక్రమించి యత్యంతశత్రుం డయ్యె ననిన విని శిశుపాలుం డతిపరుషవచనం డగుచుఁ బురుషోత్తమున కిట్లనియె. 17

క. నీకూర్మియు నీయలుకయు,
నా కవి యేమిటికి దుర్గుణప్రియ! మొదలన్
నాకిచ్చిన యక్కన్యకఁ
జేకొని నీ కిట్లు పలుక సిగ్గను లేదే! 18

చ. అని శిశుపాలుఁ డొండొకట నప్రియముల్ హరిఁ బల్కుచున్నచో
ననలశిఖాలి దూల దనుజాంతకచక్రము రాజచక్ర మె
ల్లను భయ మంద మూర్ధవికలంబుగ నప్పుడు నేసెఁ జేదినం
దనుతనువుల్ బృహద్రుధిరధారలు బోరన మీఁది కొల్కఁగన్. 19

✶ఉ. ప్రల్లద మేది యిట్లు శిశుపాలుఁడు వజ్రహతాద్రితుల్యుఁడై
త్రెళ్ళుడు వానిదైన పృథు దేహము వెల్వడి తేజ మంబరం
బెల్ల వెలుంగ వచ్చి పరమేశ్వరుదేహము సొచ్చె విస్మయో
త్ఫుల్ల విశాలనేత్రు లయి భూపతు లెల్లను జూచు చుండఁగన్. 20

క. ఘనజాలము లేకయుఁ బెలు,
చన పిడుగులతోడివృష్టి చైద్యునిపాతం
బునఁగురిసె సముద్రమహా
ద్రినికాయముతో ధరిత్రి దిర్దిరఁ దిరిగెన్.
21

## అధ్యయన వేదిక

**అర్థములు :**

రూక్షాక్షర వచనంబులు = కఠినమైన మాటలు; అరుణద్యుతి = ఎఱ్ఱని కాంతి; ఉద్యతమై = పైకెత్తబడిన; భ్రుకుటి = బొమముడి; ప్రభంజనప్రియ తనూజుడు = వాయువుయొక్క ముద్దుబిడ్డ; త్రాస = భయము; సందష్ట = కరవబడిన; లలాటము = ఫాలభాగము; రాసభరవమున = గాడిద గొంతుతో; యుగళము = జంట; అంతకుడు = యముడు; రామకేశవులు = బలరామకృష్ణులు; అక్కజము = ఆశ్చర్యము; మురవైరి = కృష్ణుడు (మురా అనెడి రాక్షసునికి శత్రువు); కుపథ ప్రవత్తుడు = చెడ్డదారిలో నడచువాడు; అపనయము = నీతిలేని; అప్రతిహతుండు = చావు లేనివాడు; ఊఱక = లక్ష్యపెట్టక; కాయము = శరీరము; పయోధి = సముద్రము; మారుతాత్మజా = భీమసేనా; జనార్దనుడు = కృష్ణుడు; కౌరవస్థవిరుడు = కురువృద్ధుడు (భీష్ముడు); సంగ్రామము = యుద్ధము; ఏము = మేము; పొలతులు = స్త్రీలు; అనయుడు = నీతిలేనివాడు; హయము = గుఱ్ఱము; దనుజాంతకుడు = కృష్ణుడు; మూర్ధవికలంబుగ = తల లేనట్లుగా; రుధిరము = రక్తము; వృష్టి = వర్షము;

**సంధులు :**

**ఈ క్రిందివానిని విడదీసి సంధి పేర్లను వ్రాసి, సూత్రములను వ్రాయుము.**

ఇద్దురాత్ముండు, అబ్బాలు, మోహాంధుడు, క్రీడాభిరతి, అత్యంత, పురుషోత్తముడు, అక్కన్యక, మేనయత్త

**సమాసములు :**

**ఈ క్రింది సమాసములకు విగ్రహ వాక్యములు వ్రాసి, సమాసముల్ల పేర్లు వ్రాయుము.**

చతుర్భుజుడు, తల్లిదండ్రులు, బాహుయుగళము, రామకేశవులు, శతాపరాధంబులు, భీష్మ భీములు, సంగ్రామ రంగము, అప్రియములు, అబ్జనాభుడు.

**అర్థ సందర్భములు :**

1. వీని కతడ యంతకుడు
2. అపరాధ శతంబు సైపుమయ్య యుపేంద్రా!
3. నీవుం గడఁగుండు నాకు నెదురై సంగ్రామ రంగంబునన్
4. అక్కన్యక చేకొని నీకిట్లు పలుక సిగ్గును లేదే!
5. ధరిత్రి దిర్దిర తిరిగెన్.

**ప్రశ్నలు :**

1. శిశుపాలుని జన్మవృత్తాంతము తెలుపుము?
2. కృష్ణునివద్ద సాత్వతి ఎట్టి వరము కోరెను?
3. శిశుపాలుడు చేసిన అపరాధము లేవి?
4. కృష్ణుడు శిశుపాలుని ఏ విధముగా చంపెను?

***ఉపాధ్యాయులకు సూచన :***

భారతములోని సభాపర్వమును గూర్చి విద్యార్థులకు తెలియజేయుట యుక్తము.

# 7. మైత్రీబలజాతకము

## - శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

*శ్రీ సన్నిధానం సూర్యనారాయణగారు కృష్ణాజిల్లాలోని చిరివాడలో **1897** సం॥న జన్మించిరి. బుచ్చి నరసమ్మ, సుబ్బయ్యగార్లు వీరి తల్లిదండ్రులు. బహుభాషాపండితుడు. అనేక విద్వత్సభలలో సన్మానములు పొందిరి. **తత్సమచంద్రిక, ఆంధ్రప్రబంధ కవులు, వాసవదత్త, స్మరగీత** వీరి రచనలలో పేర్కొనదగినవి. వీరి రచనలలో మాధుర్యగుణము, భావకవితాధోరణి స్పష్టముగా కాననగును.*

*ప్రస్తుత పాఠ్యభాగము వీరు రచించిన **'జాతక కథాగుచ్ఛము'** ద్వితీయభాగమునుండి గ్రహింపబడినది. మైత్రీబలజాతకమను నీ కథాభాగమునందు బోధిసత్త్వుని కరుణార్ద్ర హృదయము చక్కగా విదితమగుచున్నది.*

*బోధిసత్త్వుడు మైత్రీబలునిగా జన్మమెత్తుట, దేవేంద్రునిచే పంపబడిన మాయా మునులకొరకు తన రక్తమాంసములను ధారవోయుట ఇందలి ముఖ్యాంశములు.*

క. ఆవిర్భవించె నొకపరి
క్ష్మావరవంశమున బోధిసత్త్వుఁడు దానన్
బావన మయి తద్వంశము
తావల మయి ధర్మదేవతకు విలసిల్లెన్. 1

క. ఆ బోధిసత్త్వుఁ డిల మై
త్రీబలుఁ డని పొంది నామధేయంబును బా
హాబల, ధీబల, ధర్మ
ప్రాబల్యములను వహించి పడసెను గీర్తిన్. 2

క. తరుణులు పాటలను, గవీ
శ్వరులు సుకావ్యముల, బుధులు స్తవములఁ, దగఁ జి
త్తరువులను జిత్రకారులు
విరచించిరి నాఁడు వాని వివిధచరిత్రల్. 3

★ఉ. తల్లులులేనివారలకుఁ దల్లియుఁ దా నయి ప్రోపుసేయుచుం,
బిల్లలులేనివారలకుఁ బిల్లఁడు దానయి ముద్దుఁ గూర్చుచుం,
గాళ్ళయి కుంటివారలకుఁ, గళ్ళయి గ్రుడ్డులకున్ సతంబు వ
ర్తిల్లెను రాజచంద్రుడు మదీయుఁ డటంచుఁ దలంప నెల్లరున్. 4

క. అత్యంత లోకమంగళ
కృత్యాధాయకుఁ డతండు గెరలెను "రాజా
ప్రత్యక్ష దేవతా" యను
నీత్యాలాపంబు నెగడ నిక్కం బగుచున్. 5

క. సిరిసంపదలం దన దగు
పురము నతిశయింప వాసవుఁడు దురసూయా
పరుఁడై తద్రాజ్యముపై
ధర్మేంద్రుపైఁ గన్ను వేసె ధ్వంస మొనర్పన్. 6

క. ఆతనిచేఁ బ్రేరితు లగు
దూతలు రూపాంతరంబుతోఁ జని తద్భూ
నేతృని రాజ్యముఁ జొరబడి
గోఁతులు ద్రవ్వంగఁ బూనుకొని యుండిరటన్. 7

క. పురికొలుపుచుఁ గయ్యంబులఁ
బొరిఁబొరి యొండొరుల జుట్లు ముడివేసి, ప్రజం
బఱపుచు దుర్వ్యసనంబులఁ
జరియింపం గడఁగినారు శక్రుని చారుల్. 8

క. దూతలు విష బీజంబుల
క్ష్మాతలనాయకుని ప్రకృతి జనచి త్తములన్
లోఁతుగఁ బాఁతిన నంకుర
జాతము మొలకెత్త కందుఁ జచ్చుచు నుండెన్. 9

*ఉ. అందఱు రాజభ క్తి పరు; లందఱు సత్యవచఃపరాయణుల్;
అందఱహింసనవ్రతులు; యందఱుఁ బుణ్యచరిత్రులౌర ! పౌ
రందర దూతబృంద మెట వ్రాలినఁ; గా వివి మిన్న గుగ్గిళుల్
అందని యిన్న గుగ్గిళు లటంచుఁ దలంచిరి వార లత్తఱిన్. 10

క. ప్రతికూల వాయువితతియె
ప్రతిదిశ వారలకు వీచె; బాపులు కృతకృ
త్యత సాధింతురె ? మేఘ
ప్రతిరోధము సాఁగునే తిరంబుగ రవికిన్ ? 11

క. నిప్పులకుం జెదలంటని
యప్పగిదిని నెంత యెంతఁ బ్రయతించిన వా
రప్రజలఁ బాప మంటద
యప్పటికిని మానరైరి యా జతనంబుల్. 12

క. వారల మాయలు మంత్రము
లా రాజ్య ప్రజలఁ బాఱ వని తెలిసి తుదిన్
ఆ ఱేని కెసరు వెట్ట వి
చారం బొనరించి రొక్క సమయమునందున్. 13

క. సలుపుఁడు ధర్మ భ్రష్టుల
నిలాపతినిఁ బ్రజలమీర; లివ్విధి నిశ్శ్రీ
కులయి చెడుదురని యింద్రుఁడు
పలికెను; వీరెంచి రవనిపతినిం జిదుమన్. 14

ఆ. ప్రభువు మెచ్చఁజేసి పారితోషిక మొందఁ
బ్రయత పడుచు నుంద్రు రాజభటులు
ఆకుఁ గోయు మన్న నామూలముగ సము
త్పాటనం బొనర్తు ధరణిరుహము. 15

ఉ. పిమ్మట వారు మెత్తికొని వెల్మిడి దట్టముగా మొగంబులన్,
ఱొమ్మునఁ, గేలుదోయిని, శిరోధినిఁ దావళముల్ ధరించి, శీ
ర్షమ్మునఁ బెంజడల్ గొని, కరంబున గిండి వహించి మౌని వే
షమ్మున నా ధరాధిపతి చక్కటికిం జని రొక్క ప్రొద్దునన్. 16

ఉ. వచ్చిన యా మునిప్రుబువులవర్గము బత్తినిఁ గాంచి స్వాగతం
బిచ్చి శుభాసనంబు నిడి యెంచి స్వజన్మము ధన్యమంచెదన్
మెచ్చుచుఁ దన్ను భూపతి యనెన్ "భవదీయ పదాబ్జ దాసుఁడన్
ఇచ్చకు వచ్చినట్లు గ్రహియించి ననుం బనిఁ బెట్టుఁ"డం చొగిన్. 17

క. అనుడుఁ బురందర దూతలు
మనమున శంకించుచున్న మాడ్కిఁ బలుకకుం
డినఁ గని ఱేఁడనెఁ "దెలుపుఁడు
వెనుదీయక యిత్తు నొడలి విఱిచియు" ననుచున్. 18

క. అంతట వారనిరి "ధరా
కాంతా ! తిరిగితిమి భూమిఖండము నఖిల
ప్రాంతముల; లేరు సాహస
వంతులు త్వాదృశులు భూమివరులం దొకఁడున్. 19

గీ. పాపము లడంచి నిర్వాణపదవి బొంద
సాధ్యపడ దెవ్వనికి నొక్క జన్మమందు
దాన నజరామరం బైన తనువుఁదాల్చ
సాధ్యమయ్యది యగు నొక్కజన్మమందె. 20

గీ. కాన నజరామరత్వంబు గలుగ నరుల
కొఱకుఁ దపమొనరింప నత్తఱిని మింట
మాకు వినఁబడె "రాడస్పృఙ్మాంసములను
గూర్చి యీ మందు మెసవ మేల్గూఱు" ననుచు. 21

క. తెఱవంగ మేము గన్నులఁ
బురస్థలిని నౌషధంపుఁ బ్రో వగపడియెన్;
దిరుగుచునుంటిమి లోకో
ద్ధరణంబునకై తదౌషధము రచియింపన్. 22

క. లోకోద్ధర్తల మనుచుం
గేకలు వై చెదరు; గాని క్రియ కే రాజున్
దూకఁండ; గొడ్డువోయెనొ?
లోకమునఁ బరోపకారలుబ్ధత్వ మిసీ! 23

క. వలయును రాజులర క్తముఁ
బలలము; గాకున్న మావి వడి నీయమె ? రా
ట్తిలక ! తృణప్రాయము లసు
వులు మాదృశులకును వేఁడఁబోదుమె ? పరులన్. 24

గీ. కాన నీమేనినుండి ర క్తమును దీసి
మాంసముంగోసి యీవయ్య ! మందుకొఱకు
లోకము సముద్ధరించు సుశ్లోకి వీవు
బహువిధంబులఁ బ్రార్థింప వలయు నొక్కొ ?'' 25

క. అనవుడు భూవరుఁ డిట్లనె;
"మునులారా ! నా శరీరమునఁ గల్గునెడన్
జనములకు మేలు కావల
సిన దున్న దె ? యింతకన్న శ్రేయము గలదే? 26

✶క. మున్ను దధీచి యొసంగెను
వెన్నెముక నటంచు నేను విన్నది మొద లా
తెన్ను నఁ బోనుంటిని నా
పున్నెము ఫలియించె; మనసు మునిఁగెం బ్రీతిన్.'' 27

క. అని యపుడ పిలిచి వైద్యులఁ
దన యొడలినిఁ గోసి రక్త ధారలు మాంసం
బును వలసినంత యిమ్మని
యనవద్య చరిత్రుఁ డాతఁ డాభాషించెన్. 28

క. విని యేతద్వృత్తాంతముఁ
జనుదెంచి నృపాలుకడకు సచివులుఁ, బ్రకృతుల్
కనుల స్రవింపఁగ నశ్రులు
మనములఁ దెగడుచును మునుల మనవిడిరిట్టుల్. 29

✶క. "మునిముచ్చుల మాటలు విని
తనువుం గోయించు టేటి ధర్మము ? తనుమా
లిన ధర్మంబును మొదలుచె
డిన బేరం బుండునే ? కడిందిఁ దలఁపుమీ ! 30

క. పలుకుట్రలు గావించుచుఁ
బలువ లెవరొ తిమ్మి బ్రహ్మి బ్రహ్మినిఁ దిమ్మిం
జలుపుచు మన రాజ్యంబును
గలంచుచున్నారు కొంతకాలమునుండిన్. 31

క. వారే వీరై యుందురొ ?
క్ష్మారమణా ! నిగ్రహింపుమా ! యీ పాపా
చారుల, నాపోశింపఁగ
వారలె నీ ప్రాణములను వచ్చిరొ ? యిటకున్. 32

క. పాపము రాని మ్మో నృప !
శాపము రానిమ్ము ! మా కొసంగుమి ! యానన్
బాపంబును గ్రక్కింతుము
ఊఁపుదు మెల్లరము నాలు గూఁపులు వీరిన్. 33

క. నావుడు నా మైత్రీబల
భూవరుఁ డిట్లనియె; బుణ్యపురుషులు వీరల్
ఈ విధి వాగ్దూషణములఁ
గావించినఁ గనులు వోవె ? కడఁగుఁడు కొలువన్. 34

✶క. పుట్టిన ప్రతివాఁడె ట్టో
గిట్టును; బున్నెంబుగాదె క్షితి హితముగఁ దాఁ
గిట్టిన; నట్టి మనుష్యుని
మట్టి మహా తీర్థమృత్సమం బని తలఁతున్''. 35

చ. అని వచియించి వైద్యునికి స్వాంగ మొసంగ, నతండు వాఁడి క
త్తినిఁ గొని మేని కండలను దీయుచుఁ బళ్లెమునందు నుంచు; నిం
చును రుధిరంబు గిన్నియల; క్షోణివిభుండు స్మితాననంబునం
గనుఁగొనుచుండ మంత్రితతి కన్నుల నిండఁగ బాష్పపూరముల్. 36

క. కనఁబడె రక్తాశోకం
బన నాతఁడు ర క్తసిక్తుఁడై యపు డామూ
ర్ధనఖంబుగ; నా కృత్రిమ
మునులకుఁ గన్నీరు పొంగి పొరలె నవశమై 37

క. ఆ రక్త మాంసములఁ గొని
వారలు దీవించి కపట భావంబునఁ ద
ద్భూరమణు సమక్షము విడి
పాఱి రదృశ్యత్వ మొంది స్వర్గంబునకున్. 38

క. వారటు వోవఁగ ఱేని శ
రీరం బక్షతముఁ దొంటిరీతి సుదృఢమున్
సారము నయి తోఁచె సభా
స్తారులకును ధర్మ దేవతాకృపకలిమిన్. 39

ఆ. దివ్యదృష్టిఁ గాంచి దేవేంద్రుఁ డిది యెల్ల
వెఱఁగు వడుచు ననుతపించి యెడఁద
నీరసంబు వదలి ధారుణీనాథుపైఁ
గురిసెఁ బారిజాత కుసుమవృష్టి. 40

క. అతనిం జెఱచును ధర్మం
బెతండు ధర్మమును జెఱచు; నేతఁడు గాచున్
అతనిం గాచును ధర్మము;
క్షితి నీ యాభాణకంబు సిద్ధముగాదే! 41

## అధ్యయన వేదిక

**అర్థములు :**

బోధిసత్త్వుడు = బుద్ధుడు; ఆవిర్భవించుట = పుట్టుట; వాసవుడు = దేవేంద్రుడు; ధ్వంసము = నాశనము; రూపాంతరము = మారువేషము; జతనము = ప్రయత్నము; ధరణి రుహము = చెట్టు; వెల్మిడి = భస్మము, బూడిద; ధావళములు = తెల్లని వస్త్రములు; గిండి = చెంబు; చక్కటికి = వద్దకు; పురందర దూతలు = ఇంద్రుని సేవకులు; అస్రుక్ = రక్తము; పలలము = మాంసము; తృణప్రాయము = గడ్డితో సమానము; సచివులు = మంత్రులు; క్షితి = భూమి; కుసుమ వృష్టి = పూల వర్షము; ఆభాణకము = కీర్తి

**సంధులు :**

**ఈ క్రిందివానిని విడదీసి, సంధి పేర్లను వ్రాసి, సూత్రములను వ్రాయుము.**

ధరేంద్రుడు, ధరాధిపతి, శుభాసనము, దేవేంద్రుడు, స్మితాననంబు

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహ వాక్యములువ్రాసి, సమాసముల పేర్లను వ్రాయుము.**

ధర్మదేవత; సుకావ్యము; దుర్వ్యసనంబులు; సిరిసంపదలు; పుణ్యచరిత్రులు; వాయువితతి; ధరణి రుహము; కేలుదోయి; ధరాధిపతి; రాజుల రక్తము; పుణ్యపురుషులు; రక్తమాంసములు; దివ్యదృష్టి.

**అర్థ సందర్భములు :**

1. విరచించిరి నాడు వాని వివిధ చరిత్రల్
2. ధరేంద్రుపై ( గన్నువేసె ధ్వంస మొనర్పన్
3. పాపులు కృత కృత్యత సాధింతురె?
4. లోకమున పరోపకారలుబ్ధత్వమిసీ!
5. నాపున్నెము ఫలియించె మనసు మునిగెం బ్రీతిన్
6. తను మాలిన ధర్మంబును మొదలు చెడ్డబేరము
7. కురిసె పారిజాత కుసుమ వృష్టి

**ప్రశ్నలు :**

1. మైత్రీబలుడెట్లు పరిపాలించుచుండెను?
2. ఇంద్రుని గూఢచారులేమి చేసిరి? ఏమయ్యెను?
3. మాయామునులు - మైత్రీబలుల సంభాషణలను వివరింపుము?
4. మంత్రులు రాజుతో ఏమని పల్కిరి?
5. మైత్రీబలుడెట్లు దేహ త్యాగము గావించెను?

# 8. పార్వతీదేవి తపస్సు

*- శ్రీనాథుడు*

*ఆంధ్ర వాఙ్మయరంగమున కవిత్రయము తరువాత మిక్కిలి ప్రసిద్ధుడైన మహాకవి శ్రీనాథుడు. భీమాంబ, మారయలకు పుత్రుడై జన్మించి, వారల కీర్తిని కూడా వ్యాప్తిగావించిన మహనీయుడు. క్రీ.శ. 1370 నుండి 1450 మధ్యకాలమున జీవించినట్లు తెలియుచున్నది. పలుప్రాంతములు సంచరించినను ఎక్కువగా రెడ్డిరాజుల పోషణమున కీర్తినార్జించిన కవియితడు. ప్రౌఢదేవరాయల కొలువులోనే డిండిమభట్టును తన ప్రతిభావైదుష్యములతో అతనినోడించి* ***"కవిసార్వభౌమ"*** *బిరుదమును పొందెను.*

*శ్రీనాథుడు సంస్కృత మహాకావ్యములు, పురాణములందలి ఘట్టముల నాధారముగా గైకొని ఆంధ్రములో కావ్యములు రచించెను.* ***శృంగారనైషధము, హరవిలాసము, భీమఖండము, కాశీఖండము, మరుత్తరాట్చరిత్ర, పల్నాటివీరచరిత్ర*** *వీరి రచనలలో పేర్కొనదగినవి. ప్రబంధ యుగకవులకితడు మార్గదర్శకుడని పేర్కొనదగును.*

*శ్రీనాథుని కవిత్వము సంస్కృతపదభూయిష్ఠముతో గూడి ప్రౌఢమై మనోహరమై, పదప్రయోగాదులందు శాస్త్రపాండిత్యము కూడా తొణికిసలాడుచుండును.*

*ప్రస్తుత పాఠ్యభాగమైన* ***'పార్వతీదేవి తపస్సు'*** *హరవిలాసములోని చతుర్థాశ్వాసమునుండి స్వీకరింపబడినది. ఇందు పార్వతి పరమశివునిగూర్చి తపస్సు గావించుట, కపటవటువు పార్వతిని పరీక్షించుట, శివుని సాక్షాత్కారము చక్కగా వర్ణింపబడియున్నవి.*

వ. అంత నొక్క చందంబున నా చంద్రానన సఖీముఖంబున నిజ
మనోరథంబుఁదండ్రి కెఱింగించి యమ్మహానుభావుచేత నరణ్య
నివాసమునకును, ఫలోదయాంతం బై న తపస్సమాధికిని నానతి
వడసి దృఢప్రతిజ్ఞా నిర్వాహంబున. 1

ఉ. భూధర రాజకన్య మణిభూషణముల్ దిగఁద్రావి యీశ్వరా
రాధనకేళికౌతుక పరాయణ యై భరియించెఁ బాండుర
క్షౌధృతిపూర్వకంబుగఁ బ్రగాఢపయోధరమండలీసము
త్సేధవిశీర్ణ సంహతులఁ జెల్లు మహీరుహవల్కలంబులన్. 2

తే. చంచరీకాంగ నాగరుచ్ఛాయ నలరు
కుటిలకోమలతరదీర్ఘ కుంతలములు,
మడమ లంటంగ నిడు పాటిజడలు గట్టఁ
బాశుపతమంత్రదీక్షఁజేపట్టె గౌరి. 3

సీ. ముత్యాలమొలనూలిమురువుసూపెడునట్టి
జఘనంబుపై మౌంజి నవధరించెఁ
గందుకక్రీడపై గారాబు పచరించు
హస్తాబ్జములఁ బూనె నక్షమాల
కస్తూరికాంగరాగములతో విలసిల్లు
తనువల్లి హత్తించె ధవళభూతి
బొమ్మపెండిలిపాటఁ బ్రొద్దుపుచ్చు నెలుంగు
నీలకంఠ స్తోత్రనియతిఁ గూర్చెఁ

తే. బసిఁడికమ్ములయందంపుఁబట్టుచేల
కొంగుచాటున వర్ధిల్లు కుచభరమున
గంతగా వై చెఁ బులితోలుకళవసంబుఁ
బరమకళ్యాణి గిరిసార్వభౌమతనయ. 4

తే. హంసతూలికపాన్పుపై నలరుమొగ్గ,
యొత్తు నునుమేను గల్గు నీలోత్పలాక్షి
బాహువల్లి తలాడగాఁ బవ్వళించె,
శై లపాషాణపట్టికాస్థండిలమున 5

తే. పాశుపతమంత్రదీక్షావిభాసమాన
దివ్య తేజోవిశేషసందీ ప్తమూ ర్తి,
కాలతాంగికి శతవృద్ధు లైన మునులు,
ప్రణతు లగుదురు భావిప్రభావశక్తి. 6

వ. ఇవ్విధంబున నబ్బింబాధర ధరశిఖరంబులయందలి హరిణ కిశో రంబులకు నరణ్య బీజాంజలిదానంబునుం దరులతా కుంజంబు లకు నిర్ఝరసలిలాధారాసేకంబును నొనర్చుచుఁ గృష్ణాజినోత్తరా సంగవతియు, సర్వాంగ భసితాభ్యంగ మంగళస్నానయు నై కొంత గాలంబు గడపి, కాంక్షి తంబు కడఁగానక తెంపుసేసి మండువేసవిం గనగనమండు నగ్ని గుండంబు నడుమన నిలిచియు, మధ్యాహ్న కాలం బున నర్కమండలం బాలోకించియు, వర్షాకాలంబునఁ జలధర జలబిందుధారలం దోఁగియు, శిశిరకాలంబునం దివతాళించు కొలంకులలోనం బుక్కిటిబంటి నీట నిశాసమయంబుల నిలిచియు, నంబుచుళుకంబులును నుడుపతికరంబులును సురకరువలిం డుల్లిన జీర్ణ తరుపర్ణంబులును నాహారంబుగా దుష్కరం బైన తపంబు సేయుచుండ నొక్కనాఁడు. 7

*మ. అజినాషాఢధరుండు ప్రౌఢతరభాషాతిప్రగల్భుండు నీ
రజబంధుప్రతిమాన తేజుఁడు జటా రాజిచ్ఛటాతామ్రమూ
ర్ధజుఁడేకాకివటుండు బ్రాహ్మణుఁడు విశ్రమార్థముంబోలె నా
త్రిజగన్మోహనమూ ర్తిసన్నిధికి నేతెంచెన్ వనాంతంబునన్. 8

తే. ఇవ్విధంబున నేతెంచి యెదుట నిలిచి,
గౌరి నాశీర్వదించె నక్కపటవటుఁడు
కలితకోమలనవకుశగ్రంథి యైన,
యంగుళీపల్లవముతోడి హస్త మెత్తి. 9

వ. పార్వతియు బహుమానపురస్సరంబుగా నయ్యుర్వీసురవటు నకు నతిథిపూజ యొనర్చె. నతండును గొండరాచూలి సేయు సత్కారం బంగీకరించి ముహూ ర్తమాత్రంబునం బరిశ్రాంతి నపనయించి మెయివడిచూపునం జూచి ప్రస్తా వోచితంబుగా నిట్లనియె. 10

సీ. సలిలంబు త్రిషవణస్నానక్షమం బౌనె
యంభోజపత్రదీర్ఘాయతాక్షి !
కుసుమంబులును నిధ్మకుశపల్లవంబులు
సులభంబు లై యున్నె సుందరాంగి !
సత్త్వంబు లన్యోన్యజాతివై రముఁ దక్కి
శాంతి గైకొని యున్నె చంద్రవదన !
యనుదినంబును దేహయాత్ర కాయితమౌనె
నీవారశాకాది పూవుఁబోణి !

తే. శక్తికొలఁదిఁ దపశ్చర్య సంఘటింతె,
ఫలముపై నాస నాగ్రహబంధ ముడిగి
తామ్రబింబోష్ఠి ! ధర్మసాధనములందు,
నాద్య మగు సాధనంబు దేహంబ కాదె ! 11

క. మగువా ! నీ పెంచిన లత
చిగురున ముకుళంబు లుల్లసిల్లెనె చెపుమా
పగడపుఁ గెమ్మోవిపయి
న్నగ వుదయించినవిధంబునం బ్రస్ఫుట మై. 12

క. పంకజలోచన ! కరద
ర్భాంకురములు మేసినట్టి యపరాధమునన్
రంకుమదపోతకంబుల
జంకింపవుగా తపఃప్రశాంతి వెలితిగాన్. 13

తే. అభ్రవీథీపరిచ్యుతంబై నయట్టి
యమరతటినీజలప్రవాహమ్ముకంటె
ధరణిధరరాజు నీచరిత్రంబుకతనఁ
బరమపావనుఁ డయ్యె నోపద్మనయన ! 14

వ. సంబంధంబు సాప్తవచనంబు గావుననింతదడవు నీతోడఁ గలసి
పలుకుచునికింజేసి యే నా ప్తుండఁ. గావున, నొక్క మాట యడిగెద.
రహస్యంబు గాకుండెనేనిం జెప్పుమా. 15

సీ. ప్రథమప్రజానాథపావనకులమునఁ
ప్రభవించి తఖిల ప్రపంచసార
సౌందర్యసంపద సడిసన్న దాన వ
నశ్వరం బై శ్వర్యనై పుణంబు
సౌఖ్యంబు నిరవధి సర్వసామగ్రి నీ
యఱచేతి భోగ్యమత్యాయతంబు
భాగ్యంబు నీ కేమి బ్రాఁతి యైనది మనో
రథ మేమి చెప్పుమా రాజవదన

తే. దుష్కరం బై నతప మిట్లు దొడరి చేసి
మేను డయ్యించుకొనఁగ నేమిటికి వచ్చెఁ
జిత్తము విచారమార్గంబుఁ జేరఁదెచ్చి
త త్త్వముఁ దెలియఁ జెప్పు చూతము మృగాక్షి. 16

వ. పితృ గేహంబున నవమానంబు పుట్టదు గదా ! పన్నగఫణారత్నంబున మీఁదఁ జెయిసాఁచువాఁడు గలండే ? నిండు జవ్వనంబునకుం దగిన విభూషణంబులు తొలంగంబెట్టి వార్ధ కోచితంబు లగు వల్కలంబు లెట్టులు ధరించితివి? దేవలోక నివాసంబున కాసపడెదేని నది వృథా శ్రమంబు ! నీ పుట్టి నిల్లు దేవభూమియ కదా ! తగిన వరునిం గామించి సమాధి వహించితివేని నదియు నీకుం దగదు. రత్నం బొరుచే నన్వేషింపఁబడుఁగాని యొరు నన్వేషించునే? వేఁడి నిట్టూ ర్పుగాడ్పులచే దుర్లభజనానురాగంబు నీయందుఁ దేట పడుచున్నది. అట్టి కఠిన హృదయం డెవ్వండొకో, వాఁ డెవ్వండేని నీవు తపంబు సేయంబూని కలమాగ్ర పింగళంబగు జటాధారంబు ధరియింప నుపేక్షించునే యని యంత నిలువక యక్కపటవటుండు. 17

★ఉ. ఏనును బ్రహ్మచారిఁ దరళేక్షణ ! నీవును గన్య వింత కా
లానకు నీకుఁ బెండ్లి యె ఫలం బగునేని విచార మేల స
న్మానముతోడ నన్ను మునిమాన్యవివాహముగమ్ములెమ్మ్మ కా
దేనిఁ దపంబులోని సగ మిచ్చెద మాను తపోభిమానమున్. 18

వ. అనినం బార్వతి యమ్మిథ్యావటునకుం దన మనోరథం బెఱిఁగింప నొల్లక, వయస్యం గన్నుసన్న సేసిన, నచ్చెలి క త్తెయు నత్తపోధన కుమారునితో నిట్లనియె. అయ్యా ! నీకుఁ గుతూహలంబు గలదేని వినుము. జనకు నింట ధృతిం జెందక మహేంద్రప్రభృతులగు దిగీశుల నుజ్జగించి పినాకపాణిం బతిఁ గాఁ గోరి తపంబు సేయ సమకట్టె యని పల్కిన. 19

చ. వికవిక నవ్వి యక్కపటవిప్రకుమారుఁడు మేలు లెస్స వా
నికి నయి రాగబంధమును నిల్పె మదిం దరళాయతాక్షి మీ
సకియ వివాహవేళఁ బురశాసనుపాణిఁ బరిగ్రహించుచో
మొకమున బుస్సుమంచు నహిమ్రొగ్గిన నెట్లు భయంబు చెందునో
20

సీ. రాయంచ యంచుఁజీరకు జోకయగుఁగాక
పచ్చియేనికతోలుపచ్చడంబు
హరిచందనాస్పదం బగు చన్నుఁగవమీఁదఁ
బట్టుఁ జేకొనుఁగాక భసితధూళి
కమనీయచరణలాక్షారాగలేఖచే
ముద్రితం బగుఁగాక రుద్రభూమి
కలితముక్తాఫలగ్రైవేయకంబుతోఁ
దులఁదూఁగుఁగాక పెంజిలువపేరు

తే. మనువు లెస్సయి యుండెఁ బో మానవతికి
నివ్విధం బన్న లోకంబు లెల్ల నగరె
యహహ ! ముదిగోద నెక్కి భిక్షాటనంబుఁ
జేయఁ బోవుట యదియు మెచ్చాయెఁ జువ్వె. 21

ఉ. అంధపరంపర న్వెణఁగ వై యభవున్‌విని, వాని తోడిసం
బంధము గోరి నిర్భరతపఃకృశ కోమల దేహయష్టివై
బాంధవకోటితోడఁ బెడఁబాసిన నీవును నింద్యవౌదు సౌ
గంధిక బంధు రేఖయనఁ గామిని! మాటలు వేయు నేటికిన్. 22

ఉ. పుట్టు వెఱుంగ నెవ్వరికిఁ బోలదు; మూఁడవకన్నుఁ జూచి చే
పట్టఁడు వెట్టివాఁ డయినఁ;బ్రాణహరుం డటె జంతుకోటికిన్;
గట్టినతోలుచీర కలికల్మిఁబ్రకాశము సేయుచున్న; దె
ప్పట్టునఁ జూచినన్ శివునిబైసి యెఱుంగఁగరాదె భామినీ! 23

తే. మాటలేటికిఁ జాలింపుమా తపంబు,
హరునిఁ గూర్చి సరోజపత్త్రాయతాక్షి !
వధ్యుఁ దివియంగఁ బాఁతిన వాఁడికొఱ్ఱు
యూపసత్క్రియ కర్హమై యున్నె చెపుమ. 24

వ. అనిన నక్కపటవటునకు నవ్వధూటి యి ట్లనియె. 25

ఉ. చాలు వివాదము ల్వడుగ శంభునిఁగూర్చి; మహేశుఁ డన్ననీ
వాలముచేసిపల్కి; తెటులైనను నౌ, విను, చంద్రమఃకళా
మౌళిపయిన్మదీయ మగుమానస మెంతయుఁజిక్కె, నింకనేఁ
జాలుదునయ్య! యెమ్మెయిభుజంగవిభూషణునిందొఱంగఁగన్ 26

వ. అని జయావిజయలం గనుంగొని యపాంగంబులఁ గెంపు గదుర
నీబ్రహ్మచారి శంకరుని గుఱించి నిశ్శంక నింకను వంకర కొంకర
మాటలాడ నుంకించుచున్న వాఁ డితని మెడ వట్టి నూకుం డని
పల్కి కోపావేశంబున. 27

చ. జిలుఁగగువల్క లాంచలముచెన్నయి చన్ను లమీఁద జాఱఁగా
నలుకఁ దుషారశైలసుత యవ్వలిమో మయి నాలుగేన్పదం
బులు సని భ్రూకుటీకుటిలముగ్ధలలాట ముఖేందుబింబ యై
మలఁగికనుంగొనెన్ భుజగమండనుఁడైన శఠద్విజోత్తమున్. 28

★శా.సాక్షాత్కారమునొందినవ్వుచుమహేశానుండుధాత్రీధరా
ధ్యక్షాపత్యముఁ బ్రేమనిర్భరకటాక్షాలోకనప్రౌఢిమన్
వీక్షించెన్ దరళాక్షియు న్మనమునన్ వ్రీడాప్రమోదక్షమా
దాక్షిణ్యంబులు సందడింప నిలిచెం దత్సన్నిధానంబునన్. 29

చ. అరుదగు నీతపమ్మునకు నమ్ముడువోయితి నేలుకొమ్ము నీ
వరువుడ వంచు శూలి ప్రియవాక్యములందగ గారవింపఁగా
ధరణిధరేంద్రనందన యుదగ్రతపోమహనీయవేదనా
భరమఖిలంబువీడ్కొలిపి భావమునంబరితోషమందుచున్. 30

## అధ్యయన వేదిక

**అర్థములు :**

వల్కలములు = నారచీరలు; మౌంజి = దర్భమొలత్రాడు; స్థండిలము = నిద్రించుటకు దర్భాదులచే సంస్కరింపబడిన భూమి; అర్కమండలము = సూర్యమండలము; ఇవతళించు = చల్లనగు; ఉడుపతికరములు = చంద్రుని కిరణములు; అజినాషాఢధరుండు = పులి తోలును ధరించినవాడు; నీరజబంధుడు= సూర్యుడు; తామ్ర మూర్ధజుడు = ఎర్రనైన శిరస్సు గలవాడు; నవకుశ = క్రొత్తదైన దర్భ; కొండరాచూలి = హిమవంతుని కుమార్తె (పార్వతి); త్రిషవణ = మూడు కాలములు; ఇధ్మకుశపల్లవంబులు = సమిధలు, దర్భలు, చిగురుటాకులు; సత్త్వంబులు = జంతువులు; నీ వార = అడవిలోని ధాన్యము; సాప్త వచనంబు = ప్రేమ పలుకులతో కూడినది; పింగళం = గోరోజనపు వర్ణము; వయస్య = చెలికత్తె; పినాక పాణి = ఈశ్వరుడు; పురశాసనపాణి = ఈశ్వరుడు; అహి = పాము; ముదిగోద = ముసలి ఎద్దు; వెడగు = వెర్రివాడు; యూపము = యజ్ఞము; వ్రీడ = సిగ్గు; శూలి = ఈశ్వరుడు; పచ్చడము = వస్త్రము; గ్రైవేయకంబు = హారము

**సంధులు :**

**ఈ క్రిందివానిని విడదీసి సంధి పేర్లను వ్రాసి, సూత్రములను వ్రాయుము.**

ఈశ్వరారాధన, నీలోత్పలము, విశ్రామార్థము. ఇవ్విధము, కెమ్మోవి, తపోభిమానము, భిక్షాటనము, ఆనతి వడసి.

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహ వాక్యములు వ్రాసి, సమాసముల పేర్లను వ్రాయుము.**

హస్తాబ్జములు, శతవృద్ధులు, కపట వటుడు, పినాకపాణి, నీలోత్పలాక్షి.

**అర్థ సందర్భములు :**

1. పాశుపత మంత్రదీక్షఁజే పట్టె గౌరి
2. ధర్మసాధనములందు నాద్యమగు సాధనంబు దేహంబుకాదె
3. పన్నగ ఫణా రత్నంబుమీదఁ జేయిసాచువాడు గలండే?
4. రత్నం బొరునిచే నన్వేషింపఁబడుఁగాని యొరు నన్వేషించునే
5. వధ్యుదివి యంగఁ బాతిన వాడికొఱ్ఱు
   యూపసత్క్రియకర్హమైయున్నె చెపుమ

**ప్రశ్నలు :**

1. పార్వతి పాశుపతదీక్ష చేపట్టిన విధమును వివరింపుము?
2. కపట వటుడు పార్వతితోనేమని పల్కెను?
3. కపట వటువు ఈశ్వరుడెట్టివాడని పల్కెను?
4. పార్వతి కపట వటువునకెట్లు ప్రత్యుత్తరమిచ్చెను?
5. ఈశ్వరుడెట్లు సాక్షాత్కరించెను?

***విద్యార్థులకు సూచన :***

శ్రీనాథుని గ్రంథమైన హరవిలాస మంతయు చదువుడు.

***ఉపాధ్యాయులకు సూచన :***

శ్రీనాథుని గ్రంథములను విద్యార్థులకు పరిచయము గావింపుము.

# 9. హంపీయాత్ర

## - ఏటుకూరి వేంకట నరసయ్య

*ఏటుకూరి వేంకటనరసయ్యగారు గుంటూరుజిల్లా పెదకూరపాడు గ్రామము నందు **1911** సంవత్సరమున జన్మించిరి. శేషమ్మ, భూషయ్యలు వీరి తల్లిదండ్రులు. ఉభయభాషాప్రవీణులు. **'కవిబ్రహ్మ'** బిరుదాంకితుడు. **'క్షేత్రలక్ష్మి, వీరభారతము, మగువమాంచాల, రైతు, నీతిమంజరి'** వీరి రచనలలో పేర్కొనదగినవి.*

*వీరరసమును పోషించిన ఆధునిక కవులలో పేర్కొనదగినవారు. వీరు తమ రచనలందు జానపద సౌభాగ్యానికి తెలుగుపలుకుబడులకు అధిక గౌరవము నాపాదించిరి.*

*వీరు రచించిన 'త్రివేణి' అనెడి ఖండకావ్య సంపుటినుండి ప్రస్తుత పాఠ్యభాగమైన హంపీయాత్ర గ్రహింపబడినది. ఇందు కవి ప్రస్తుత హంపీక్షేత్ర జీర్ణావస్థను గూర్చి పడిన ఆవేదన చక్కగా వివరింపబడినది.*

★శా. అన్నా ! ఆంధ్రుఁడ వైననేమిఫల మాహంపీమహాక్షేత్రమున్
గన్నావా ? పెనుగొండ లందుఁగొలువై కౌఁగిళ్ల లాలింపఁగా
మన్నావా ? రతనాలశిల్పమచటన్ మన్నై నగాధావళుల్
విన్నావా ? దురదృష్టవంతుఁడవు నీవే నాఁటికిన్ నేఁటికిన్. 1

ఉ. తాతలనాఁటి గాథలను ద్రవ్వఁగ నాతరమౌనె హక్కరాట్
భ్రాతల ధర్మమాయని పురం బిట వెల్గెను కృష్ణరాయజా
మాతృనిపుణ్యమాయని సమస్తము నాశనమైన దింతకీ
పాతకహేతు వెవ్వరను ప్రశ్నకు నీశ్వరుఁడే భయంపడున్. 2

మ. తెలుఁగుంగన్నడ మొక్క రేవుబడి వృద్ధిజెందె శ్రీకృష్ణరా
యలకాలమ్మున నాఁడిదేమి ? కథ కావ్యంబయ్యె మార్మూలలన్
శిల చిత్తర్వయిపోయె లేఁజివురునున్‌జేవయ్యె మా తెల్గుక
త్తులు కారాడిన కర్మభూమిపయి నెందున్ లోటు వాటిల్లునా? 3

మ. త్వరగారమ్మదె నాగలాపురము చెంతన్ జేరి నా మాంధ్రజ
హ్వారిపుణ్యమ్మునఁ జూపుమేరనదె రాయల్‌గేటు చూపట్టునా
దరిఁ జూళాయినున్న దిచ్చటన కాదా? రాజబంధుల్ దనుం
బరివేష్టింపఁ బథిశ్రమంబుడుగ భూపాలుండు కొల్వొటయున్. 4

ఉ. ఆలన దక్కిహంపి సరిహద్దుల ఖుద్దునఁగాచుపెద్ద గో
రీ లవెరెండు యాత్రికుల దృష్టికి దే మనిపించు ముస్లిముల్
లాలన చేసి యీనగర లక్ష్మివిలాసము చూఱలాడిపోఁ
జాలక నిల్చిపోయిన విశాంపతు లందొక రిద్దరుండిరా? 5

శా. ఆగుట్టన్ మలిపించిరుగ్రనరసింహస్వామిగా సైనికుల్
లోఁగోన్నారఁట వీనివిక్రమకళా లోలాత్ములై వైరులన్
ఔగాకిట్లు భవిష్యదంధ్రజన శౌర్యజ్యోతి వెల్గించుచున్
ఈగడ్డన్ నివసించుటెంత వఱ కాయిల్లాలు లేకుండఁగన్. 6

ఉ. కొండకుఁగొండ తొల్చి యొక గుజ్జదొర న్నెలకొల్పి రాయెడన్
బండినకీ ర్తిచంద్రికలపైఁ బవడించెను బాప మీయెడన్
మండినకోట దిబ్బలకు మధ్య నమోనమయంచు రేవగల్
పిండములేక యెందుకుఁ దపించునొ? కద్వల కల్గణేశుఁడున్. 7

★మ. అదె మాతంగము మాల్యవంతమటు ఋష్యమ్మందు హేమంతమ
య్యదె కిష్కింధ యిదేనఁటయ్య! మన విద్యారణ్యు లిచ్చోటనే
కద బ్రాహ్మ్యంబును క్షాత్రమున్ వెలుఁగ దీక్షంబూనినిర్మించినాఁ
డదియే మారటస్వర్గమై నెగడు విద్యాపట్టణ మ్మాంధ్రుఁడా! 8

మ. గుణభద్రా! యని తుంగభద్రనిటఁ బేర్కొన్నాఁడు తెన్నాలిరా
మన తక్కుంగలపెద్ద లేమనిరొ? పంపాభ ర్త లోఁగింటికిన్
వెనుకంజుట్టి మహాద్రులంగమిచి హంపీరక్షణార్థంబు ద్ర
వ్వని పెన్కందకమైనయీనది మహత్వం బెంతకీ ర్తించెదన్. 9

శా. ప్రాతస్సంధ్యల నష్టదిగ్గజములీ పాథ స్తరంగంబులం
దీఁతల్గొట్టినఁ దుంగభద్ర కొడ లెం తేఁబొంగెనో? నాఁడునే
నే తత్ప్రాంతశిలోపవేదికను గానీ ? లేతృణంబైనఁ గా
నీ తద్గర్భతరంగ పోతమను గానీ యైన ధన్యాత్ముఁడన్. 10

★మ. శిలనిద్రించిన గిల్లినారొ? యులిచేఁ జెక్కించినారో! మనో
బలమున్ గూరి యమర్చిరో? తెలియ దీపాషాణముల్ వెన్నము
ద్దలవోలెన్ గఱపించి కట్టినటు లర్థంబౌను నాసిద్ధహ
స్తులు లోకో త్తరు లైన మానవులకున్ దుస్సాధమొండున్న దా? 11

సీ. రకమొక్కతీరుగా ఱాతిగుబ్బలతల్పు
లెటుత్రిప్పి చెక్కిరో యెఱుకపడదు
పనివాని నేర్పుట్టిపడు ఱాతిరథమెట్లు
తీర్చి దిద్దిరొగాని తెలియరాదు
స ప్తస్వరము లీను స్తంభవితానమ్ము
లెట్లేర్పరించిరో యెఱుఁగరాదు
పెనుబండలె త్తి నిల్పిన చూఱు లేజాడఁ
గుదుటఁబెట్టిరొ కాని గురుతుపడదు

తే. వింత నిర్మాణములు శిలావిష్కృతములు
భావిజనదుఃఖ విస్మయాపాదకములు
పార్థివంబులు నైజసంపదలు దక్కి
తైజసము లయినిల్చె నీతరుణమందు. 12

సీ. ఆంధ్రవైష్ణవుని శైవాభిమానముచాటు
శ్రీవిరూపాక్షుని దేవళమ్ము
ప్రాచీన శిల్పప్రభావ ముద్ఘాటించు
విఠ్ఠలాలయశిల్ప వేదులెల్ల
శిల్పిసుందరుని విచ్ఛిత్తి కల్పనగుత్త
గొను హజారస్వామి కుడ్యపం క్తి
సీతాపహరణమ్ము సెప్పి కన్నీరొడ్చు
నచ్యుతాలయ గోపురాగ్రశిఖలు

తే. ఏమహాశిల్పియాత్మ లయించిపోయి
ఇట్టి యపురూపమెత్తి జీర్ణించినదియొ ?
పాపమాతని నామ రూపమ్ములైన
బయలు పఱుపకపోయె దౌర్భాగ్యశిలలు. 13

తే. దానతులఁదూఁగె నాంధ్రభూధవుఁడునాఁడు
దివ్య దీనారటంకాలఁ దీర్థమాడి
పావుకొనిరఁట పండితప్రభువు లపుడు
తృప్తి యను మాటెఱింగని తృష్ణఁదోఁగి. 14

తే. తుంగ భద్రానదీ స్వాదుతోయములను
హేమ కూటాద్రిపైకి రప్పించిరెట్లొ?
ఆనదిన్ జీలివచ్చు కుల్యాంబువులకుఁ
బ్రతిపదమ్మునబంగారు పంటపండు. 15

తే. ఈ మహావైభవములకు నెవఁడు హేతు
విన్ని దిగ్విజయములకు నెవఁడు మూల
మీకళాసంపదభివృద్ధి కెవఁడుక ర్త
మంత్రి తిమ్మరు సనుమాట మరువకన్న ! 16

సీ. రాయలు కొల్వైన రచ్చపట్టులు సూచి
గుండె నీరై గోడుగుడిచినాము
వల్లకాడగు రాణివాస శైథిల్యముల్
వీక్షించి కన్నీరు విడిచినాము
కూలిపోయిన గుడుల్ గోపురమ్ములుగాంచి
వెచ్చని యూర్పులు పుచ్చినాము
సహగమన ప్రదేశమ్ములు దిలకించి
సారె కాహతవిధి దూఱినాము

తే. నృపతు లామహాప్రజలాకవీంద్రు
లావిజయ చర్చ లేమైన వనుసమస్య
లరనిముసమైన నిలువ లే దాత్మలందు
మనము శాశ్వతమా యని మరలినాము 17

## అధ్యయన వేదిక

**అర్థములు :**

చిత్తరువు = బొమ్మ; అద్రి = కొండ; తృణము = గడ్డి; పాషాణము = విషము, శిల, ఱాయి; కుడ్యపంక్తి = గోడల వరుస; నృపతులు = రాజులు; కుల్యాంబువులు = కాలువనీరు; ఖుద్దున = స్వంతముగా; పవడించు = పవ్వళించు, పరుండు

**సంధులు :**

**ఈ క్రిందివానిని విడదీసి సంధి పేర్లను వ్రాసి, సూత్రములను వ్రాయుము.**

ప్రబలాధారము, మహాద్రి, ధన్యాత్ముడు, లోకోత్తరులు.

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహ వాక్యములు వ్రాసి, సమాసముల పేర్లను వ్రాయుము.**

కులగోత్రములు, ప్రబలాధారము, మహాద్రులు, అష్టదిగ్గజములు, ప్రాతస్సంధ్యలు, వెచ్చని యూర్పులు.

**అర్థ సందర్భములు :**

1. దురదృష్టవంతుడవు నీవేనాటికిన్ నేటికిన్
2. లోకోత్తరులయిన మానవులకున్ దుస్సాధమొండున్నదా
3. ప్రతిపదమ్మున బంగారు పంట పండు
4. బయలు పఱుపకపోయె దౌర్భాగ్య శిలలు
5. అరనిముసమైన నిలువదాత్మలందు

**ప్రశ్నలు :**

1. హంపి శిథిలావస్థను గాంచి, కవి పొందిన వేదన ఎట్టిదో వివరింపుము?

***విద్యార్థులకు సూచన :***

హంపీక్షేత్రముల వంటి చరిత్ర ప్రసిద్ధి గాంచిన చిత్రపటములను సేకరింపుము.

***ఉపాధ్యాయులకు సూచన :***

హంపి, అజంతా, ఎల్లోరా, మహాబలిపురం మొదలగు చారిత్రిక స్థలములకు విద్యార్థులను విజ్ఞానయాత్రలకు తీసికొనిపోవుట యుక్తము.

# గద్యభాగము

## 1. మిత్రభేదము

**- పరవస్తు చిన్నయసూరి**

*పద్యరచనకు **'నన్నయ'** వలె గద్యరచనకు **'చిన్నయ'** అఖిలాంధ్రలోకమునకు మార్గదర్శకుడు. చెన్నపట్టణమునకు సమీపమునగల శ్రీ పెరంబదూరులో 1807 సం॥న జన్మించిరి. శ్రీ పెరంబదూరునకు శ్రీభూతపురి అనెడి పురాణప్రసిద్ధిగల నామము గలదు. చిన్నయసూరిగారి తండ్రి వేంకట రంగయ్యగారు బహుభాషాకోవిదులు. గొప్ప వేదాంతి.*

*స్వయంకృషిచేతను, హయగ్రీవోపాసనాకలిమిచేతను సంస్కృతప్రాకృతాంధ్రాంగ్లాదిభాషలందు అఖండ శేముషీవైభవమును బడసి చిన్నయ కవిగా, లలితగద్యరచయితగా, సుప్రసిద్ధవ్యాకర్తగా ప్రసిద్ధిగాంచిన మహనీయుడు.*

*__'సూరి'__ అనెడిది యితని బిరుదము. పండితోద్యోగములు సలిపి ఉత్తమాచార్యుడుగా వాసికెక్కిరి.*

*__బాలవ్యాకరణము, నీతిచంద్రిక, ధాతుమాల సూత్రాంధ్ర వ్యాకరణము, అక్షరగుచ్ఛము__ మొదలగునవి వీరి రచనలయందు పేర్కొనదగినవి.*

*సుహృల్లాభ, సుహృద్భేదములను కథలను **"హితోపదేశము"** ను గ్రంథమునుండి గ్రహించి, చిన్నసూరి **"నీతిచంద్రిక"** ను రచించెను. నీతిచంద్రిక నీతికథలకేగాక చక్కని లోకోక్తులకు, సామెతలకు జాతీయములకు నెలవై తెలుగు నుడికారపు సొంపులతో వీనులకింపు గొలుపుచుండును.*

*తెలుగు గద్యవాణికి 'నీతిచంద్రిక' చక్కని మణిహారము. విష్ణుశర్మయను విద్వాంసుడు విద్యాగంధశూన్యులగు పాటలీపుత్ర రాకుమారులకు కథలమూలమున నీతిని, లోకజ్ఞతను తెలియజేసెను. కుజన సుజన మైత్రివలని అపకారోపకారములను తెలుపు ఈ కథ **"నీతిచంద్రిక"**లోని **"మిత్రభేదము"**నుండి గ్రహింపబడినది.*

మలయం బనుపత్యకావిపినంబున దర్పసారంబను కంఠీరవంబు గలదు. దానిం గాక వ్యాఘ్ర జంబుకంబులు మంత్రులయి కొలుచుచుండును. అవి యొక్కనాఁడు గహనంబున విహరించుచు నొక్కయుష్ట్రంబుం గాంచి నీనామంబేమి? నీవెక్కడనుండి వచ్చెదవని యడిగిన నాక్రమేలకం బిట్లనియె. 'వర్తకుండొకండునామీఁద ననారతంబు మహాభారం బెక్కించి మోపించుచుండును. ఇట్లు పెద్దకాలంబు భారవహనక్లేశంబు సహింపజాలక వాని మొఱంగి యీయరణ్యంబునకు వచ్చి డాగియున్నవాఁడను. ఈశార్దూలవల్లభుండు లోకభీకరుండు. మీరు మహాప్రాజ్ఞులరు. మీయనుగ్రహంబు వడసి త్రాసంబు వాసి మనువాఁడ. నాకు మీకు దక్క వేఱుశరణంబు లేదు. శరణాగత రక్షణంబు సర్వధర్మంబులం దుత్తమంబని ధర్మవిదులు వక్కాణింతురు.' నావుడు జంబుకం బిట్లనియె. 'ఈయరణ్యంబునందు మృగరా జొకరుండు గలఁడు. అతండు ప్రతీపప్రతాపదీపనిర్వాపణమహాబలుం డగుమహాబలుండు. మే మాతనిభృత్యులము. నీవు తద్దర్శనం బవశ్యంబుగంజేయుము. మావలన నయినయంత యుపకారంబు గావించెదము. నీకు సర్వంబు మేలయ్యెడు వెఱవకుము. మావెంటరమ్ము.' నావిని మహాంగం బంతరంగంబునం బొంగి వానిపిఱుందం జనుడు నయ్యవి మృగనాథుపాలికింబోయి యథాశ్రుతంబుగ దానివృత్తాంతంబు సాంతంబుగంజెప్పి ముందటికిం ద్రోచి మ్రొక్కు మనుడు సవినయంబుగ మ్రొక్కి నిలువంబడియున్న వాసంతంబుఁ గాంచి పంచాస్యంబు కృపాయత్త చిత్తంబయి యభయం బొసంగి కొంతదడవు సల్లాపంబు గావించి 'నీకమాత్యపదం బొసంగితిమి. మాపూర్వ మంత్రులతోడం గూడి యైకమత్యంబు వడసి యస్మ త్కార్యంబులు నిర్వహించుచు సుఖంబుండుము.' నావుడు నుష్ట్రంబు మహాప్రసాదంబని తదుక్తప్రకారంబునం బ్రవ ర్తించుచుండె. పెద్దకాలం బివ్విధంబునం బ్రవర్తిల్లుడు నొక్కనాఁడు సింహంబు మంత్రులతో నిట్లనియె 'నాకిప్పుడు వ్యాధికతంబునం దేహంబునం బాటవంబు లేక యున్న యది. అరణ్యంబున సంచరింపజాలను. ఆరోగ్యంబుగలిగి కొంతసత్తువవచ్చి

నడయాడునంతదనుక నాకాహారంబు సంపాదించి తెచ్చియిండు.' నావిని వాయసాదు లిట్లనియె. 'స్వామీ ! మేము క్షుద్రులము. మీకు వలసినంత యాహారం బొకపూఁటకయినం దెచ్చి యిచ్చునంతవారమె ? మీపాదచ్ఛాయనుండి మీరారగింప మిగిలినది భుజియించి జీవించుచున్న వారము. మాస త్త్వంబుకొలంది దేవరకుదెలియనిదికాదు.' అనవుఁడు మృగేంద్రుండు వానింజూచి దొరికినంతయె కానిండు. తోడెంబుతోడనె ప్రొద్దుపుచ్చుకొని యెద. నేనేమి చేయుదు ? నాపురాకృతకర్మంబు వ్యాధిరూపంబున నన్ను బాధించుచున్న యది. కొంతపాటినడయాడుటకు శ క్తియుండిన మిమ్ము శ్రమంపఁజుపను. జంపుమాని కానకుం జనియే యెఱచియయిన దొరికినంత కొనిరండు. పొండు.' అని శాసింప మాఱుపలుక వెఱచి యాజంతువులు వనంబునకుం జనియెల్లప్రదేశమ్ములం గ్రుమ్మరి యుఱ వగు నెరదొరకమిం గరంబు నిర్వేదించి చెటియొక్క దిక్కునకుం జెదరి చని వెదకుచుండ నండజపుండరీకజంబుకంబు లొక్కచక్కటిం జేరుడు బలిభుక్కు తక్కువానిం గనుంగొని మీ రెంతమాత్రంబేనిఁ బలలంబు సేకరించినజాడగానము. మీయంతవారి కసాధ్యం బగుకార్యంబు క్షుద్రంబగుపక్షికి సాధనం బగునె ? మధ్యాహ్నంబయ్యె. ఇంకం గ్రుమ్మరిన దాన వ్యర్థాయాసంబుకాని ఫలంబు లేదు. ఱేఁడు మనరాక వేచియుండును. అతనిపాలికిం జెనఁటి చేతులం జనదు. మన మింతకాలంబు ఱేఁడు తెచ్చియిచ్చినమాంసంబు బరు లుబ్బ భుజియించి కాలు గదలింపక నిశ్చింతంబుగ నుండితిమి. ఱేని కొక్కయిక్కట్టు వాటిల్లినతఱి నొక్కపూఁటకయిన గ్రాసంబు దెచ్చి యీనోపమేని మనభృత్యభావంబుగాల్పనె? ఇప్పుడొక్క చొప్పు నాడెందంబునకుం బొందుపడి కానంబడియెడి. దాని విని మీకుం బోలిన తెఱఁగు గావింపుఁడు' అని నలువలంకులు కలయ విలోకించి మఱికొంత చెంతకుం జరిగి చెవిడాసి యిట్లనియె. 'మన మీలొట్టియను సరిపెట్టి నేఁటికి ఱేని కార్యంబు జరిపితిమేని ఱేపుపోలినయట్లు చూచుకొందము. ఱేఁడుపయోగింపశేషించిన యామిషంబు మనము కొన్ని దినంబుల నన్యాపేక్షంబుగ భక్షింపవచ్చును.' అన విని జంబుకం బిట్లనియె. 'మనయ ధీశ్వరుండాక్రమేలకంబు నమాత్యపదంబొసంగి కరంబు గారవించుచున్న వాఁడు. మనము దానికొక్కయపాయంబు గావించితిమేని మానసంబునకు నొవ్వుపుట్టించి

దవ్వగుదుము, కావున నీచెప్పినచొప్పుచొప్పడదు' అన బలిభుజం బిట్లనియె. 'క్షుధాబాధితుండు కృత్యాకృత్యంబు లారయంజాలఁడు. స్వజనహననంబున కయినం బాలుపడుంగాని యిది యకృత్యంబని తలంపఁడు. వ్యాళియుశార్దూలియు నిజాండశాబకంబులక్షుధాబాధంజేసికాదె భక్షించెడు?' నావిని వ్యాఘ్రంబిట్లనియె. 'క్షుధితుండయి తద్దననంబునకు మృగనాథుండు పాల్పడినం గానిమ్ము. మనకది కార్యంబుకాదు. మన మాతనిసమ్ముఖమునకుం జని మొఱఁగక మనపడిన తెఱుఁగు నివేదింతము. తదనంతరకర్తవ్యం బాతండును మనమును గలసికొని విచారింతము.' అనిన వల్లెయని లేచి చని క్రమేలకంబు చనుదేరకమున్న తారు మృగరాజుంగాంచి 'స్వామీ! యేమి చేయుదుము. తిరుగ రాని చోట్లెల్లం దిరిగితిమి. పడ రానిపాట్లెల్లం బడితిమి. ఇన్ని పాట్లు పడినదాన ఫలంబేమి? సర్వదా కరుణోదారుండవయి మాభరణరక్షణంబులు స్వకృత్యంబులుగ నిర్వర్తించు దేవరకు మావలన నావంతయయినఁ బ్రయోజనంబు లేదయ్యె అయినను మావిన్నపం బొకండు గాదనక యవధరింపుఁడు. దేవరవారాఁకలిచే మిక్కిలి వాడంబాఱి యున్న వారు. మాలోపల నొక్కనిం దమగర్భంబుఁ జొప్పించి ధన్యం గావింపుఁడు' అనవుడు మృగనాథుండు హరిహరి యని చెవులుమూసికొని 'యెంతమాట వినవలసివచ్చెను! చిరకాలంబు మిమ్ము రక్షించి యిప్పు డొక్కనాఁటి యాహారంబుకయి మీకొక్కకీడు దలంచితినేని లోకంబునవారు నన్ను నిందింపరే? పరలోకంబునకుం దొలంగనె? ఇట్టిమాటలు తలపెట్టకుఁ' డన జంబుకంబు కాకంబుగాంచి 'నీవు సైకంబవు. నిన్నుపయోగించుటవలన తేనికిం గడుపుఁజిచ్చుడుగంబోదు తొలంగుము. నా మేనుతేనికి భోజ్యంబు చేసి కృతార్థుండ నయ్యెద'నన విని శార్దూలం బిట్లనియె. 'కాకంబుకంటె నీవు కొంత పెద్దజంతువువైన నాతని యాఁకలి పోకార్ప నీనంజుడుం జాలదు. నేను రాజునకు భోజనంబయ్యెద'ననిన వెండియు జంబుకం బిట్లనియె. 'నీవు లావుగలవాఁడవు. నేఁడు గాకున్న తేపైన తేనిం బోషింప వలంతివి. నీ యనంతరంబు మేముండినం గొండొకయేనిం ప్రయోజనంబు లేదు. కావున నీవచనంబు గ్రాహ్యంబుగా'దని కుమ్ముసుద్దులాడుచుండఁ జిత్రవర్ణుండు సను దెంచి తద్వృత్తాంతంబు సాంతంబుగా వారివలన విని 'యూరక యేల పాలువోక పెనం

గెదరు ? నేనిక్కార్యంబునకుఁ జాలియున్న వాఁడ. నామనుగడవలన ఁతేనికొక్క ప్రయోజనంబులే' దనిన జంబుకంబు ఁతేనింగాంచి 'యీకార్యంబు నాకుం బోలియున్న యది. ఇందు దేవరకు దురితంబు లేదు. శరీరరక్షణంబు పరమధర్మంబు శరీరంబుగలిగిన నెల్లధర్మంబులు సాధింపవచ్చు. 'శరీరమాద్యం ఖలు ధర్మసాధన' మ్మని ప్రాజ్ఞులు వక్కాణింతురు. భృత్యుండు స్వామి కార్యహతప్రాణుండయ్యె నేని నాకలోకసుఖం బనుభవించును. ఇంతకంటె నొండుశ్రేయంబు గలదె? మీరొల్లకుండిన వే మెల్లరు ప్రాణంబులు దొఱంగెదము' నావుడు మృగనాథుండు చిత్రవర్ణనియాననంబవలోకింప 'జంబుకరాజు చెప్పినచొప్పు దప్పదు. సంశయింపక నాచెప్పినచొప్పు గావించి నన్ను ధన్యుంజేయుము' నావుడు నెట్టకేలకు క్షుధాబాధ దుస్సహం బగుడు మృగేంద్రంబు లొట్టియం జంపి భక్షించెను.

ఎట్టివానితోడనేని నవీనసేవకునితోడ రాజును దద్భృత్యులును మనంబునం గలసియుండరు.

## అధ్యయన వేదిక

**అర్థములు :**

విపినము = అడవి; కంఠీరవము = సింహము; వ్యాఘ్రము = పెద్దపులి; గహనము = అడవి; ఉష్ట్రము = ఒంటె; క్రమేలకము = ఒంటె; త్రాసము = భయము; మహాంగము = ఒంటె; పిఱుద = వెనుక; వాసంతము = ఒంటె; పంచాస్యము = సింహము; పాటవము = శక్తి; తోడెంబు = కొంచెము; ఎర = ఆహారము; అండజము = కాకి; పుండరీకము = పులి; జంబుకము = నక్క; బలిభుక్కు = కాకి; చెనటి చేతులన్ = ఒట్టిచేతులతో; గ్రాసము = ఆహారము; లొట్టి = ఒంటె; ఆమిషము = మాంసము; బలిభుజము = కాకి; హననము = చంపుట; వ్యాళి = సర్పము; శాబకములు = పిల్లలు; క్షుధ = ఆకలి; సైకంబవు = చిన్నదానివి; ప్రాజ్ఞులు = పండితులు

**సంధులు :**

**ఈ క్రిందివానిని విడదీసి సంధి పేర్లను వ్రాసి, సూత్రములను వ్రాయుము.**

శరణాగతుడు, మహాంగము, వ్యర్థాయాసము, కృత్యాకృత్యములు, మృగేంద్రుడు, ఇవ్విధము

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహవాక్యములు వ్రాసి, సమాసముల పేర్లను వ్రాయుము.**

వ్యాఘ్రజంబుకములు, అండజపుండరీకజంబుకములు, క్షుధాబాధితుడు, నాకలోకసుఖము, మృగేంద్రుడు

**అర్థ సందర్భములు :**

1. నాపురాకృత కర్మంబు వ్యాధి రూపంబున నన్ను బాధించుచున్నయది.
2. క్షుద్రంబగు పక్షికి సాధనంబగునే
3. క్షుధా బాధితుడు కృత్యాకృత్యంబులారయంజాలడు
4. ఊరక యేల పాలువోక పెనంగెదరు?

**ప్రశ్నలు :**

1. ఒంటె సింహము వద్ద మంత్రిగా చేరిన విధమును వివరింపుము.
2. వాయసాదులు వ్యాధితో బాధపడు సింహముతో ఏమని పల్కిరి?
3. బలిభుక్కు పన్నిన కుట్ర దాని పర్యవసానము వివరింపుము.

***విద్యార్థులకు సూచన :***

నీతికథలను వ్రాయుటకు ప్రయత్నింపుడు.

***ఉపాధ్యాయులకు సూచన :***

నీతి చంద్రికలోని కథలను పిల్లలకు తెలియబరచుట యుక్తము.

# 2. వాతావరణ కాలుష్యము

**- కె.యస్.శాంతలక్ష్మి**

*నేడు ప్రపంచమంతా ఏకమై ఎదుర్కొంటున్న సమస్య వాతావరణ కాలుష్యం. ఈ సమస్యను గురించి వైజ్ఞానికపరంగా నిర్దుష్టంగా శ్రీమతి **కె.ఎస్.శాంతలక్ష్మి**గారు రచించిన ఈ వ్యాసము **'తెలుగు'** అను త్రైమాసిక వైజ్ఞానిక పత్రిక నుండి గ్రహింపబడినది.*

వాతావరణ కాలుష్యము అన్న సమస్య అనాది నుంచి అంతో ఇంతో ఉంది. అగ్నిపర్వతాలు ప్రేలడం, అడవుల దహనాల వంటి వాటివల్ల పూర్వం వాతావరణము కలుషితము అయ్యేది. జంతు, వృక్ష, మృత కళేబరాలు కుళ్ళినప్పుడు అనేక రకాలయిన వాయువులు వాతావరణాన్ని చేరేవి. కొన్ని రకాల మొక్కలు విడుదల చేసే పరాగ రేణువులు గాలిలో కలిసి కలుషితం చేస్తాయి. కాని ఈ కాలుష్య శాతం తక్కువగా ఉండడంవల్ల వర్షాలు, గాలులు, మంచు కాలుష్యాన్ని తగ్గించేవి.

కాని ఈనాడు అనుక్షణం పెరిగే కాలుష్యం రేటు పెద్ద సమస్యగా తయారయింది. పరిసరాల పరిరక్షణ ఒక విలాసంగా భావిస్తారు కొందరు. ఇండియా వంటి పేద దేశానికి అది అసాధ్యమని కొందరి భావన. కాని అది విలాసం కాదనీ దేశ ప్రజల ఆరోగ్య దృష్ట్యా అది అవసరమనీ ప్రభుత్వమూ, ప్రజలూ గుర్తించటం అవసరము.

**కాలుష్య కారణాలు :**

అంతులేని పారిశ్రామికీకరణం, ఎడతెగని జనాభా పెరుగుదల, ప్రజలలో నిరక్షరాస్యత, వాతావరణ పరిశుభ్రతకు సంబంధించిన కనీస విజ్ఞానము చాలామంది ప్రజలకు లేకపోవడం, పేదరికము, పెరిగిపోతున్న వాహనాలు నానాటికి దేశంలో వాతావరణ కాలుష్యాన్ని పెంచుతున్నాయి. జనాభా పెరుగుదలతో వాతావరణ కాలుష్యం

ముడిపడింది. గ్రామ ప్రాంతాల్లో నిరుద్యోగం, పట్టణాలపై మోజు గ్రామీణులను నగరాలకు తరలి వచ్చేటట్లు చేస్తున్నాయి. పల్లెలు ఆర్థిక వనరులను సమకూర్చలేని స్థితిలో ఉండడంవల్ల ప్రజలు పట్టణాలకు వలస పోతున్నారు. పట్టణ విస్తీర్ణం విపరీతంగా పెరుగుతున్నది. పెరిగే నగరాలు ఒక క్రమపద్ధతిలో కాకుండా ఇష్టం వచ్చిన రీతిలో పెరుగుతున్నాయి. ప్రతి పంచవర్ష ప్రణాళికలోనూ కర్మాగారాలు పెరగడం, అవీ పెద్ద నగరాలలోనే స్థాపించడంవల్ల పట్టణాలలో జనాభా అనూహ్యంగా పెరిగిపోతుంది. గృహ సమస్యలు ఎదుర్కోవడానికి ఆకాశ హర్మ్యాలు కడుతున్నారు. అదీ చేయలేనివాళ్ళు పట్టణాలలోని ఉద్యోగావకాశాలను పురస్కరించుకొని పరిసర ప్రాంతాలనుండి తండోప తండాలుగా రైళ్ళలోనూ, బస్సులలోనూ రాకపోకలు జరపడంతో సిటీబస్సుల ఉపయోగం ఎక్కువైంది. ఇవి గాలిలోనికి విడుదల చేసే వాయువులు వాతావరణ కాలుష్యానికి దోహదం చేస్తున్నాయి. పట్టణ ప్రాంతాలు పల్లెలకంటె రెండు రెట్లు వేగంతో పెరుగుతున్నాయి. పట్టణాల విస్తరణలో వ్యవసాయ క్షేత్రాలను ఆక్రమించడం, అడవులను నరకడం జరుగుతున్నది. పెద్ద పెద్ద నగరాలు ఉష్ణద్వీపాలవలె పనిచేస్తాయి. ఇవి పగటిపూట సౌరశక్తిని నిల్వచేసుకుని రాత్రులలో వేడిమిని విడుదల చేస్తాయి. ఈ ఉష్ణద్వీపాలు పరిసర పల్లెవాసులకు కూడ కలుషిత వాతావరణాన్ని రవాణా చేయడానికి దోహదం చేస్తాయి.

**వాతావరణ కాలుష్యము వివిధ రకాలు :**

1. గాలి కాలుష్యము (Air Pollution)
2. నీటి కాలుష్యము (Water Pollution)
3. ఆహార కాలుష్యము (Food Pollution)
4. ధ్వని కాలుష్యము (Sound & Noise Pollution)
5. కాంతి కాలుష్యము (Light Pollution)

**గాలి కాలుష్యము :**

ఈ భూమ్మీద ప్రాణులు పుట్టినప్పటినుంచి ఆక్సిజన్‌ను పీల్చుకుని కార్బన్ డై ఆక్సైడ్‌ను వదిలేస్తున్నాయి. మనుషులు వదిలిన కార్బన్ డై ఆక్సైడ్‌ను చెట్లు పీల్చుకుని ఆక్సిజన్‌ను వదిలేసేవి. అందువల్ల గాలి పరిశుభ్రంగా ఉండేది. కాని పారిశ్రామికీకరణ కోసం విచక్షణ లేకుండా చెట్లను నరికేయడంతో పరిశ్రమలు వదిలే

రసాయన పదార్థాల నుంచి గాలిని కాపాడడం చెట్లకు మించిన పనయింది. చెట్లకు గాలిని శుభ్రం చేసే శక్తి తగ్గిపోతున్నది.

వ్యర్థ పదార్థాలను దహనం చేసేటప్పుడు నైట్రోజన్ ఆక్సైడ్, కార్బన్ మోనాక్సైడ్ వాతావరణంలోకి చేరుతుంది. రైళ్ళు, కార్లు, ట్రక్కులు, విమానాలు వంటివి ఇంధనాలను అంతర్దహనం చెందించడంవల్ల హైడ్రో కార్బన్స్, కార్బన్ మోనాక్సైడ్, సీసం, నైట్రోజన్ ఆక్సైడ్‌లు గాలిలో చేరుతాయి. ఫ్యాక్టరీ పొగ గొట్టాలనుండి వెలువడే వ్యర్థ వాయువులు పొగ రూపంలో కలిసినపుడు ఆ పొగలోని మసి కణాలు సూక్ష్మ రూపంలో ఉండి, పొగమంచును ఏర్పరచే చర్యకు దోహదం చేస్తాయి. బరువుగా ఉండే ఈ పొగమంచు భూమిని అంటిపెట్టుకుని ఉండడంవల్ల గాలిలో ఏర్పడిన కాలుష్యాలు వాతావరణ ఉపరిభాగానికి వ్యాపనం చెందలేవు. అందువల్ల తప్పనిసరిగా ఆ గాలినే పీల్చవలసి వస్తోంది.

పై కాలుష్య కణాలు కలిగిన గాలిని పీల్చడం ద్వారా అనేక దుష్ఫలితాలు కలుగుతాయి. కలుషితమైన గాలిని పీల్చడం ద్వారా గొంతు, ఊపిరితిత్తులకు సంబంధించిన వ్యాధులు ప్రబలుతాయి.

సిమెంట్ పరిశ్రమలున్నచోట డస్ట్ ఫిల్టర్స్ లేకపోతే సిమెంట్ దుమ్ము ఫ్యాక్టరీ పొగ గొట్టం ద్వారా గాలిలో కలుస్తుంది. ఇది పీల్చినవాళ్ళకి ఉబ్బసం, టి.బి (క్షయ) గొంతునొప్పి, దగ్గు, ఇసనోఫీలియా మొదలైన రోగాలు వస్తాయి. పరిసర ప్రాంతాలలోని చెట్లు ఈ ధూళివల్ల ఉత్పాదకశక్తిని కోల్పోతున్నట్లు తెలిసింది.

భూమికి 15 - 20 మైళ్ళ ఎత్తున ఓజోన్ పొర ఉంటుంది. ఇది సూర్యుని నుంచి వెలువడే ప్రమాదకరమైన అతి నీల లోహిత కిరణాల నుండి వాతావరణానికి రక్షణ కల్పిస్తుంది. కాని వాతావరణ కాలుష్యంవల్ల ఓజోన్ పొర నశించిపోయి, అతి నీల లోహిత కిరణాలు భూమిపై ప్రసరించి పంటల దిగుబడి తగ్గడం, ప్రజలు స్కిన్ కాన్సర్‌కు గురికావడం వంటి దుష్ఫలితాలకు దారితీస్తుందని పరిశోధనలో తేలింది. కనుక వాతావరణంలోని ఓజోన్ పొరను రక్షించుకోవాల్సిన ఉమ్మడి కర్తవ్యం ప్రపంచ దేశాలన్నింటిపైనా ఉన్నది.

**నీటి కాలుష్యము :**

భారతదేశంలోని నదీ జలాలన్నీ పరిశ్రమల నుంచి వచ్చే వ్యర్థ పదార్థాలతో

నిండి ప్రాణాంతకాలుగా పనిచేస్తున్నాయి. కొన్ని కరిగిన ఘన పదార్థాలవల్ల త్రాగే నీళ్ళు కొన్ని ప్రాంతాలలో ఫ్లోరోసిస్ అనే వ్యాధిని కలగజేస్తున్నాయి. అనారోగ్య వాతావరణంవల్ల చర్మవ్యాధులు కలగజేసే క్రిములు నీటిద్వారా ప్రబలమై మానవుని రక్తాన్ని పీల్చి రక్తహీనులుగా తయారుచేస్తున్నాయి.

పట్టణాలలో జనాభా సమస్య విపరీతమైపోవడంవల్ల రోజంతా నీరు సరఫరా చేయడానికి వీలు లేక రోజులో కొన్ని గంటలు మాత్రమే నీటిని అందించే పథకంవల్ల కొంతకాలం గొట్టాలలో పీడనం తగ్గి, అవి అతుకులున్నచోట మురుగు కాల్వల పక్కగా మంచినీటి గొట్టాలున్నపుడు కొంత చెత్తా చెదారాన్ని గ్రహించి త్రాగే నీటిని కలుషితం చేసి కలరా, కామెర్లు వంటి జబ్బులను కలగజేస్తున్నాయి. నీటి పరిశుభ్రత పథకాలు సరిగా అమలు లేనప్పుడు కూడ తాగే నీరు కలుషితమైపోయి రోగకారకమవుతుంది.

గ్రామాల్లో చెప్పులు వాడరు. అందువల్ల పాదాలకంటిన క్రిములు బావుల్లో, చెరువుల్లో, కాలువల్లో దిగినప్పుడు వాటిలో చేరతాయి. గ్రామాలలో త్రాగే నీటికి చెరువులను ఉపయోగించాల్సిన సందర్భంలో అందులోనే పశువులను కడగడం, బట్టలు ఉతకడంవల్ల చర్మవ్యాధులు సంక్రమిస్తాయి.

ఇళ్ళలో నీటి గొట్టాల ద్వారా ప్రమాదపూరిత లోహకణాలు త్రాగే నీళ్ళలో చేరి ఉండటానికి అవకాశం ఉంది. సురక్షిత నీటి పథకాలెన్ని అమలు జరుపుతున్నా ప్రజలకి నిరక్షరాస్యతవల్ల, పేదరికంవల్ల ప్రాథమిక ఆరోగ్యానికి సంబంధించిన విజ్ఞానం లేకపోవడంవల్ల నీటికాలుష్య నివారణ కష్టమైపోతున్నది. సరియైన మురుగు కాల్వల పథకాలు లేకపోవడంవల్ల దోమల సంఖ్య విపరీతంగా పెరిగిపోతున్నది.

**ఆహార కాలుష్యము :**

మానవుడి అజాగ్రత్తవల్ల ఆహారపదార్థాల తయారీలోనూ, నిల్వలోనూ, కొంత కల్తీకి, అపాయానికి అవకాశం ఉంది. పంటలకు హాని చేసే క్రిములను నాశనం చేయడానికి వాడే క్రిమిసంహారక ద్రవ్యాలు ఆహారంతో కలిసి ఉండవలసినదానికంటే ఎక్కువ పాళ్ళలో ఉన్నప్పుడు హాని కలగజేస్తాయి. పరిశ్రమలలో వచ్చే వ్యర్థ పదార్థాలు స్థానికంగా ఉన్న పంట పొలాలను, లెడ్, జింక్ కాడ్మియం వంటి లోహాలతో కలుషితం చేస్తాయి.

చిట్టెలుకలు, బల్లులు, బొద్దింకలు మొదలైన ప్రాణుల పాదాలు శరీరం ద్వారా హానికరమైన క్రిములను మన ఆహారంలోనికి సరఫరా చేయడం, వాటి విసర్జనాలవల్ల ఆహారం కలుషితం కావడం తద్వారా అనారోగ్యాన్ని అందించడం జరుగుతుంది.

ప్రకృతి సహజమైన కాలుష్యము కొంత, పరిశ్రమల ద్వారా కొంత, ఆహార కాలుష్యము తప్పనిసరి అవుతున్నది.

**ధ్వని కాలుష్యము :**

సాంకేతిక పరిశ్రమలు, యంత్ర పరికరాలు తయారుచేసే కర్మాగారాలు, హెచ్చుస్థాయిలో శబ్దాన్ని కలుగజేసి, అక్కడ పనిచేసే కార్మికులకు శబ్ద కాలుష్యాన్ని, తద్వారా అనారోగ్యాన్ని కలగజేస్తున్నాయి. యంత్రాల్లో పనిచేసేవారికి ఆ రణ గొణ ధ్వనులవల్ల చెవుడు వచ్చే ప్రమాదముంది. ధ్వని నిరోధకాలను వాడడం, ఇయర్ మఫ్లర్స్‌ని ఉపయోగించడం, యంత్రాలను సరియైన స్థితిలో ఉంచుకొనడం ద్వారా ధ్వని కాలుష్యాన్ని కొంతవరకు నివారించవచ్చును.

శబ్ద కాలుష్యాన్ని డెసిబల్స్ అనే ప్రమాణాల్లో కొలుస్తారు. ఇది 80 - 90 డెసిబల్స్‌ని దాటిన తరువాత అది అనారోగ్య హేతువు. మద్రాసులోని పరిశోధనలో వేప, కాజురినా చెట్లు శబ్దాన్ని గ్రహించడానికి తద్వారా శబ్ద కాలుష్యాన్ని నివారించడానికి ఉపయోగించవచ్చని పరిశోధనలో తేలింది. మన పరిశ్రమల ప్రాంతాల్లో వీటిని వరుసలుగా నాటించి శబ్దాన్ని తగ్గించడమేకాక వాతావరణాన్ని మెరుగు పరుచుకొనవచ్చు.

నగరాలలో ఫ్యాక్టరీలు, వాహనాలు, సినిమాహాలులు పెరగడంతో ధ్వని కాలుష్యము నానాటికి తీవ్రతరమౌతున్నది. నగరాలలోని ధ్వని, వాతావరణ కాలుష్యాలు మనిషిమీద స్లోపాయిజన్‌లా పనిచేస్తున్నాయి.

**కాంతి కాలుష్యము :**

కాంతి కాలుష్యము మహానగరాలలోని పరిశీలనా కేంద్రాలపై (observatory) ప్రభావం చూపడంవల్ల అవి తమ నైపుణ్యాన్ని కోల్పోతూ ఉన్నాయనీ, విపత్కరమైన పతనాన్ని ఎదుర్కోవలసి వస్తున్నదనీ నిపుణులు అభిప్రాయపడుతున్నారు. ఉదాహరణకి శానడైగొలోని పాలొమర్ పరిశీలనా కేంద్రంలో, సోడియం బాష్పదీపాలు

వీధి దీపాలుగా వాడటంవల్ల కాంతి కాలుష్యానికి గురి అవుతూ ఉందని ఖగోళశాస్త్రజ్ఞులు ఆందోళన చెందుతున్నారు.

ఇన్ని రకాల కాలుష్యాలతో నిండిన పల్లెలు, పట్టణాలు నగరాలలోని ప్రజలు పేదరికంతోపాటు అనారోగ్య వాతావరణంలో నివసిస్తున్నారు. ప్రజలందరికీ ప్రాథమిక ఆరోగ్యం చేకూరాలంటే, అధికారులు ప్రజలలో ప్రాథమిక సాంకేతిక విజ్ఞాన ప్రచారానికి పూనుకోవాలి. వీరందరూ ఒకరితో ఒకరు సహకరించి దీక్షాకంకణులై, నగరాల పునర్నిర్మాణ కార్యక్రమాన్ని నిజాయితీతో చేపట్టిననాడు, ఆరోగ్యప్రద వాతావరణాన్ని దేశంలో పునః ప్రతిష్ఠించగల అవకాశాలు కలిగి, మన దేశంలోని నగరాలన్నీ సుందరంగా తీర్చిదిద్దడానికి వీలుంటుంది.

## అధ్యయన వేదిక

**అర్థములు :**

సంక్రమించు = కలుగు; హర్మ్యాలు = భవనాలు.

**సంధులు :**

**ఈ క్రిందివానిని విడదీసి సంధి పేర్లను వ్రాసి, సూత్రములను వ్రాయుము.**

పునర్నిర్మాణము, చిట్టెలుక, ఉద్యోగావకాశాలు.

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహవాక్యములు వ్రాసి, సమాసముల పేర్లను వ్రాయుము**

వాతావరణ కాలుష్యము, అగ్నిపర్వతాలు, రాకపోకలు, ఉష్ణద్వీపాలు, వ్యర్థపదార్థాలు, నిరక్షరాస్యత, యంత్రపరికరాలు, దీక్షాకంకణులు.

**అర్థ సందర్భములు :**

1. పెద్ద పెద్ద నగరాలు ఉష్ణదీపాలవలె పనిచేస్తాయి.
2. గాలిని కాపాడడం చెట్లకు మించిన పనయింది.
3. మనిషిమీద స్లోపాయిజన్‌లా పనిచేస్తున్నాయి.
4. అధికారులు ప్రజలలో ప్రాథమిక సాంకేతిక విజ్ఞాన ప్రచారానికి పూనుకోవాలి.

**ప్రశ్నలు :**

1. వాతావరణ కాలుష్యానికి గల కారణాలేవి?
2. వాతావరణ కాలుష్యం ఎన్ని రకాలు?
3. గాలి కాలుష్యం గూర్చి వ్రాయుము?
4. నీటి కాలుష్యం గూర్చి క్లుప్తముగా వివరించుము?
5. ఆహార కాలుష్యం ఎట్లు ఏర్పడును?
6. ధ్వని కాలుష్యం గూర్చి తెలుపుము?
7. కాంతి కాలుష్యం దేనివలన కలుగును?

***విద్యార్థులకు సూచన :***

పరిసర పరిశుభ్రతను పాటించడంలో శ్రద్ధ వహించాలి.

***ఉపాధ్యాయులకు సూచన :***

వాతావరణ కాలుష్య నివారణ పద్ధతులు విద్యార్థులకు తెలియజేయుట యుక్తము.

# 3. ముట్నూరి కృష్ణారావు

*- డా॥ ముదిగొండ శివప్రసాద్*

***డా॥ ముదిగొండ శివప్రసాద్‌గారు*** *1940 సం॥న ప్రకాశంజిల్లాలోని 'ఆకులల్లూరు' గ్రామములో జన్మించిరి. వీరి తండ్రిగారైన శ్రీ మల్లికార్జునరావుగారు మహారచయిత, వక్తగా ప్రసిద్ధిగాంచిరి. శివప్రసాద్‌గారి తాతగారైన జ్వాలయారాధ్యులవలన వీరికి కవిత్వము, వక్తృత్వము మంత్రోపాసన అనువంశికముగా సంక్రమించినవనుటలో అతిశయోక్తి కానేరదు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆంధ్రోపన్యాసకులుగా పనిచేసిరి.* ***"ఆధునికాంధ్ర కవిత్వముపై వివిధ ఉద్యమముల ప్రభావము"*** *అనే అంశముపై పరిశోధనగావించి* ***'డాక్టరేట్'*** *పట్టమును పొందిరి. కృష్ణాపత్రిక సంపాదకవర్గములో పనిచేసి ఆ పత్రిక వృద్ధికి గొప్ప దోహదము గావించిరి.*

***"చారిత్రక నవలాచక్రవర్తి" 'చారిత్రక నవలాసామ్రాట్" 'అభినవపాల్కురికి'*** *అనెడివి వీరి* ***బిరుదములు. "చిదంబర రహస్యం" 'స్వప్నభంగం' 'అగ్నిగీతం' వసంతగౌతమి*** *అనునవి వీరి రచనలలో పేర్కొనదగినవి.*

*భారతదేశములోనేకాక యితర దేశములందును వీరు సాహిత్య సాంస్కృతిక, తత్త్వప్రచారప్రసంగములు గావించి బహుసన్మాన సత్కారములను అందుకొనిరి.*

*ప్రసిద్ధ సాహిత్య పత్రికయైన కృష్ణాపత్రికద్వారా ప్రజలలో స్వాతంత్ర్య ప్రబోధమును కలిగించిన* ***ముట్నూరి కృష్ణారావుగారి*** *జీవితవిశేషములను వివరించు వ్యాసమే ప్రస్తుత పాఠ్యభాగము.*

శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు 1879వ సంవత్సరంలో జన్మించారు. స్వస్థలం సాగరతీర ప్రాంతమైన మచిలీపట్నం. అప్పటికే బందరు తెలుగునాట సుప్రసిద్ధమైన

సాంస్కృతిక కేంద్రంగా ప్రసిద్ధి చెందింది. అనాదిగా గ్రీకు, రోమను, పారసీక దేశాలకు మచిలీపట్నం నుంచి వస్త్రాలు మొదలైనవి ఎగుమతి చేస్తూ ఉండేవారట. అట్లా ఆర్థికరంగంలోనేకాక సాంస్కృతిక కళా రాజకీయ రంగాలలో కూడా బందరు మొదటినుంచి ముందంజ వేసింది. అటువంటి వీరగడ్డమీద జన్మించినవాడు మన కథానాయకుడు. దురదృష్టవశాత్తు చిన్నతనంలోనే శ్రీ కృష్ణారావు తన తల్లిదండ్రులను కోల్పోయారు. అందువలన పినతండ్రి శ్రీ రామస్వామిగారు ఆయనను దగ్గరకు తీసి విద్యాబుద్ధులు నేర్పించారు. శ్రీ కృష్ణారావు బందరు హిందూ హైస్కూల్లో మెట్రిక్యులేషన్ వరకు చదివి తరువాత నోబుల్ కళాశాలలో చేరాడు. అప్పుడు నోబుల్ కళాశాలలో బ్రహ్మర్షి శ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు ఉపాధ్యాయులుగా పనిచేస్తున్నారు. శ్రీ కృష్ణారావు జీవితానికి అదొక అపూర్వ వరమయింది. బంగారానికి తావి అబ్బినట్లు జన్మ సిద్ధంగానే మేధావి తాత్వికుడైన శ్రీ కృష్ణారావుకు కులపతి సాంగత్యం వన్నె తెచ్చి పెట్టింది. ఉపాధ్యాయుడుగా ఉన్న కులపతి తన శిష్యుడైన కృష్ణారావులో ఉన్న తాత్విక దృష్టిని తేలికగానే గుర్తించాడు. దానితో కులపతికి కృష్ణారావు ప్రీతిపాత్రుడైనాడు. శ్రీ కృష్ణారావు గురువుగారితో కలిసి బ్రహ్మ సమాజ ప్రార్థనా సమావేశాలలో పాల్గొనడము, సుదీర్ఘమైన ఉత్తేజకరమైన ధర్మోపన్యాసాలను వేదికలమీద చేయడం మొదలుపెట్టాడు. శ్రీ కృష్ణారావు చేసే ప్రసంగాలలో వాక్యాలు సుదీర్ఘంగా ఉండేవి. తాత్వికంగాను, కవితామయంగానూ ఉండేవి. ఆశువుగా సాగే ఈ ప్రసంగాలను విని మేధావులు ముగ్ధులయ్యేవారు. ఈ విధంగా కృష్ణారావు జీవితంలోని తొలిదశను తీర్చి దిద్దిన ఘనత శ్రీ కులపతికి దక్కింది. కృష్ణారావులోని తాత్విక చింతన, సాహిత్య సౌరభం, జాతీయదృష్టి ముప్పేటలుగా అల్లుకొని జ్యోతిర్మయమైనాయి. త్రివేణివలె సంగమించాయి.

తరువాత విద్యకొరకు శ్రీ కృష్ణారావు మద్రాసు చేరాడు. అక్కడ క్రిష్టియన్ కళాశాలలో విద్యార్థిగా ఉన్న దినాలలో బ్రిటీషువారు జరుపుతున్న దౌర్జన్యాలు భారతదేశం పరాధీనమై పొందిన దీనస్థితి ఆయన హృదయాన్ని కలచివేశాయి. ఆ దినాలలో శ్రీ బిపిన్ చంద్రపాల్ 'న్యూ ఇండియా' అనే పత్రికను ప్రచురిస్తూ ఉండేవారు. న్యూ ఇండియా ఆనాడు భారత స్వాతంత్ర్య సంగ్రామ శంఖారావం పూరిస్తూ ఉండేది. విద్యార్థిగా ఉన్న మన ముట్నూరి శ్రద్ధగా ఆ పత్రికను చదివేవాడు. ఈ దశలో కృష్ణారావుని న్యూ ఇండియా పత్రిక తీర్చిదిద్దింది అనడంలో సందేహం లేదు. భవిష్యత్తులోని కృష్ణా పత్రిక నిర్వహణకు కావలసిన పాత్రికేయం, తదనుభూతి,

సంకల్పం ముట్నూరికి న్యూ ఇండియా ప్రసాదించింది. తరువాత కృష్ణారావు విద్యాభ్యాసం ముగించుకొని బందరు వచ్చాడు. బందరు రావడమేమిటి కృష్ణాపత్రిక బాధ్యత ఆయన భుజస్కంధాలమీద పడటమేమిటి ఒకేసారి జరిగాయి.

నిజానికి కృష్ణాపత్రిక ఒక పత్రిక కాదు. ఎనభై సంవత్సరాల తెలుగువారి సాంస్కృతిక సాహిత్య కళారంగాలకు దర్పణం. అదొక పత్రిక కాదు. ఒక ఉద్యమం. సావర్కార్ రచించిన '1857' పుస్తకాన్ని గుండెలకు హత్తుకొని స్వాతంత్ర్య పిపాసువులైన జాతీయయోధులానాడు ఉరికంబాలకు ఎదురుగా వెళ్ళి ఉరిత్రాడులను పూలదండలుగా ధరించినట్లే కృష్ణాపత్రికను చేతిలో పట్టుకొని తెలుగునాట యువకులు ఉత్తేజితులై ముందుకు నడిచి బ్రిటీషువారి లాఠీలకు, గోలీలకు ఎదురుగా తమ గుండెలను నిలిపారు. ఇలా తెలుగునాట ప్రచండ జాహ్నవిని ప్రవహింపచేసిన, ప్రసరింపచేసిన కృష్ణా పత్రిక జననం గంగోత్రివద్ద బిందువులు బిందువులుగా ప్రారంభమైన గంగానదివలెనే విచిత్రమైనది. 1892వ సంత్సరములో బందరులోని దేశభక్తులైన కొందరు యువకులు తమ సంస్కరణాత్మక జాతీయ భావాలను ప్రకటించుకోవడం కోసం తమ జిల్లాకు పరిమితంగా ఉండే ఒక వార్తాపత్రికను నడపాలని నిశ్చయించుకున్నారు. ఈనాటి కృష్ణా గుంటూరు జిల్లాలు కలిపి ఆనాడు ఒకే కృష్ణామండలంగా ఉండేది. కృష్ణాపత్రిక అప్పుడే ప్రారంభమైన కృష్ణాజిల్లా సంఘం పేరున గల సంస్థకు ప్రచార సాధనంగా ఉపయోగపడింది. జిల్లాలోని ప్రముఖులు ముందుకు వచ్చి ఉత్సాహంగా చేయూతనిచ్చి విరాళాలు అందించారు. ఈ దశలో కృష్ణాపత్రికకు దేశభక్త శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులు, ప్రముఖులైన శ్రీదాసు నారాయణరావుగారలు సంయుక్త సంపాదకులుగా ఉన్నారు. పత్రిక క్రమంగా జిల్లా వార్తలను ప్రచురిస్తూ తమ మండలం యొక్క అవసరాలను తీరుస్తూ ముందుకు సాగి క్రమంగా ఆంధ్ర ప్రాంతంలోని వార్తలను ప్రచురిస్తూ ముందుకు పోయి జాతీయావసరాలను కూడా తీర్చే విధంగా దేశీయ సమస్యలవైపు తన దృష్టిని ప్రసరించింది. ఈ దశలో ముట్నూరి కృష్ణాపత్రికకు సహ సంపాదకుడైనాడు. అప్పటికి పత్రిక వయస్సు ఒక సంవత్సరం మాత్రమే. కృష్ణాపత్రిక ఆనాటినుండి కృష్ణామండల పత్రికగా కాక శ్రీ కృష్ణారావుగారి పత్రికగా తన పేరును సార్థకం చేసుకుంది.

సహాయ సంపాదకునిగా శ్రీ ముట్నూరి కృష్ణాపత్రిక బాధ్యతను స్వీకరించి సహజసుందరమైన తన తెలుగుశైలితో పత్రికను తీర్చిదిద్దుతుండగా గుంటూరు మండలం కృష్ణామండలంనుంచి రాజకీయంగా విడివడిపోయింది. అప్పుడు 1905వ

సంవత్సరంలో కొండా వెంకటప్పయ్యగారు గుంటూరు వెళ్ళిపోయారు. ఆనాటినుంచి పత్రికయొక్క బాధ్యతను ముట్నూరే నిర్వహించసాగారు.

ఇంతలో రాజకీయంగా గాంధీ మహాత్ముడు భారతదేశానికి నాయకత్వం వహించాడు. కృష్ణారావు మహాత్ముని శాంతిసేవలో ఒక వీరసైనికుడైనాడు. వెళ్ళి మహాత్ముని పాదాలను స్పృశించాడు. గాంధీజీ కృష్ణారావు కన్నులను చూచి అందులో వెలుగుతున్న ఆధ్యాత్మిక దీధితిని గమనించి చిరునవ్వుతో శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్యతో "చూడు పట్టాభి! కృష్ణారావు కళ్ళలో ఆధ్యాత్మికజ్యోతులు వెలుగుతున్నాయి. ఈయనను బయటికి తీసుకురావాలి. తనంత తాను రాడు ప్రయత్నించాలి'' అన్నారు. ఐతే కృష్ణారావు రాజకీయ రంగస్థలంమీద ప్రత్యక్షంగా దర్శనమివ్వడానికి ఒప్పుకోలేదు. తెరవెనుక నిలబడి వేలాది స్వాతంత్ర్యయోధులను నడిపించడానికి కావలసిన కదనగీతాన్ని కృష్ణాపత్రికద్వారా ఆలపించాలని నిశ్చయించుకున్నాడు. అప్పటివరకు కృష్ణారావు కొంత వ్యంగ్యము, కొంత చమత్కారము, కొంత కళ, కొంత శాస్త్రము, కొంత సాహితీ సౌందర్యము ఇవన్నీ కలబోసిన రంగుల హరివిల్లుగా కృష్ణాపత్రికలో కన్పడేవాడు. కానీ ఆనాటినుండి కృష్ణాపత్రిక ఒక స్వాతంత్ర్య జయభేరి. కదన కాహళి. జాతీయ సమైక్యతా సమర శంఖారావంగా మారిపోయింది.

ముట్నూరి చేతిలోనికి పత్రికాధిపత్యం వచ్చిన తరువాత అది కేవలం ఒక రాజకీయ పత్రికగానో, ప్రాంతీయ పత్రికగానో నడిచిందని చెప్పడానికి వీలు లేదు. కళాసాహిత్య సౌందర్యాలన్నీ అందులో తొణికిసలాడుతూ ఉండేవి. అంతటి రసజ్ఞుడు, భావుకుడు 20వ శతాబ్దంలోని తెలుగుపత్రికా సంపాదకులలో మరొకడు లేడనడం నిర్వివాదాంశం. భాసవ్యాస కాళి దాసాదుల ప్రాచీన కవితా సౌందర్యసౌరభాలను తన హృదయంలో రంగరించుకోవడంతోపాటు, రవీంద్రారవింద, బాలగంగాధరుల కవితా తాత్త్విక కర్మయోగాలను కూడా జీర్ణించుకున్న మహనీయుడు ముట్నూరి. సంపాదక వ్యాసాలే కాకుండా రవీంద్ర సాహిత్యాన్ని తెలుగుపఠితలకు సుపరిచయం చేసే వ్యాసాలు కూడా కృష్ణాపత్రికలో ఆయనే వ్రాస్తుండేవాడు. అరవిందుడు పాండిచ్చేరి వెళ్ళి ఆశ్రమాన్ని స్థాపించి **"ఆర్యపత్రిక"** నడుపుతూ ఉండేవాడు. ముట్నూరి దాన్ని భక్తిశ్రద్ధలతో పఠిస్తూ ఉండేవాడు. ఆర్యలోని అరవిందుని తాత్త్వికధోరణి ముట్నూరిలో అంతర్నిహితంగా ఉన్న ఆధ్యాత్మికశక్తుల జాగరణకు, నిరంతర స్ఫూర్తికి ఎంతగానో తోడ్పడింది. అందుకే కృష్ణారావు ప్రతి వ్యాసం ఒక ఉపనిషత్సందేశంవలె ఉండేది. ఇలా నాలుగు దశాబ్దాలు ముట్నూరి కలం ముందుకు సాగింది.

చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు ముట్నూరిని చూచి, "ఈయన ఒక ఋషి. కనిపించని కవి'' అన్నాడు. నిజమే. ఆయన వ్రాసింది వచనమే అయినా ఏ వాక్యానికి ఆ వాక్యం మధుర కవితా శోభితం. 'గద్యం కవీనాం నికషం వదంతి' అని మనం అంగీకరిస్తే ముట్నూరి గద్యం ఒక పద్యం. వేదాలలో కవి అంటే ఋషి అని అర్థం ఉన్నదికదా!

ముట్నూరి సంపాదక వ్యాసాలే కాక 'లోవెలుగులు' అనే శీర్షికతో ఎన్నో వ్యాసాలు కృష్ణాపత్రికలో ప్రచురించాడు. ఈ వ్యాసాలను తరువాతి కాలంలో "లోవెలుగులు'' అనే పేరుతోనే ఒక పుస్తకంగా తీసుకురావడం జరిగింది. అలాగే 'సమీక్ష' అనే పేరుతో ముట్నూరి రచనలు, మరొక వ్యాససంకలనంగా కూడా వెలువడింది. కృష్ణాపత్రిక నిర్వహణ ముట్నూరి తరువాత కొన్ని చేతులు మారి 1960లో బ్రహ్మశ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారి నేతృత్వంలోకి వచ్చింది. శర్మగారి ఆధ్వర్యంలోనే కృష్ణాపత్రిక తన వజ్రోత్సవాన్ని వైభవోపేతంగా హైదరాబాద్‌లో జరుపుకున్నది. అప్పుడు కృష్ణాపత్రికలో సహ సంపాదకులుగా పనిచేస్తున్న డాక్టర్ ముదిగొండ శివప్రసాద్ (వ్యాసరచయిత) తో పాటు ప్రస్తుతం శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో పనిచేస్తున్న శ్రీధరబాబుగారలు కలిసి ముట్నూరి వ్యాసాలను పాత కృష్ణాపత్రికలనుండి పునరుద్ధరించి సంపుటాలుగా తీసుకొని వచ్చారు. ఇవేకాక ఇటీవల ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఆకాడమీ అధిపతులు కృష్ణాపత్రికతోనే కాక శ్రీ ముట్నూరి కృష్ణారావుగారితో కూడా అత్యంత సన్నిహిత సంబంధం కలిగిన డాక్టర్ రావూరి వేంకట సత్యనారాయణరావుగారిని పరిష్కర్తగా చేసి **'ముట్నూరి కృష్ణారావు వ్యాసాలు'** అనే పేర మరొక గ్రంథాన్ని వెలువరించారు. ఇవన్నీ ముట్నూరి సాహితీవైభవానికెత్తిన శృంగార నీరాజనాలు, మణిదీపాలు. కర్మయోగి ముట్నూరి 1945లో పరమపదించినా ఆయన ఊహలు, జ్ఞాపకాలు తెలుగు పాఠకులను ఈనాటికీ జాగృతం చేస్తూనే ఉన్నాయి.

## అధ్యయన వేదిక

**అర్థములు :**

అంతర్లీనంగా = లోలోపల; తావి = సువాసన; సంగమించాయి = కలుసుకున్నాయి; పిపాసువు = దాహము కలిగినవాడు; దీధితి = కాంతి; ఆలపించుట = పాడుట; కదన కాహళి = యుద్ధరంగమున ఉపయోగించు వాద్యవిశేషము; గద్యం కవీనాం నికషం వదంతి = గద్యరచన కవుల రచనలోని గొప్పతనానికి గీటురాయి అని చెప్పబడినది.

**సంధులు :**

**ఈ క్రిందివానిని విడదీసి సంధి పేర్లను వ్రాసి, సూత్రములను వ్రాయుము.**

ప్రధానాంశము, ధర్మోపన్యాసము, జాతీయావసరాలు, శంఖారావము, వజ్రోత్సవము, అత్యంత.

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహవాక్యములు వ్రాసి, సమాసముల పేర్లను వ్రాయుము.**

ప్రధానాంశము, అపూర్వవరము, విద్యాబుద్ధులు, తాత్త్వికచింతన, సాహిత్యసౌరభం, భక్తిశ్రద్ధలు.

**అర్థ సందర్భములు :**

1. వారికి రాజకీయములొక సాధనమే కానీ సాధ్యం కాదు.
2. తాత్త్వికచింతన, సాహిత్యసౌరభం, జాతీయదృష్టి ముప్పేటలుగా అల్లుకొని జ్యోతిర్మయమైనాయి.
3. అదొక పత్రిక కాదు, ఒక ఉద్యమం.
4. మహాత్ముని శాంతిసేవలో ఒక వీరసైనికుడైనాడు.
5. ఈయన ఒక ఋషి. కనిపించని కవి.

**ప్రశ్నలు :**

1. శ్రీ కృష్ణారావుగారి జీవితములో తొలిదశను వివరింపుము?
2. "కృష్ణాపత్రిక తెలుగువారి సాంస్కృతిక, సాహిత్యకళారంగాలకు దర్పణము" వివరింపుము.
3. రాజకీయ, తాత్త్విక, కర్మయోధులకు కృష్ణాపత్రిక చేసిన దోహదమెట్టిది?

***విద్యార్థులకు సూచన :***

పత్రికలకు వ్యాసములు వ్రాసి పంపుటకు ప్రయత్నింపుడు.

***ఉపాధ్యాయులకు సూచన :***

విద్యార్థులచే వ్యాసములు వ్రాయింపుడు.

# 4. స్థానం వారి ప్రతిభ

***- వంగర వేంకటసుబ్బయ్య***

*ఆంధ్ర నాటక, చలనచిత్ర రంగాలలో అనేక భిన్న, విభిన్నపాత్రలను సమర్థ వంతంగా పోషించిన ప్రజ్ఞాశాలి శ్రీ వంగర వేంకట సుబ్బయ్య. వీరు 1897 సం॥లో తెనాలి తాలూకాలోని* ***సంగం జాగర్లమూడిలో*** *జన్మించిరి. వీరు* ***సంగీతం, చిత్రలేఖనం, జ్యోతిష్యం*** *మొదలైన విద్యలందు ప్రవేశమున్నవారు.*

*మొదట కొంతకాలం ఉపాధ్యాయులుగా పనిచేసిన వీరు తరువాత తెనాలి రామవిలాససభలో చేరి స్థానం నరసింహారావుగారు, మాధవపెద్ది మున్నగు ప్రసిద్ధ నటుల సరసన అనేక పాత్రలను ధరించిరి. స్త్రీ పాత్రలను, పురుష పాత్రలను అవలీలగా నటించగల ఉత్తమనటులైన వేంకటసుబ్బయ్యగారు 1915 సం॥లో ఒక నాటక సమాజాన్ని స్వంతంగా స్థాపించి అనేక నాటకాలను ప్రదర్శించిరి. అందు* ***చింతామణి, చిత్రనళీయం, రామదాసు, విప్రనారాయణ*** *ముఖ్యమైనవి. విప్రనారాయణ నాటక ప్రదర్శనమే వారిని చలనచిత్రరంగానికి ప్రవేశింపజేసింది.*

*చలనచిత్రాలలో అనేక హాస్య తరహాకు చెందిన పాత్రలను ధరించి* ***'వంగర'*** *గా ప్రసిద్ధిచెందిన వీరు తమ 80వ ఏట మరణించిరి. వీరు స్థానంవారితో తమకు గల సన్నిహితత్వాన్ని, పంచుకున్న అనుభవాలను తెలియచేస్తూ* ***స్థానం వారి స్థానం*** *అను గ్రంథము నందు రచించిన వ్యాసమే ప్రస్తుత పాఠ్యభాగము.*

నేను శ్రీ స్థానం నరసింహారావుగారి రామవిలాస సభలో చాలాకాలం వున్నాను. అంతకుముందు తెనాలిలో వున్న ఫస్టు కంపెనీలో వుండేవాణ్ణి. 1925లో రామవిలాస సభలో చేరాను. అప్పుడు వరఘు బాబూరావుగారు మేనేజరుగాను, భాగవతుల రాజగోపాలంగారు వ్యవస్థాపకులుగాను, త్రిపురారిభట్ల వీరరాఘవయ్యగారు కండక్టరుగానూ వుండేవారు.

నాకు నాటకానికి మూడురూపాయలిచ్చేవారు. అయితేనేం! నెలకు సుమారు ఇరవైనాటకాలు ఆడేవాళ్ళం. అరవైరూపాయలు వచ్చేవి. ఆరోజుల్లో మంచి జీతం. సంసారం బాగానే సాగిపోయేది. తర్వాత నాటకానికి అయిదురూపాయలు ఇచ్చారు. నాపని మరింత బాగావుంది.

స్థానం వారు చాలా ప్రజ్ఞావంతులు. వలపులు గ్రుమ్మరించే పాత్రలు అభినయించడంలో మొనగాడు. మొదట్లో మోహినీ రుక్మాంగద నాటకం వేశారు చాలాకాలం. మోహిని నిజంగా ప్రేక్షకుల్ని మోహింపచేసేది. రుక్మాంగదుని సంగతి చెప్పాలా! ఆ నాటకంలో చాలా భాగం స్థానం వారే వ్రాశారు. తర్వాత ఆయన అనేక నాటకాలలో నటించారు. రోషనార వారికి ఎంతో పేరు తెచ్చింది. మద్రాసు రాష్ట్రంలో ఆ నాటకాన్ని నిషేధించారు. ఆ సమయంలో మేము వచ్చి హైదరాబాద్‌లో రోషనార ప్రదర్శనలిచ్చాం.

నరసింహారావుగారు మంచి చిత్రకారులు. ఆయన చిత్రించిన ఆనందగజపతిబొమ్మ ఇంకా వారింట్లో వుంది. చిత్రలేఖనంలో సిద్ధహస్తుడు కావడంవల్ల పాత్రాలంకరణలో ఆయన నైపుణ్యం ఎంతగానో తోడ్పడింది. మొదట్లో ఆయన చెవ్వుకి ఒక జంపు - పోగు వుండేది. దాన్ని కప్పివేయడంకోసం ఆయన చెవులను క్రేప్ హెయిర్‌తో కప్పివేసేవారు. అది ఫేషన్ అనుకొని చాలామంది స్త్రీలు అలా చెవ్వులు జుట్టుతో కప్పుకోవడం ప్రారంభించారు.

స్థానం వారి వేషాలు రంగస్థలానికి అలంకారంగా మారినాయి. ఒక మామూలు వ్యక్తి రంగస్థలంమీద వన్నెల రామచిలుకలాగా మారిపోవడం చూస్తే మాకే ఆశ్చర్యం వేసేది. కొన్ని కంపెనీలవారు చాలా అందమైన ఆడవాళ్ళచేత వేషాలు వేయించి చూశారు. కాని రంగస్థలంమీదకు రాగానే అందం ఎందుకూ పనికిరాకుండా పోయేది. అభినయం ఎక్కడనుంచి వస్తుంది!

మా సమాజం రంగూన్‌లో నాటకప్రదర్శనలిచ్చింది. రంగూన్‌లో వున్న సీతారామదేవాలయానికి స్థానం వారు మూడువేలరూపాయలు విరాళమిచ్చారు. అక్కడి ఆంధ్రులు శ్రీ నరసింహారావుగారికి స్వర్ణకిరీటం బహూకరించి సత్కరించారు. ఒక తెలుగు నటుడు సముద్రాలు దాటి సత్కారం పొందడమనే గౌరవం ఒక్క స్థానం వారికే దక్కింది.

స్థానం వారు అప్పుడప్పుడు సహాయ నాటకప్రదర్శనాలిచ్చేవారు. ఒకసారి

తెనాలిలో గృహదహనాలు జరిగితే నరసింహారావుగారు వెళ్ళి తాము ఉచిత ప్రదర్శన యివ్వదలిచామని అధికారులతో చెప్పి, తమ ప్రదర్శన ద్వారా అయిదువేల రూపాయలు సంపాదించి యిచ్చారు. ఇలాంటి ప్రదర్శనలు వారెన్నో యిచ్చారు. వారి కళాభిలాషకు వదాన్యత గీటురాయిగా వుండేది.

ఒకసారి మేము కలకత్తాలో చంద్రగుప్త నాటకం ప్రదర్శించాం. అది డి.యల్.రాయ్ బెంగాలీ మాతృకకు అనువాదం. స్థానం వారు మురపాత్ర ధరించారు. మూడు సీనుల్లో మురపాత్రలో గల గంభీరత గోచరించేది. ఆ ప్రదర్శనానికి ఒక బెంగాలీ ప్రొఫెసరు హాజరయ్యారు. ఆయన స్థానం వారి నటనావైదుష్యానికి ముగ్ధులై, స్టేజిమీదకు వచ్చి యిలా ప్రసంగించారు.

"చంద్రగుప్త నాటకం మా బెంగాలీ రచయిత సృష్టించాడు. ఈ నాటకాన్ని ఒక తెలుగునాటకసంఘంవారు వచ్చి ప్రదర్శిస్తే ఆనందిస్తున్నాం. ముఖ్యంగా మురపాత్ర నిర్వహణ చూచి ముగ్ధులమైపోయాం. నిజానికి నేను స్థానం వారి నటన చూచి పులక రించిపోయాను. మా రాయ్ నాటకానికి న్యాయం చేకూర్చిందీ తెలుగునాటకసంఘం."

కన్నడదేశంలో కృష్ణతులాభారం నాటకమంటే ఎంతో యిష్టం. బెంగుళూరులో ఈ ప్రదర్శనలు ఎన్నెన్నిచ్చామో చెప్పలేం. ఒక నెలలో బెంగుళూరులో వరుసగా తులాభారం ఇరవైఏడు ప్రదర్శనలిచ్చాం. మరో రాష్ట్రంలో తెలుగు సమాజం అలాంటి ఖ్యాతి గడించిందంటే ఎంతో గర్వింపదగిన విషయం. మైసూరు రాజమాత ప్రత్యేకించి తులాభారం చూశారు. తర్వాత కుమారుడైన మహారాజా వారితో చెప్పి ఆయన్ని కూడా చూడమన్నారు. వారూ చూచి స్థానం వారిని గొప్పగా సన్మానించారు.

ఇక్కడొక తమాషా ఉదంతం జ్ఞాపకం వస్తోంది. స్థానం వారు నాటకం అయిన మర్నాడు మధ్యాహ్నం ఒంటిగంటనుంచి సాయంత్రం అయిదుగంటలవరకూ మౌనవ్రతం అవలంభించేవారు. మేము బెంగుళూరులో వున్నాం. ఒకరోజు మామూలు ప్రకారం స్థానం వారు మౌనవ్రతంలో వున్నారు. ఇంతలో వారికోసం ఎవరో వచ్చారు. ఆయన మౌనవ్రతంలో వున్నారు. అయిదుగంటలయితే మాట్లాడతారని చెప్పారు. ఆ వ్యక్తి వాకిట్లో పచార్లు చేయడం ప్రారంభించాడు. ఆ యింటి యజమానురాలు మా దగ్గరికి పరుగెత్తుకు వచ్చి "ఇదేం అన్యాయం! మహారాజావారి దర్బారు బక్షీ అలా వాకిట్లో పచార్లు చేస్తుంటే చూస్తూ వూరుకున్నారేం? ఎంత అపరాధం! వెళ్ళి క్షమాపణ చెప్పి లోపలికి పిలుచుకురండి" అన్నది.

మేము వెళ్ళి ఆయన్ని లోపలకు ఆహ్వానించాం. మహారాజావారికి వినోద, విజ్ఞాన కార్యక్రమాలు ఏర్పాటు చేసే ఉద్యోగి ఆయన. అప్పటికింకా పదిహేను నిమిషాలుంది స్థానం వారి మౌనం. ఆ వచ్చిన ఉద్యోగి అంతసేపూ వుండి వారితో మాట్లాడి ప్రోగ్రాం ఏర్పాటు చేసుకొని వెళ్లారు. దీన్నిబట్టి స్థానం వారికిగల గౌరవ ప్రతిపత్తులు అర్థంచేసుకోవచ్చు. మహారాజుల్ని గూడా ఆకర్షించిన కళాభిజ్ఞత స్థానం వారిది.

నరసింహారావుగారిలో పేర్కొనదగిన మరొక గొప్ప విషయం - ఆయనగారు కంఠాన్ని శిక్షణలో వుంచుకోవడం. మొదటి వరుసలో వారికీ, చివర ఉన్నవారికీ ఒకేరీతిగా వినబడేలాగా ఆయన మాట్లాడగలిగేవారు. ఆరోజుల్లో మైకులు లేవు. నటుని ప్రతిభ ఎక్కువగా కంఠస్వరంమీదనే ఆధారపడి వుండేది. భావ ప్రకటనతోబాటు, సంభాషణల చాతుర్యంతోపాటు ఆయనగారి స్ఫుటమైన కంఠధ్వని వారికెంతో తోడ్పడింది.

స్థానం వారు మరుపురాని మహానటులు. వారితో కలిసి నాటకాలు వేయడమనే మహాద్భాగ్యం కలిగింది నాకు. ఆంధ్ర నాటకరంగానికి ఆయన ఎంతో ప్రతిష్ఠ కల్పించారు. ఆయన ఆంధ్రరంగస్థల ప్రతిష్ఠకోసం అవతరించిన కళాదేవత!

## అధ్యయన వేదిక

**అర్థములు :**

ప్రజ్ఞావంతులు = గొప్ప పండితులు ; వలపు = ప్రేమ ; సిద్ధహస్తుడు = నేర్పరి ; అభినయం = నటన ; స్వర్ణకిరీటం = బంగారు కిరీటం ; వదాన్యత = దానగుణము ; వైదుష్యము = పాండిత్యము ; సన్మానము = గౌరవము.

**సంధులు :**

**ఈ క్రిందివానిని విడదీసి, సంధి పేర్లను వ్రాసి, సూత్రములను వ్రాయుము.**

పాత్రాలంకరణ, కళాభిలాష.

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహవాక్యములు వ్రాసి, సమాసముల పేర్లను వ్రాయుము.**

నటుని ప్రతిభ, కంఠస్వరం.

**అర్థ సందర్భములు :**

1. వారి కళాభిలాషకు వదాన్యత గీటురాయిగా వుండేది.
2. మహారాజుల్ని గూడా ఆకర్షించిన కళాభిజ్ఞత స్థానం వారిది.
3. నటుని ప్రతిభ ఎక్కువగా కంఠస్వరంమీదనే ఆధారపడి వుండేది.
4. ఆయన ఆంధ్రరంగస్థల ప్రతిష్ఠకోసం అవతరించిన కళాదేవత.

**ప్రశ్నలు :**

1. స్త్రీ పాత్రకు స్థానం వారు పెట్టింది పేరు - ఎట్లు?
2. డి.యల్. రాయ్‌గారు స్థానంవారిని ఎట్లు పేర్కొనెను?
3. స్థానంవారి మౌనవ్రతమును గూర్చి తెలుపుము.

***విద్యార్థులకు సూచన :***

తరచుగా నాటకములను తిలకించుటకు, వేషములు వేయుటకు ప్రయత్నింపుడు.

***ఉపాధ్యాయులకు సూచన :***

విద్యార్థులను నాటకప్రదర్శనములందు పాత్రధారులు అగునట్లు ప్రోత్సహించుట యుక్తము.

# 5. వైశంపాయనుని వృత్తాంతము

## (చిలుక చెప్పిన కథ)

*- రెంటాల గోపాలకృష్ణ*

*శ్రీ రెంటాల గోపాలకృష్ణ 1925 సం॥న గుంటూరులో జన్మించిరి. ప్రపంచభాషలలోని ఉత్తమసాహిత్యవిజ్ఞానమును తెలుగులోనికి తీసికొనివచ్చుటకు కృషిగావించిన ప్రముఖులు.* ***సర్పయాగం, సంఘర్షణ, సమరము - శాంతి, పార్వతీశ శతకం*** *మొదలగునవి వీరి రచనలలో పేర్కొనదగినవి.*

*అభ్యుదయకవిగా, పత్రికారచయితగా, అనువాదకులుగా, నాటకకర్తగా ప్రసిద్ధిగాంచినవారిలో పేర్కొనదగినవారు. వీరి అనువాదరచనలు మిక్కిలి సరళమై తెలుగునుడికారములతో నిండి సహజసుందరముగా నొప్పారుచుండును.*

*ప్రసిద్ధ సంస్కృతకవి* ***భట్టబాణుడు*** *రచించిన* ***'కాదంబరి'*** *అను సంస్కృత గద్యరచనకు రెంటాలవారు చేసిన అనువాదమునుండి ప్రస్తుత పాఠ్యాంశము గ్రహింపబడినది. వైశంపాయనుడు మహాశ్వేతవలన శపింపబడి చిలుకగా మారును. ఆచిలుకయే ఒక మాతంగకన్యచే చిక్కి, శూద్రకమహారాజునకు కానుకగా నివ్వబడుతుంది. అతనికి చిలుక తన కథను వివరించుటయే ప్రస్తుత పాఠ్యభాగము.*

వింధ్యారణ్యం అనే ఒక అడవి ఉన్నది. ఆ మహారణ్యానికి ఇటు తూర్పుసముద్రమూ, అటు పశ్చిమసముద్రమూ ఎల్లలు, మధ్య దేశానికి భూషణంగా, భూమికి మొలనూలుగా ఉన్నదది. ఆ అరణ్యశోభ అంత ఇంత కాదు. మహావృక్షాలతో నిండి ఉన్నదా అడవి. ఆ అడవిలో దండకారణ్యం వున్నది. ఆ దండకాటవిలో అగస్త్యమహర్షి ఆశ్రమం వున్నది. జగత్ప్రసిద్ధమైన ఆశ్రమం అది. ధర్మానికి పుట్టినిల్లు

అది. అగస్త్యమహర్షి భార్య లోపాముద్ర. మహాపతివ్రత. ఆమె స్వహస్తాలతో పాదులు కట్టి, నీళ్ళు పోసి కన్నకొడుకులవలె పెంచిన వృక్షాలూ, మొక్కలూ ఎన్నో ఉన్నాయి అక్కడ. ఆ మునిదంపతుల పుత్రుడు దృఢదస్యుడు. ఆ అగస్త్యాశ్రమానికి కొంతదూరంలో పంపాసరోవరం అనే ఒక తామరకొలను ఉన్నది. సప్తసముద్రాలనూ అగస్త్యుడు పానం చేయగా వరుణుడు కోపించి బ్రహ్మదేవుని ప్రార్థిస్తే, ఆయన ఆ ముని ఆశ్రమంచెంతనే మరొక సముద్రాన్ని సృష్టించాడేమో అన్నట్లు ఉంటుంది ఆ సరోవరం. అటువంటి పంపాసరోవరం పశ్చిమతీరాన ఒక పెద్ద బూరుగువృక్షం ఉన్నది. ఆ చెట్టు ఎన్నాళ్ళనాటిదో చెప్పలేము. చాలా పురాతనమైన వృక్షం కనుక ఒకవేళ నేలకూలిపోతామోనన్న భయంతో అది ఆకాశాన్ని పట్టుకున్నట్లు తోస్తుంది.

ఆ శాల్మలీవృక్షం దండకారణ్యానికి ప్రభువు. వృక్షాలన్నింటికి నాయకుడు. వింధ్యపర్వతానికి చెలికాడు. కొమ్మలనే చేతులతో వింధ్యారణ్యాన్ని ఆలింగనం చేసుకుని ఉన్నదా చెట్టు. ఎక్కడెక్కడి చిలుకలకూ నివాసంగా ఉన్నదది. ఆ చెట్టుకొమ్మలలో, రెమ్మలలో, చిగురు గుబుళ్ళలో, తొర్రలలో, ఇక్కడ అక్కడ విచక్షణ లేకుండా అంతటా రంగురంగుల రామచిలుకలూ, ఇంకా ఇతర పక్షులూ గూళ్ళు కట్టుకొని నివసిస్తున్నాయి. అంతపెద్దచెట్టుకనుక, ఎవరూ ఎక్కలేరని, నిర్భయంగా వుండవచ్చునని అవి అక్కడ నివాసం ఏర్పరచుకుని వుండవచ్చు. గుంపులు గుంపులుగా చిలకలు వ్రాలి వుండడంవల్ల ఆ చెట్టు ఎప్పుడూ పచ్చగా కానవస్తుంది.

ఆ చెట్టులోని ఒక పురాతనమైన తొర్రలో ఒక చిలుక జంట నివసిస్తున్నది. వారే నా తల్లిదండ్రులు. నా తండ్రి బాగా వృద్ధుడైపోయి, బ్రతుకే భారంగా గడుపుచున్నాడు. ఆ దశలో విధివశాత్తుగా నేను పుట్టాను. వారికి నేను ఒక్కడనే సంతానం. నేను పుట్టినప్పుడే మా అమ్మ విపరీతమైన ప్రసవవేదన అనుభవించి చనిపోయింది. ప్రాణసమానురాలైన భార్య చనిపోవడంతో మా నాన్న మరీ కృంగిపోయాడు. అయినా పుత్రప్రేమవల్లా, తల్లి లేని పిల్లవాణ్ణి కావడంవల్లా మా నాన్న దుఃఖమంతా కడుపులోనే దాచుకుని నన్ను సాకుతూ వచ్చాడు. ఆయన పండు ముదుసలి. రెక్కలమీద ఈకలన్నీ శిథిలమైపోయాయి. అందువల్ల నార చీరలు ధరించిన తాపసివలె కనిపిస్తాడు. ఆయన బాగా ఎగరలేడు. శరీరానికి వణుకు కూడా ఏర్పడింది. తిరిగి ఆహారం సంపాదించుకునే శక్తి లేదు. ఆయనకు గింజలు కొటికి కొటికి అరిగిపోయింది ముక్కు. అందువల్ల తక్కిన పక్షుల గూళ్ళలోంచి రాలి పడిన వడ్లగింజలను అట్లాగే తెచ్చి నాకు పెడుతూ ఉండేవాడు. నేను తినగా మిగిలిన

ఆహారంతోనే ఆయన రోజూ పొట్ట నింపుకునేవాడు. ఇట్లా ఉండగా ఒకనాడు ఒక సంఘటన జరిగింది. రోజూలాగానే చిలుకలన్నీ లేచి తమయిష్టంవచ్చిన దిక్కునకు ప్రయాణమైనాయి. గూళ్ళల్లో ముడుచుకుని వున్న పిల్లలు తప్ప పక్షులేవీ లేనందున బూరుగుచెట్టు శూన్యంగా, నిశ్చలంగా కనిపించింది. మా నాన్న మాత్రం ఎక్కడికీ పోలేదు. గూట్లోనే వున్నాడు. నాకింకా అప్పటికి రెక్కలు గట్టిపడలేదు. అందువల్ల బాగా ఎగరలేను. నేనుకూడా మా తండ్రితోపాటే చెట్టుతొర్రలో ఉన్నాను.

అప్పుడా మహారణ్యంలో హఠాత్తుగా వేటగాండ్ర చప్పుడు వినిపించింది. అడవిలో వున్న ప్రతి ప్రాణినీ భయకంపితం చేసింది ఆ ధ్వని. అటువంటి ధ్వని నేను ఎన్నడూ వినలేదు. నాపసిచెవులకు అది వింతగా ఉన్నది. నా చెవులు దిమ్ములెత్తాయి. భయంతో గజగజ వణికిపోయాను. ప్రక్కనే వున్న మానాన్న ముసలిరెక్కలలో తల దూర్చుకున్నాను. అంతలోనే వేటగాండ్ర అరుపులూ, కేకలూ, నా చెవిని పడ్డాయి. వారి మాటలు కూడా వినిపించాయి. రకరకాల అడవిజంతువులు సంచారం చేసిన గుర్తులు పసిగట్టి, వారు ఒకరితో ఒకరు చెప్పుకుంటున్నారు. మృగాలను వేటాడి పట్టుకోడానికి అనువైన మార్గాలగురించి ఒకరికొకరు సలహాలిచ్చుకుంటున్నారు. అంతట వారు అడవిదున్నలను, ఏనుగులను, జింకలను, పందులను, ఖడ్గమృగాలను, చెమరీ మృగాలను, సింహాలను, పులులను, నెమళ్ళను, లకుముకిపిట్టలను, తిత్తిరిపక్షులను ఇట్లా వనంలోని సకల ప్రాణుల జాడలను, ఉనికిని పసిగట్టి వేటాడడం మొదలుపెట్టారు. మృగాలను తరుముతూ పోతున్న వేటగాండ్ర పదధ్వనికి భూమి అదరింది. అడవిదున్నల మెడలు నరుకుతున్న ఖడ్గాల చప్పుడు భయంకరంగా వినిపించింది. ఇట్లా అనేక రకాలయిన చప్పుళ్ళతో అడవి అంతా అల్లకల్లోలం అయింది. సముద్రఘోష నిలిచిన తరువాత సముద్రజలాలవలెనూ, వర్షం కురిసిన తరువాత మేఘాలవలెనూ, కొంతసేపటికి వేటగాండ్ర సందడి తగ్గి అడవి నిశ్శబ్దం అయింది. అప్పుడు నాకు కాస్త భయం తీరింది. ఏంజరుగుతున్నదో తెలిసికోవాలని కుతూహలం కలిగింది. మెల్లగా మా నాన్న రెక్కలలోనుంచి ఇవతలికి వచ్చాను. చెట్టుతొర్రలోనుంచి తల బయటకు పెట్టాను. పసితనంవల్ల గ్రుడ్లు మిటకరిస్తూ అడవిలోకి చూచాను. ఎదురుగా అడవిలోనుంచి శబరసైన్యం రావడం కనిపించింది. ఆ సైనికులు అనేక వేల సంఖ్యలో ఉన్నారు. భయంకరమగు రాక్షసాకారులైన ఆ శబరులను చూచాను నేను. ఆ శబరులమధ్య వారి నాయకుడు కనిపించాడు. అతనిపేరు మాతంగుడు. శబరసేనాపతి. ఎఱ్ఱటిపట్టువస్త్రం కట్టుకున్నాడు. కత్తి, ఈటె ధరించాడు. మేఘం ఇంద్రధనుస్సును ధరించినట్లు నెమలి ఈకలు కట్టిన విల్లు చేత పట్టాడు. బకాసురుడు

బండిచక్రం పట్టుకున్నట్లు అతను చక్రం ధరించాడు. ఆ శబరసైన్యం మేమున్న బూరుగుచెట్టువద్దకు వచ్చింది. శబరిసేనాని తన విండ్లు, అంబులు తీసి చెట్టుక్రింద పెట్టాడు. తన పరిజనులు ఒక చిగురుటాకుల ఆసనం తీసుకునిరాగా, దానిమీద కూర్చుని, చెట్టు నీడన అలుపు తీర్చుకుంటున్నాడు. మరొక శబర యువకుడు సరస్సులోనుంచి నిర్మలమైన జలాన్ని తామరాకు దొప్పతో తెచ్చి నాయకుడికి అందించాడు. కొన్ని తామరతూండ్లు కొరికి తిన్నాడు. ఆ విధంగా సేద తీర్చుకున్నాడు. తరువాత తక్కిన శబరులు కూడా దాహం తీర్చుకొని అక్కడికి వచ్చారు. పిమ్మట సేనాని వారితో కలిసి ఎటో వెళ్ళిపోయాడు.

అయితే ఒక వృద్ధ శబరుడు మాత్రం చెట్టుక్రిందనే నిలుచున్నాడు. అతనికి తన వంతు జింకమాంసం చిక్కలేదు. మాంసంకోసం తపించిపోతున్నట్లు అతని ముఖకవళికలు స్పష్టం చేస్తున్నాయి. రాక్షసుడివలె వికారంగా ఉన్నాడు. ఆశబరుడట్లా కాసేపు అక్కడ తారట్లాడుతూ నిలుచున్నాడు. తరువాత మేమున్న చెట్టు ఎక్కాడు. అన్ని కొమ్మలతో, రెమ్మలతో బ్రహ్మాండంగా విస్తరించుకుని వున్న అంత పెద్ద చెట్టు కూడా వాడు సునాయాసంగా నిచ్చెనమీదనుంచి ఎక్కినట్లు జరాజరా ఎక్కి పైకి వెళ్ళిపోయాడు. చెట్టుమీద చిలుక గూళ్ళలో ఉన్నవన్నీ పసిపిల్లలు. కొన్నిటికింకా రెక్కలు రాలేదు. కొన్ని వచ్చీరాని రెక్కలతో ఎగరలేనివి. కొన్ని మరీ నిన్నా మొన్నా పుట్టిన నెత్తురు ముద్దలు. చెట్టుకొమ్మ గూళ్ళల్లో వున్న ఇటువంటి చిలుకపిల్లలను ఆ శబరుడు చెట్టు కాయలు వలుచుకున్నట్లు, ఒక్కొక్కదాన్ని ఏరి పట్టుకున్నాడు. వాటి మెడలు విరిచి క్రింద పడవేశాడు. హఠాత్తుగా సంభవించిన ఈ ఆపద చూచాడు మానాన్న. ఇది మహావిపత్తు. నివారించరానిది. అసలే వృద్ధాప్యంతో వణికి పోతున్న మా నాన్న మరీ గజగజలాడిపోయాడు. ఏంచేయాలో దిక్కుతోచలేదు. ఆ క్షణంలో నన్ను కాపాడే మార్గం ఏమిటో తోచలేదు ఆయనకు. అట్లాగే దిక్కుతోచక, పుత్రవాత్సల్యంకొద్దీ నన్ను గుండెలకు అదుముకుని వణికిపోతూ కూచున్నాడు. ఆకఠినాత్ముడు మా నాన్నను పట్టుకున్నాడు. మా నాన్న పదేపదే ముక్కుతో పొడిచాడు. కిచకిచమని అరుస్తూ దీనంగా గోలపెట్టాడు. ఆ విధంగా తప్పించుకోవాలని విశ్వప్రయత్నం చేశాడు పాపం! కాని లాభం లేకపోయింది. ఆ దుర్మార్గుడు వదలిపెట్టలేదు. మా నాన్నను పట్టి ఇవతలికి లాగాడు. మెడ విరిచి చంపివేశాడు. అయితే నన్నుమాత్రం వాడు చూడలేదు. మరీచిన్నవాణ్ణికాబట్టి భయంతో ముడుచుకొని ఉండడంవల్ల మా నాన్న రెక్కల సందున ఉన్న నేను కూడా ఆయనతోపాటు నేలమీద పడ్డాను. నాకింకా

భూమిమీద బత్తెపుగింజలున్నాయి. అందువల్ల చావలేదు. గుట్టగా ఉన్న ఎండుటాకులమధ్య పడిపోయాను. కాబట్టి నా కాళ్ళూ, రెక్కలు విరగలేదు.

శబరుడు ఇంకా చెట్టు దిగి రాలేదు. కాని వాడు రాకముందే తప్పించుకో వాలనిపించింది నాకు. మా నాన్నను విడిచిపెట్టాను. ఆయనకోసం ప్రాణాలు బలి ఇవ్వవలసిన నేను కృతఘ్నుడనై ఆయన విషయం తలచుకోలేదు. అవును. వయస్సు వస్తేకాని ప్రేమ అంకురించదు. పసితనంలో ఉన్న నాకు అప్పుడు కేవలం భయం తప్ప మరొకటి తెలియదు. అందువల్ల కొద్ది కొద్దిగా దొర్లుతూ పోయాను. ఎండుటాకుల రంగులో కలిసిపోవడంవల్ల నన్ను ఎవరూ గుర్తించరు. అట్లాగే పడుతూ లేస్తూ మెల్ల మెల్లగా జరుగుతూ అవతలికి పోయాను. మృత్యువు కోరలలోనుంచి బయటపడ్డాననిపించింది నాకు. చివరకు సమీపంలో ఉన్న ఒక తమాలవృక్షం చెంతకు చేరుకున్నాను. ఆ చెట్టుకొమ్మలు గుబురుగా ఉన్నవి. ఆ చెట్టుక్రింద పట్టపగలే చీకటిగా ఉంటుంది. సూర్యకిరణాలు కూడా ప్రవేశించనంతటి దట్టంగా అల్లుకుని ఉన్నాయి దాని కొమ్మలు. తిరిగి తండ్రి ఒడిలోకి చేరినట్లుగా నేను ఆ చెట్టుక్రిందికి చేరాను. అప్పటికి శబరుడు మేము వున్న చెట్టు దిగాడు. తాను చంపి నేలమీద పడవేసిన చిలుకపిల్లలన్నింటినీ ఏరుకున్నాడు. వాటిని ఆకులతో చుట్టి తీగెలతో కట్టాడు. గబగబ తమ నాయకుడు వెళ్ళిన దిక్కే వెళ్ళిపోయాడు. వాడు అట్లా వెళ్ళగానే తిరిగి నాకు బ్రతుకుమీద ఆశ పుట్టింది. తరువాత మెల్లగా ఆ తమాలవృక్షం మొదలు విడిచిపెట్టి ఎంతో ప్రయత్నంమీద పాకుతూ నీటిదరికి వెళ్ళాను. నాకింకా బాగా రెక్కలు రానందున అడుగులు తడబడుతున్నాయి. పదే పదే బోర్ల పడిపోతూ వచ్చాను. ఒక్క రెక్క ఊతం చేసుకున్నాను. చాలా దూరం నేలమీద పాకడంవల్ల నాకు శక్తి సన్నగిల్లి ఎంతో అలుపూ, ఆయాసం వచ్చింది. నేలమీద దుమ్మంతా నా ఒంటిమీదనే ఉన్నది. అప్పటికి సరిగ్గా మిట్టమధ్యాహ్నం అయింది. సూర్యుడు నడినెత్తిమీద ఉన్నాడు. ఎండ మండిపోతున్నది. నాకు దప్పిక ఎక్కువైంది. నేల కాలిపోతున్నందున ముందుకు సాగడం అసాధ్యమనిపించింది. నా ఒళ్ళు నా స్వాధీనంలో లేదు. కళ్ళు చీకట్లు క్రమ్ముతున్నాయి.

ఆ సమయంలో ఒక మునికుమారుడు పంపాసరోవరంలో స్నానార్థం ఆ త్రోవన వస్తున్నాడు. ఆయనపేరు హారీతుడు. మహర్షి అయిన జాబాలికుమారుడు. వారి ఆశ్రమం అక్కడికి సమీపంలోనే ఉన్నది. సమవయస్కులైన మరికొందరు మునికుమారులతో వస్తున్నాడాయన. అతడు పరమ పవిత్రుడు. కృపాసముద్రుడు.

అటువంటి మహానుభావుడైన హారీతుడు నన్ను చూచాడు. నా అవస్థ గమనించాడు. ఆయనకు ఎక్కడలేని జాలి కలిగింది. ఆయన నన్ను సరస్సుదగ్గరికి తీసికొని వెళ్ళాడు. తనే నా నోరు తెరిచి, వ్రేలితో ఒకటి రెండు చుక్కలు నీళ్ళు పోశాడు. నీళ్ళు త్రాగగానే నాకు మళ్ళీ ప్రాణాలు లేచి వచ్చాయి. తరువాత ఆయన నన్ను ఒక తామరాకు నీడన ఉంచి, తాను స్నానాదులు నిర్వర్తించుకున్నాడు. పిమ్మట ప్రాణాయామం, జపం పూర్తిచేసుకున్నాడు. తక్కిన మునికుమారులు కూడా స్నాన జపాదులు ముగించుకున్నారు. తరువాత హారీతుడు నన్ను తీసుకుని మెల్లగా తపోవనానికి బయలుదేరాడు.

కొంచెందూరం వెళ్ళగానే జాబాలి ముని ఆశ్రమం వచ్చింది. ఆ ఆశ్రమం చుట్టూ చక్కని పూలచెట్లూ, పండ్లచెట్లూ ఉన్నాయి. ఎందరో మునులున్నారక్కడ. వేదఘోష వినవస్తున్నది. కొందరు మునులు దర్భలు, పూలూ తీసుకొని జల కలశాలతో ఆశ్రమంలోకి వెడుతున్నారు. ఆ ఆశ్రమం మధ్య ఒక చక్కని అశోకవృక్షం ఉన్నది. చెట్టుక్రింద పరిశుభ్రంగా అలికి ముగ్గులు పెట్టారు. ఆ చెట్టుక్రింద జాబాలి మహాముని కూర్చుని ఉండడం చూచాను. ఆయనచుట్టూ తపస్సంపన్నులైన మహామునులు ఎందరో పరివేష్టించి ఉన్నారు. మహర్షిమండలం మధ్యనున్న బ్రహ్మదేవునివలె వెలిగిపోతున్నాడాయన. ఆయన చాలా వృద్ధుడు. ఆ మహామునిని చూడగానే నాకు ఇట్లా అనిపించింది.

ఆహా! తపోమహిమ ఎంత గొప్పది. తేరిపార చూడరాని మహాతేజస్సుతో వెలిగిపోతున్నాడు. ఈయన వలన లోకాలన్నీ పునీతం అవుతున్నాయి. సందేహం లేదు. ఈయన భూలోకబ్రహ్మ. ఈ ఆశ్రమంలో ఉన్న సకల ప్రాణులూ, చరాచర భూతకోటి ఎంతటి పుణ్యం చేసుకున్నవో కదా! ఈయన దర్శనభాగ్యంవలన నా జన్మ చరితార్థమైంది. నేను ఇట్లా తలపోస్తూ వుండగా హారీతుడు నన్ను తీసుకుని అక్కడికి వచ్చాడు. నన్ను ఆ అశోకవృక్షం నీడలో ఒకచోట వుంచాడు. తరువాత తండ్రి పాదాలకు నమస్కరించి ఆయన సమీపంలోనే ఒక కుశాసనంపై కూర్చున్నాడు. అక్కడి మునులంతా నన్ను చూచారు. ఈ చిలుకపిల్లను ఎక్కడనుంచి తెచ్చావు? అని హారీతుని అడిగారు. అందుకు ఆయన నేను పంపాసరోవరానికి స్నానార్థం వెళ్ళగా ఈ చిలుకపిల్ల కనిపించినది. అక్కడ ఒక చెట్టుమీదనుంచి పడినట్లున్నది. పాపం కొన ఊపిరితో కొట్టుకుంటూ వున్నది. దీన్ని తిరిగి ఆ చెట్టుమీద పెట్టడం సాధ్యం కాలేదు. అందుకని జాలిపుట్టి ఇక్కడికి తీసుకుని వచ్చాను. రెక్కలు వచ్చి

ఎగరగలిగేదాకా దీన్ని ఆశ్రమంలో ఏదో చెట్టుతొర్రలో వుంచుదాము. ఇన్ని పండ్లో, గింజలో తెచ్చి పెట్టవచ్చు. రెక్కలు వస్తే అదే ఎటో ఎగిరిపోతుంది లేదా అలవాటు పడితే మన ఆశ్రమంలోనే ఉండిపోతుంది అని చెప్పాడు దీనులను కాపాడడం మనలాంటివారికి ధర్మంకదా! అని అన్నాడు.

హారీతుడు ఇట్లా చెప్పగా జాబాలిముని విన్నాడు. ఆయనకు ఏదో కుతూహలం కలిగింది. ప్రసన్న దృష్టితో నా వంక చూశాడు. అంతలో ప్రొద్దు కూకింది. జాబాలి ఆశ్రమ ప్రాంతంలో పశు, పక్షి, మృగాదులన్ని వాటి వాటి నెలవులలో విశ్రమించాయి.

## అధ్యయన వేదిక

**అర్థములు :**

శాల్మలీవృక్షము = బూరుగుచెట్టు; చెమరీమృగము = దుప్పి; శబరులు = బోయలు; కృతఘ్నులు = చేసిన మేలు మరచినవారు; పరివేష్టించి = చుట్టబడి; కుశాసనం = దర్భాసనం.

**సంధులు :**

**ఈ క్రిందివానిని విడదీసి, సంధి పేర్లను వ్రాసి, సూత్రములను వ్రాయుము.**

వింధ్యారణ్యము, మహర్షి, అగస్త్యాశ్రమము, ఒక్కొక్క, చరితార్థము.

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహవాక్యములు వ్రాసి, సమాసముల పేర్లను వ్రాయుము.**

అగస్త్యాశ్రమము, పుత్రప్రేమ, సముద్రఘోష, ముఖకవళికలు.

**అర్థ సందర్భములు :**

1. ధర్మానికి పుట్టినిల్లు అది.
2. నాపసిచెవులకు అది వింతగా వున్నది.
3. కొన్ని మరీ నిన్నా మొన్నా పుట్టిన నెత్తురుముద్దలు.
4. బ్రహ్మదేవునివలె వెలిగిపోతున్నాడాయన.
5. దీనులను కాపాడడం మనలాంటివారికి ధర్మము.

ప్రశ్నలు :

1. అగస్త్యమహాముని ఆశ్రమమును గూర్చి వ్రాయుము?
2. శాల్మలీవృక్షమును గూర్చి పేర్కొనుము?
3. చిలుక తన తండ్రి పరిస్థితి ఎట్టిదని తెల్పెను?
4. శబరులు ఏమిచేయుచుండిరి?
5. వృద్ధ శబరుడు గావించిన అకృత్యమును వ్రాయుము?
6. చిలుక ఎట్లు తప్పించుకొనెనో వ్రాయుము?
7. జాబాలిముని ఆశ్రమమును గూర్చి వివరింపుము?
8. హారితుడు చిలుకనెట్లు కాపాడెనో వ్రాయుము?

*విద్యార్థులకు సూచన :*

భూతదయను పెంపొందించుటకు ప్రయత్నింపుడు.

*ఉపాధ్యాయులకు సూచన :*

భూతదయతోకూడిన మరికొన్ని కథలను తెలుపుట సమంజసము.

# 6. సంస్కృతి - నిర్వచనము

*- ఖండవల్లి లక్ష్మీరంజనం*

*- బాలేందు శేఖరం*

***శ్రీయుతులు ఖండవల్లి లక్ష్మీరంజనంగారు 1908*** *సంవత్సరమున తూర్పు గోదావరిజిల్లాలోని* ***బెల్లంపూడిలో*** *జన్మించిరి. సీతమ్మ, సూర్యనారాయణశాస్త్రిగార్లు వీరి తల్లిదండ్రులు. బహుభాషాకోవిదులు. ఉస్మానియా విశ్వవిద్యాలయములో తెలుగు శాఖాధ్యక్షులుగా పనిచేసి తెలుగుభాషా సారస్వతములను వ్యాప్తిగావించిన మహనీయులు.*

*కళాశాలల్లో తెలుగు ద్వితీయభాషగా ప్రవేశపెట్టడమేగాక, విశ్వ విద్యాలయములలో తెలుగు పరిశోధనల కవకాశము కల్పించి ఆధునిక పరిశోధకులకు దోహదము గావించిన ప్రముఖ విద్యావేత్త.*

***ఆంధ్రసాహిత్యచరిత్ర సంగ్రహము, లంకాదహనం, ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి*** *మొదలగునవి వీరి రచనలలో ముఖ్యముగా పేర్కొనదగినవి.*

*'ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి' వీరి సోదరులైన బాలేందు శేఖరంగారితో కలసి రచించిరి. ఈ గ్రంథమునుండియే ప్రస్తుత పాఠ్యాంశమైన* ***'సంస్కృతి - నిర్వచనము'*** *గ్రహింపబడినది. ఇందు సంస్కృతి, నాగరకత, చరిత్ర, సంస్కృతి - చరిత్ర మున్నగున్నవి చక్కగా వివరింపబడియున్నవి.*

భారతదేశ చరిత్రవలెనే ఆంధ్రదేశ చరిత్రను ఆద్యంతముగా ఒక యాఖ్యానముగా వ్రాయదగునని 19వ శతాబ్దారంభమున గుర్తించి ఒక్క కలముతో

నిర్వహించిన మనీషి, చరిత్ర చతురానన చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు. నాటినుండి పలువురు పరిశోధకులు ఆంధ్ర చరిత్రలో అజ్ఞాతయుగములను, అవిదితాంశములను చక్కగా పరిశోధించి, చీకటికోణములనెన్నిటినో తేజోవంతములు చేసినారు. విఖ్యాత చారిత్రకులు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు ఆంధ్రదేశ చరిత్రను తమ రేడియో ప్రసంగములలో సాధికారముగ సింహావలోకనము చేసి, దేశోపకారము గావించిరి.

సంస్కృతియననేమి? ఒక జాతి అభివృద్ధిమార్గమున నడచిన రీతిని సంస్కృతి యనుచున్నారు. వ్యక్తి చేయునభివృద్ధి యత్నమును సంస్కారము అనవచ్చును. అతడు సంస్కారియనగా సంస్కారము కలవాడు. చక్కని మనోవికాసము కలవాడు అన్నమాట. పూర్వసంప్రదాయము ప్రకారము సంస్కారి అనగా ఆహితాగ్నిద్విజునకు చెప్పబడిన కర్మలను యథావిధిగ నిర్వహించు దీక్షాపరుడు అని పూర్వసంకేతము. ఇప్పటి పరిభాషలో సంస్కారి అనగా సంఘమందలి దురాచారములను సవరించుటకో, నిర్మూలించుటకో కృషిచేయువాడు. వీరేశలింగము పంతులుగారు సంఘసంస్కారి. సంస్కృతి, సంస్కృతము, సంస్కరణము, సంస్కారము మొదలగు పదములన్నియు ఒకే కుదుటబుట్టినవి. వీటన్నిటికి ఒకే యర్థము హీనదశ లేక ప్రాథమికదశనుండి ఉత్తమదశను చేరుటకై చేయు ప్రయత్న పరంపర. సంస్కృతభాషకు ఆపేరెట్లు వచ్చినదో అరయుడు. ప్రాకృతదశనుండి అనగా జన సామాన్య వ్యవహారపుటవస్థనుండి శిష్ట జన వ్యవహారముచేతను, వ్యాకరణాది నియమములచేతను శుద్ధమైన భాష సంస్కృతభాష. అట్లే జాతులు కాని, సంఘములు కాని భౌతికముగను, మానసి కముగను ఉచ్చదశ నొందుటకై చేయు నిరంతర యత్నమే వారి సంస్కృతియని చెప్పనగును.

సంస్కృతికి పర్యాయపదముగ కొందరు నాగరకత పదమును వాడుచున్నారు. నగరమునందు నివసించువారు నాగరికులు. వారి వేష భాషావైఖరులు నాగరకత యనబడును. పల్లెటూళ్ళలోనుండువారి కట్టు బొట్టులు, మాటతీరులు కొంచెము మోటుగను, అసంస్కృతములుగను ఉండునని లోకము తలంచును. అవి మోటుగ నుండుటకన్న కల్లకపటములు, చాటుమరుగులు లేనివై ప్రకృతికి మిక్కిలి దగ్గరగా నుండుననుట యుక్తము. పట్టణవాసులు తమ బాహ్యవేషమునందు ఎక్కువ సంస్కారము కలిగియుండుట, నేవళికము, మృదుసౌందర్యము కలిగియుండుట చూతుము. మనుష్యుల వెలి జీవితము పల్లెలందును, పట్టణములందును ఒకింత భిన్నముగా నున్నను, లోపలి జీవితమునందు మనుష్య ప్రకృతి యంతయు ఒకేరీతిగా

నడచును. సహజప్రకృతికి కోమలత్వము అను ముసుగువేయుటయే నాగరకత యనిపించును.

కొందరు విమర్శకులు సంస్కృతి - నాగరకత పదములమధ్య సూక్ష్మభేదమును పాటించుచున్నారు. సంస్కృతి మానవుని ఆత్మధర్మమనియు, నాగరకత దేహధర్మమనియు చెప్పుదురు. నాగరకతయనగా బాహ్యజీవితమనియు, సంస్కృతియనగా అంతరజీవితమనియు వారి మతము. ఒకటి వేషభాషలందును ఆచారవ్యవహారములందును, భౌతిక జీవితములందును చూడదగినది; మరియొకటి మనోవికాసమునందును, హృదయ వ్యాపారములందును, ఆధ్యాత్మికజీవితమందును చూడదగినది. ఉదాహరణకు : హైందవనాగరకతకును, పాశ్చాత్యనాగరకతకును భేదము గలదు. మనలో పురుషులు ధోవతియు, స్త్రీలు చీరలును ధరింతురు. పాశ్చాత్యులలో సూటులును, గౌనులును ప్రచారములో నున్నవి. మనవారు ముఖమున తిలకము పెట్టుకొందురు. వారు బొట్టు నెరుగరు. మనవారు పీటలపై కూర్చుండి విస్తరులలోనో, కలవారు వెండితళియలలోనో భుజింతురు. వారు ఎత్తుబల్లలపై నాసీనులై పింగాణిపాత్రములందు చెంచాలతోను, ముండ్లగరిటలతోను ఎత్తి తిందురు. భారతీయులకును, పాశ్చాత్యులకును బాహ్యాచారములందున్న భేదమిది. ఇవి యంత ప్రధానమైనవి కావు. దేశ భేదమునుబట్టియు ఆయా ప్రజలు ఆయా వేషములను ఆచారములను పాటింతురు. భారతీయులకును, పాశ్చాత్యులకును విస్తారమైన భేదము వారి మానసికరీతులందును, ఆధ్యాత్మికప్రవృత్తులందును చూడవలెను. భారతీయులు ఎక్కువగా హృదయవాదులు; పాశ్చాత్యులు బుద్ధిపరులు మనవారు కర్మబద్ధులు. దైవబలమునే బలముగా నెంచువారు. పాశ్చాత్యులు కర్మసిద్ధాంతము నొప్పుకొనరు. పునర్జన్మను వారంగీకరింపరు; వారు పురుషకారమునకే ప్రాధాన్యము నొసగుదురు. ఇట్లే భారతీయ కవిత్వము, కళలు, సమస్త మానసిక వ్యాపారములు, పాశ్చాత్యుల ధోరణికన్న భిన్నమార్గమున నడువవచ్చును. ఇట్లు బాహ్యజీవితమును నాగరకతయనియు, అంతరజీవితమును సంస్కృతియనియు వ్యవహరింపవలెనని కొందరభిప్రాయపడుచున్నారు.

విషయవివేచనము సులభమగుటకై యీ శబ్దముల నడుమ భేదము పాటించినను పాటించవచ్చును. కాని లోకులు ఇంతగా తలవెంట్రుక చీల్చినట్లు వ్యవహరించుట యరుదు. నాగరకత సంస్కృతిపదములను వారు యథేచ్ఛగా వాడుచున్నారు. శాస్త్రజ్ఞులైనను ఈ విభేదమును అసిధారగా నిర్వహించుటలేదు.

చరిత్ర వ్రాయవలెనను ఉద్దేశము ఈనాడు క్రొత్తగా పుట్టినది కాదు. భారతదేశములో కూడ అనాదినుండియు చరిత్రప్రాముఖ్యము గుర్తింపబడియే యున్నది. మన పురాణములకు ఐదంగములుండును. సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు, వంశానుచరితము అనునైదింటిలో వంశము, వంశానుచరితములను లక్షణద్వయము చరిత్ర బీజము కాకున్న మరేమి? ఇట్లు చరిత్రయుండగా సంస్కృతియను నీ క్రొత్త కల్పన యేమి? ఇది విశ్వామిత్ర సృష్టి కాదా యని కొందరడుగుదురు. దీనికి సమాధానము సంస్కృతి - చరిత్ర అభూతకల్పనము కాదు; చరిత్ర రచనా లక్ష్యముల విపులీకరణమే. చరిత్రకు బీజము సంస్కృతి. చరిత్ర వెన్నెముకయైనచో, సంస్కృతి - చరిత్ర నిండు దేహము. చరిత్ర చెట్టు బోదెయైనచో, సంస్కృతి - చరిత్ర దాని శాఖోపశాఖలు, పచ్చని యాకులు, పుష్పములు, ఫలములు నగును. ఇంకను సూక్ష్మముగ చెప్పవలెనన్నచో చరిత్ర రాజనాయకము; సంస్కృతి - చరిత్ర ప్రజానాయకము. చరిత్ర గ్రంథములలో రాజులు, రాణులు, నాయకులు, నాయికురాండ్రుగా నుండుచు వచ్చిరి. వారి జీవితము, వారి సూక్తులు, యుద్ధము, సంధులు, రాజతంత్రము, సుపరిపాలనము, ప్రజాపీడనము - ఇవన్నియు ప్రభువులను కేంద్రముగ నుంచుకొని బయలుదేరిన వ్యాసరేఖలు. సంస్కృతి - చరిత్రయందు ప్రజలు నాయకులగుదురు. ఈ రెండవ వృత్తమునకు ప్రజాజీవితమే కేంద్రము. ప్రజల సుఖదుఃఖములు, కష్ట నిష్ఠురములు, వారి నిత్యజీవితము, శాశ్వతజీవితము, ఐకమత్యము, అంతర్వైరములు, జీవితము, తిరోగమనము లేదా ఉన్న స్థితిలోనే యుండిపోవుట ఈ మొదలైన లెక్కకు మీరిన సమస్యలు సంస్కృతి - చరిత్రలో వ్యాసరేఖలు కాగలవు.

అయినచో వీనిలో చరిత్రోద్దేశము నేది చక్కగా పూరింపగలదు అన్న ప్రశ్న యుదయించును. అసలు చరిత్రరచనకును, చరిత్రపఠనమునకును లక్ష్యమేమి అని విచారింతుము. ప్రతి మానవునకు తన పూర్వులెట్టివారో, వారెట్టి ఘనకార్యములు గావించిరో తెలిసికొనుటకు కుతూహలముండుట సహజము. మానవునియభివృద్ధి చాలవరకును పరంపరగా వచ్చిన అనుభవములమీదను, జ్ఞానముమీదను ఆధారపడియున్నది. అనాదినుండియు, తండ్రినుండి కొడుకులకును వారసత్వముగా వచ్చుచున్న ఈ విజ్ఞానమును కాపాడుకొనుటకు అతనికి రెండు సాధనములను భగవంతుడిచ్చియున్నాడు. ఒకటి మనస్సు, రెండవది భాష. మనస్సుచే ఆలోచించి వివేచన చేసి జరిగిపోయిన అంశములను జ్ఞప్తియందుంచుకొని మానవుడు ముందుకు నడచుచు తాను తెలిసికొన్న విషయములను తన సంతతికి తెలియజెప్పి వారిని

వివేకవంతులను చేయును. జంతువులకును, పక్షులకును ఈ రెండు సాధనములును - మనస్సు, భాష లేకుండుటచే అవి తాము సంపాదించిన యనుభవ జ్ఞానమును తమ సంతతికి అందజేయజాలవు. కావున సృష్ట్యారంభమున ఇవి ఎట్లుండెనో నేడును ఇంచుమించు అట్లే యున్నవి. మానవుడట్లుగాక యుగయుగములనుండియు క్రమాభివృద్ధి నొందుచునే యున్నాడు. పరంపరాగత విజ్ఞానమే మానవ సంస్కృతికి మొదటి మెట్టు అని తెలిసికొనిననాడు చరిత్ర ప్రాముఖ్యము తెల్లమగుచున్నది.

మరియు మానవుడు తన జీవయాత్రయందు రెండు ప్రబలశక్తులతో పోరాడువలసినవాడగుచున్నాడు. ఇందొకటి ప్రకృతి, రెండవది మానవసంఘము. ఇతరజంతువులవలెనే మానవుడు కూడ ప్రకృతిలో నొక భాగమేయైనను అతడు కొంత స్వతంత్రించి ప్రకృతితో పోరాడి దానిని తనకు అనుకూలముగ మార్చుకొనుచున్నాడు. తిర్యక్కులు (పశుపక్ష్యాదులు) ప్రకృతికి లొంగియుండి జీవించును. దుర్బలమైన శీతలయుగమో లేక సహింపరాని వేడిమియో దాపురించినదనుకొనుడు; మానవుడు సకాలములో ఈ ప్రమాదములను గుర్తించి స్థలాంతరములకు పోవుటయో లేక ఉన్నచోటనే చలి - యెండలనుండి తన్ను కాపాడుకొనుటకు కావలసిన విధానమును అవలంబించుటయో చేయును. జంతువులు మొదలైనవి అట్లు చేయలేక మృతినొందుచుండును. ఆహారసంపాదనకు కూడ మానవుడు ప్రకృతితో పోరాడుచుండును. ప్రకృతియనుకూలముగనున్నచో దానికి దోహదము చేసి విశేషఫలమును సాధించుకొనును. ఇట్లు మానవుడు తన జీవికకై ప్రకృతితో చేయు సంగ్రామమంతయు శాస్త్రవిషయము. దీని వివరములచ్చటనే తెలిసికొనవలయును. అయినను ఈ రంగమునందాతడు సాధించిన విజయముల స్థూలచరిత్రము కూడ సంస్కృతి చరిత్రములో భాగమేయగుచున్నది. మానవుడు సాగించు రెండవరకము సంగ్రామము మానవసంఘముతోనని చెప్పి యుంటిమి. మానవుడు తనకు తాను శత్రువగుట వింతకాదా యనిపించును. వింతలలో వింతయైనను ఇది సత్యమే. దీనికెన్నియో కారణములను చూపించవచ్చును. మానవుని స్వార్థము, సుఖసంపాదనేచ్ఛ, అహమహమిక (నేను ముందు - నేను ముందు అను భావము) మొదలగునవి మానవుడు సోదర మానవునితో పోరాడుటకు హేతువులగుచున్నవి.

మానవుని ప్రతిభ ఇచ్చటనే కాంచనగును. అతడు పోరాడనుగలడు; అన్యోన్య సహకారము నెరపుకొని నాగరకతా శిఖరముల నధిరోహించను గలడు కూడ. ఇది

మానవచరిత్రయందలి మరియొక చమత్కారము. మానవసంఘములోని పోరాటము - మానవ సహకారభావము - ఈ రెండే ప్రధానముగ చరిత్రకు విషయములగుచున్నవి. ఈ సంగ్రామము, సహకారము సంబంధమైన అనుభవజ్ఞానమే చరిత్రవలన మనము నేర్చుకొందుము. ఇదియే చరిత్రరచనకును, చరిత్రపఠనమునకును ముఖ్యోద్దేశము. రాజులను, రాజువంశములనాధారములుగాజేసి, రచించిన చరిత్ర మానవసంఘములోని సంగ్రామమునే ప్రధానముగ వివరించినది. ప్రజలనే ఆధారముగ గ్రహించి వ్రాసెడు సంస్కృతి - చరిత్ర మానవసహకారమువైపు దృష్టిని మరల్చి మానవసంఘము నింతకన్న శాంతియుతముగను, సుఖవంతముగను చేయునని ఆశించవచ్చును.

"చరిత్ర ఉదాహరణబలమునే బోధించును." అను సూక్తి చరిత్రోద్దేశములను చక్కగా సూచించుచున్నది. మానవుడు పూర్వయుగములలోనెట్టి విధానము నవలంబించి ఎట్టి ఫలితములను పొందెనో తెలుపుట చరిత్ర పద్ధతి. ఈ యుదాహరణములను చేకొని మానవుడు తన భావి విధానమును సరిదిద్దుకొనుట మేలిమార్గము.

ఆంధ్రులు పూర్వయుగములలో నెట్టి నాగరకతను, జ్ఞానమును, రాజకీయౌన్నత్యమును సాధించిరో తెలిసికొని అంతకు మించిన నాగరికతను, విజ్ఞానమును, రాజకీయ ప్రాధాన్యమును సంపాదించు నుద్దేశముతో ఆంధ్రచరిత్రను చదువుట సక్రమపద్ధతి. ఆంధ్ర జాతి పూర్వయుగములలో పరాజయ పరాభవములకు గురి అయినచో అట్టి సన్నివేశములకు కారణముల నరసికొని ఆయా లోపములు తిరిగి తల యెత్తకుండ జాగ్రత్త పడుటయు ఆంధ్రచరిత్ర పఠనముయొక్క లక్ష్యము కాదగును. కొన్ని కొన్ని సందర్భములలో ఒక ప్రాచీనజాతి కారణాంతరములవలన హీనస్థితికి లోనై కీర్తి ప్రఖ్యాతులు లేకుండా పడియున్నప్పుడు అట్టి జాతి యందాత్మవిశ్వాసము, కార్యదీక్ష అభ్యుదయ కాంక్ష పెంపొందించుటకు ఆ జాతి చరిత్రను పఠించుట సంజీవని వంటిది కాగలదు. ఈ యుద్దేశముతో ఆంధ్రులు సత్యమైన ఆంధ్రచరిత్ర రచించుటకు పఠించుటకును దీక్షితులు కావలయును.

## అధ్యయన వేదిక

**అర్థములు :**

పరిభాష = వాడుకభాష; వివేచన = మంచి చెడుల పరిశీలన; సంగ్రామము = యుద్ధము; అసిధార = కత్తిమీదసాము.

**సంధులు :**

**ఈ క్రిందివానిని విడదీసి సంధి పేర్లను, సూత్రములను వ్రాయుము.**

అత్యంతము, వ్యవహారపుటవస్థ, చరిత్రోద్దేశము, బాహ్యాచారములు, శాఖోపశాఖలు , మనోవికాసము.

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహవాక్యములు వ్రాసి సమాసముల పేర్లను వ్రాయుము.**

ప్రాథమికదశ, కట్టుబొట్టులు, మృదుసౌందర్యము, శాశ్వతజీవితము, నాగరకతాశిఖరము, మాటతీరు, కష్టనిష్ఠురములు.

**అర్థ సందర్భములు :**

1. సహజప్రకృతికి కోమలత్వము అను ముసుగువేయుటయే నాగరకత యనిపించును.
2. భారతీయులు ఎక్కువగా హృదయవాదులు; పాశ్చాత్యులు బుద్ధిపరులు.
3. వింతలలో వింతయైనను ఇది సత్యమే.
4. పరం పరాగత విజ్ఞానమే మానవసంస్కృతికి మొదటి మెట్టు.
5. తిర్యక్కులు ప్రకృతికి లొంగియుండి జీవించును.

**ప్రశ్నలు :**

1. సంస్కృతియనగానేమో వివరింపుము?
2. సంస్కృతి - నాగరికతల భేదములు తెల్పుము?
3. చరిత్ర, సంస్కృతి చరిత్ర - వివరింపుము?
4. మానవుడు తన జీవయాత్రయందు రెండు ప్రబలశక్తులతో పోరాడవలసినవాడగుచున్నాడు - వివరింపుము?

***విద్యార్థులకు సూచన :***

ఆంధ్ర సంస్కృతికి సంబంధించిన చిత్రపటములు సేకరింపుము.

***ఉపాధ్యాయులకు సూచన :***

ఆంధ్రుల చరిత్ర, సంస్కృతికి సంబంధించిన వివిధ గ్రంథములలోని విషయములను వివరించుట యుక్తము.

# 7. మధుర కవితలు

## - వేటూరి ప్రభాకరశాస్త్రి

*శ్రీయుతులు **వేటూరి ప్రభాకరశాస్త్రిగారు** కృష్ణాజిల్లాలోని పెదకళ్ళేపల్లిలో **1988** సం॥న జన్మించిరి. శేషమ్మ, సుందరశాస్త్రిగార్లు వీరి తల్లిదండ్రులు. వీరు ప్రాచీన తాళపత్రగ్రంథాలు సేకరించి, పరిశీలించి, పరిశోధించి సిద్ధాంతవ్యాసములు వ్రాయువారికి ఆదర్శపురుషులయ్యారు.*

***కనకాభిషేకము, శృంగారశ్రీనాథము, ప్రబంధ రత్నావళి, చాటు పద్యమణిమంజరి, కర్ణభారము,** మొదలగునవి వీరు రచించిన రచనలలో పేర్కొనదగినవి. పండితులుగా, కవిగా, గ్రంథపరిష్కర్తగా, చారిత్రకులుగా బహుముఖ ప్రజ్ఞాశాలి.*

*వీరు రచించిన **'తెలుగు మెఱుగులు'** అను గ్రంథమునుండి **'మధురకవితలు'** అను నీ వ్యాసము గ్రహింపబడినది.*

ప్రాచీనాంధ్ర లక్షణకర్తలు తెలుగుకవిత్వమును ఆశు, మధుర, చిత్ర, విస్త రములను పేళ్ళఁ జతుర్విధముల విభజించిరి. యక్షగానాదులందులో మధుర కవిత్వమునఁజేరును.

మధురకవితలు ప్రాయికముగా భాష, భావము, ఛందము దేశిగా నుండుటచే సంగీతసంస్కారము గలిగిన సామాన్యజనుల నాలుకలమీద నాట్యమాడునవిగా నుండును, గాన తొలుతనవి యంతగా లిపికెక్కకపోయెను. సంస్కృతప్రాయ రచనలుగల చిత్ర, విస్తర కవితల ప్రాబల్యమునఁ గూడ వానికి సత్కవితలలోఁ బరిగణనమంతగా లేకపోయెను. ఇటీవల కవులుగాఁ బురాణ ప్రబంధ రచయితలే పరిగణింపబడుచుండిరిగాని మధురకవితా రచయితలు లెక్కకున్నారు. ఆంధ్ర వాఙ్మయవృక్షమున ముఖ్యమయిన మధురకవితాశాఖ యిందాక సుపరీశీలనము లేకయే యున్నది. ఇక్కడ నాకిప్పుడు దేశినాటకములనదగిన యక్షగాన రచనముల ప్రశంసయే ప్రసక్తమగుటచే వాని పుట్టుపూర్వోత్తరములఁగూర్చి మాత్రమే నాకు గోచరించిన విషయములఁగొన్నింటిని వివరింతును.

యక్షగానములన్న పేరుగల దృశ్యరచనములు నన్నయాదుల కాలమున నున్నవనుటకుఁ బ్రబలాధారములు గానరావు. కాని యానాడేవో కొన్ని దేశి దృశ్యరచనములున్నవని మాత్రము గుర్తింపనగును. నన్నయ కిన్నూటేండ్లకుఁ దర్వాతనున్న పాల్కురికి సోమనాధునికి ద్విపదలందు, నేఁటి వీధినాటకములు, దొమ్మరాటలు, తోలుబొమ్మలాటలు మొదలగునవి పేర్కొనఁబడినవి. ఇట్టి సంప్రదాయములు వీనిఁబేర్కొన్న సోమనాధుని కిన్నూటేండ్ల పూర్వకాలమునఁగూడ నుండుట సంభావ్యమే. తెలుగునకు సాటి భాషలగు ద్రవిడ కర్ణాటభాషల పద్ధతులను బట్టియుఁ దెలుగులో నిప్పుడుపలభ్యమానములగుచున్న కొన్ని ప్రాచీన దృశ్యరచనముల తీరులనుబట్టియు, ద్రావిడభాషా సామాన్యముగాఁదొలుత వెలసిన నాటకరచనల స్వరూపము కొంత గుర్తింపవచ్చును.

తొలుత ద్రావిడభాషలలో వెలసిన దృశ్యరచనములు కురవంజులనబడునవి. ఆంధ్ర కర్ణాట ద్రవిడ దేశముల యరణ్యములలో వసించు నాటవికులు, చెంచులు, కురవలు (క్రోవ, కోయ) అనువారు. అందుఁ గురవజాతివారి యంజె = అడుగు (నృత్యవిశేషము) కురవంజె యనఁబడెను. చిందు, గంతు, గొండ్లి, అంజె, అంగ - ఇత్యాదులు నృత్యవిశేషములు. ఆంధ్రదేశమున బహుకాలమునుండి శివక్షేత్రములగు శ్రీశైలము, ఇంద్రకీలనగము (బెజవాడ కొండ) మొదలగు పర్వతములమీఁదను నృసింహక్షేత్రములగు వేదాద్రులు పెక్కులున్నవి. మంగళాద్రి, సింహాద్రి, గరుడాద్రి, మాల్యాద్రి, వెంకటాద్రి మొదలగు పర్వతములమీఁదను వర్షోత్సవములు (యాత్రలు, జాత్రలు, జాతరలు) జరుగునప్పుడక్కడికి నాగరక ప్రజలు చేరుచుండుదురు. వారి వినోదమునకై యాటవికులు రాత్రులందు నృత్యవిశేషములు నెఱపి ధనార్జనము చేయుచుండువారు. అక్కడక్కడ కొరవజాతులవారు చేయు నృత్యములు కొరవంజులనఁబడెను. కొరవంజె యన్నపేరు తొలుత వారి నృత్యమునకును, బిదప నృత్యవిశిష్టమయిన వారి చిన్ని చిన్ని గేయరచనలకును, నాపై కురవజాతివారికినిగూడఁ బేరైనది. కురవజాతివారు తొలుత చేయు నృత్యవిశేషము కాలక్రమమున నాయా పర్వతప్రదేశముల స్థల మహాత్మ్య కథలతోను, శివవిష్ణులీలా కథలతోను మిళితములయి గేయవిశిష్టనాట్యరూపములతోను బడసెను. అపుడు మాయాకిరాతవేషులగు పార్వతీశివుల కథలతోనున్న కిరాతార్జునీయము, నృసింహస్వామి చెంచీతను బెండ్లాడు స్థల మాహాత్మ్య కథలు (చెంచీతకథలు) తొలుత నత్యల్పముగా గేయభాగములును విశేషముగా నృత్యములు గలవై యుండెను. అవి సింగి, సింగడు - అని యిద్దరు పాత్రములు గలవై సంస్కృత వీధినాటకములఁ బోలియున్నవి. సింగి, సింగడు

సంస్కృతనాటకములలోని నటీనటులవలె నాలువుగం(డు, వీరిద్దఱే కథాపాత్రములగుచుందురు. కొన్నింటిగథా సంధాయకుఁడు - సంధివచనములఁ జెప్పువాడు - విదూషకుడనఁదగినవాడు - మూడవపాత్రము - కోణంగియనువాడు - (పిదప చోడిగాడు) కాననగును. కోణంగి సంస్కృతనాటకములలోని విదూషకస్థానీయుఁడగుట స్పష్టముగాఁగానవచ్చును. సంస్కృతనాటకములలోని ధ్రువాగానమే కురవంజులలో దరువనబడెను. ఎంతో కాలమిట్లు కొండపట్టులందు సాగుచుఁ బెంపొందిన గేయ నృత్యసందర్భములు నగరములకుఁగూడఁ గ్రమముగా వ్యాపించినవి. చెంచులు, కురవలు, నడవులనుండి పులిగోళ్ళు, అడవి కోళులు, అడవిపండ్లు, వెదురుబియ్యము, వెదురుబెత్తములు, పిల్లనగ్రోవులు, సూదంటురాళ్ళు, ఓషధులు, తేనె మొదలగు నాటవికవస్తువులను నగరములకుఁగొనివచ్చి యమ్ముచు నప్పుడప్పుడు తమ గేయ నృత్యవిశేషములను నగరములందును పల్లెలందును బ్రయోగించుటచే నవి నాగరకదేశములందును వ్యాపించెను.

ఇట్లు నగరములందు నభిరుచి గొల్పిన యాగేయ విశిష్ట నృత్య దృశ్యములు, జక్కులవారు (యక్షులు, కళావంతులు) తర్వాత నగరములందును బ్రయోగింపఁ జొచ్చిరి. వీరి ప్రయోగములందు దృశ్యమయిన నృత్యాభినయములతోపాటుగా నధికముగా గేయ వచనరూపమైన శ్రవ్యరచనము గూడా జేరెను. కురవంజులకంటె యక్షగానములు పర్యాప్తముగా శ్రవ్యములగు కవిరచనములు గలవి. వీరి రచనములలో బహువిధములగు పురాణకథ లెల్లఁజేరినవి. కురవంజులలోని సింగి, సింగఁడు పాత్రలు మాఱి రామ, నల, హరిశ్చంద్ర, సీతా, దమయంతీ చంద్రమత్యాదిపాత్రలు వచ్చినవి. కాని వీనిలో నాటవిక రచనా సంస్కార సూచకముగా, 'ఎఱుకతసాని' పాత్రము వెలసినది. కురవంజులలోని దేశి రచనలకంటె నత్యధికముగా వీనిలో దేశిచ్ఛందో బద్ధములగు గేయరచనలు ప్రబలినవి. రాజసభలలో, దేవోత్సవములలో, ఊరి జాత్రలలో యక్షగంధర్వాది వేషముల ధరించి ప్రదర్శించునవి గావునను, నృత్యధర్మములకంటె గేయధర్మము లధికముగాఁ గలవి కావునను నివి యక్షగానములనఁబడెను

యక్షగానములిట్లు వెలసినను ప్రాచీనములయిన కురవంజి రచనములును యక్షగాన రచనావిధానసంకలితములై ఈ కాలమునఁగూడఁ గొన్ని సాఁగుచునే వచ్చినవి. దేవోత్సవ రాజాస్థానాదులందిట్లు బ్రదర్శింపబడుచున్న యక్షగానములు పెంపొందుచుండు నీకాలమున, దక్షిణదేశమున విజయనగరరాజ్యమున కుపశాఖలుగా తంజావూరు మధురరాజ్యము లాంధ్రనాయకరాజుల పరిపాలనమున వెలసినవి.

ఆంధ్రదేశమునందును, దక్షిణదేశమునందును నీకాలమున యక్షగానరచనము మిక్కిలి ప్రబలఁజొచ్చెను. కృష్ణాతీరమునందలి కూచిపూడి గ్రామమున సిద్ధేంద్రుడను యోగి యొకఁడు భాగవత కథలను పారిజాతము, గొల్లకలాపము మొదలగు పేర్లతో యక్షగానములుగా రచియించి ప్రదర్శనము చేయింప నేర్పాటు చేసెను. నేడు కూడ కూచిపూడి బ్రాహ్మణులు శాస్త్రీయమయిన భరతనాట్యములో భాగవత కథలను బ్రదర్శించువారుగా నున్నారు. ఈ సంప్రదాయము వెలసిన పిదపనే తత్ ప్రదర్శకులకు భాగవతులనియు, తద్రచనములకు ఆట భాగవతములనియు బేరయ్యెను.

ఈ భాగవత కథలలో పారిజాతాపహరణ కథ హృద్యతరమగుటచే దానికి బ్రచారమెక్కువయ్యెను. అది హృద్యతరమగుట కందలి సవతుల కయ్యపుఁబట్టు ప్రధాన కారణము. దీనినిఁబట్టి యక్షగాన సామాన్యమునకుఁ బారిజాతములనియుఁ బేరయ్యెను. ఏ యక్షగానముఁ బ్రదర్శించినను నందు సవతుల కయ్యపుఁ బట్టునకుఁ బ్రసక్తిగల్పించుటయో లేక పారిజాతము నందలి తత్కథాఖండమునే స్వతంత్ర్యముగాఁ బ్రదర్శించుటయో పిదప నేర్పడెను. ఆంధ్రదేశమున వెలసిన యీ కూచిపూడి భాగవతముల ప్రయోగ వైశారద్యము దక్షిణదేశమునకుఁగూడ వ్యాపించినది. ఆనాడు కూచిపూడి భాగవతుల యాటభాగవత సంప్రదాయము నేటికిని దక్షిణదేశమునఁ గలదు.

## అధ్యయన వేదిక

**అర్థములు :**

ప్రాయికముగా = సాధారణముగా; గోచరించిన = కనబడిన; ప్రబలాధారములు = బలమైన ఆధారములు; పర్యాప్తము = యథేష్టము; సంకలితములైన = కూడినవైన

**సంధులు :**

**ఈ క్రిందివానిని విడదీసి సంధి పేర్లను, సూత్రములను వ్రాయుము.**

పూర్వోత్తరములు, ఇన్నూటేండ్లు, వేదాద్రి, కిరాతార్జునీయము, అత్యల్పము, నృత్యాభినయము, అత్యధికము, దేవోత్సవము, సిద్ధేంద్రుడు.

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహవాక్యములు వ్రాసి, సమాసముల పేర్లను వ్రాయుము.**

చతుర్విధములు, ఇంద్రకీలనగము, రాజసభ, నృత్యధర్మము, కృష్ణాతీరము, ప్రధానకారణము, ఆంధ్రవాఙ్మయవృక్షము.

**అర్థ సందర్భములు :**

1. సామాన్యజనుల నాలుకలమీద నాట్యమాడునవిగా నుండును.
2. యక్షగాన సామాన్యమునకుఁ బారిజాతములనియుఁ బేరయ్యెను.
3. సవతుల కయ్యపుబట్టు ప్రధానకారణము.
4. తద్రచనములకు ఆట భాగవతములనియు బేరయ్యెను.

**ప్రశ్నలు :**

1. దేశిరచనల గూర్చి వ్రాయుము.
2. కురవంజి దృశ్యరచనలగూర్చి వివరింపుము.
3. యక్షగానములను గూర్చి తెల్పుము.
4. ఆట భాగవతములగానేమో పేర్కొనుము.

***విద్యార్థులకు సూచన :***

యక్షగానము, కొరవంజి, తోలుబొమ్మలాటలు మొదలగు ప్రదర్శనములను తిలకింపుడు.

***ఉపాధ్యాయులకు సూచన :***

తోలుబొమ్మలాటలు, యక్షగానములు మొదలగు జానపదకళలను గూర్చి విద్యార్థులకు తెలియజేయుట యుక్తము.

# 8. సామెతలు

**- యస్. రాఘవాచారి**

*శ్రీ శంఖవరం రాఘవాచార్యులుగారు 1917 సం॥ కర్నూలుజిల్లాలోని **ఆవుకు గ్రామంలో** జన్మించిరి. సంస్కృత, తమిళ, కన్నడ, ఆంధ్రభాషలయందు నిష్ణాతులు. గేయము, పద్యము, కథలు, నవలలు మొదలగు ప్రక్రియలయందు మిక్కిలి నైపుణ్యము జూపిన పండితులు. **అప్పాజీ, విశ్వకవి, వాల్మీకి, కైలాసగంగ** మొదలగు ఖండికలు వీరి రచనలయందు పేర్కొనదగినవి. వీరి శైలి మిక్కిలి సరళముగా పఠితుల హృదయముల నాకర్షించునట్లుండును.*

*వీరు, విశ్వనాథ సత్యనారాయణగారు కలిసి సంకలనం చేసిన **"తెలుగు సామెతలు"** అను గ్రంథమును ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ప్రచురించిరి. అందు రాఘవాచారిగారు రచించిన మున్నుడి నుండి ఈ పాఠ్యభాగము స్వీకరింపబడినది.*

సామెతలు జనవ్యవహారములో వినవచ్చు. మణిపూసవంటి వాక్యములు వ్యక్తి జీవితంలోను, సంఘజీవితములోను అనుభవముచేత గోచరములగు సత్యములు వీనియందు మూర్తీభవించి యుండును. అన్నమునకు వ్యంజనమువలె సామెతలను ప్రసంగాను ప్రసక్తముగా జనులు వాడుకొందురు. వానివలన చెప్పదలచిన విషయము అసందిగ్ధముగను, అవిస్తరముగను చెప్పుట జరుగును. చమత్కారముగూడ సిద్ధించును. విషయము మనస్సులో హత్తుకుపోవును.

సామ్యమను అర్థములోనే సామెత అను పదము వ్యవహరింపబడుచున్నట్లు కొందరి పెద్దల అభిప్రాయము. నాకు తెలిసినంతవరకు సామెత అను పదము 15వ శతాబ్దములోని వరాహపురాణములో తొలిసారిగా ప్రయోగింపబడినది. సామ్యశబ్దమునకే సామ్యత అను అసాధురూపము ఏర్పడి యుండవచ్చుననియు

అదియే సామెతగా తెలుగులో మారి ప్రచారములో నున్నదనియు కీ.శే. డాక్టరు. కళాప్రపూర్ణ చిలుకూరి నారాయణరావుగారి వాదము. సామెత అను రూపము వ్యవహారములో వినబడుటచేతను కన్నడములో 'సామితె' అను పదముండుటచేతను ఈవాదములో కొంత సత్యముండవచ్చునేమో. అయినను ఈ శబ్దవ్యుత్పత్తి యింకను విచార్యమే.

సామెతల పుట్టుపూర్వోత్తరములను గూర్చి తేల్చుటగూడ సులభమగు పనికాదు. ఏ సామెత ఏ సందర్భమున ఎవరు రూపొందించిరో చెప్పుట సాహససాధ్యమైనచో కావచ్చునుగాని సత్యసమ్మతమగుట కష్టము. సామెతలు అనేకవిధములుగా పుట్టవచ్చును. కొన్ని సూక్తులుగా, కొన్ని దృష్టాంతములుగా, కొన్ని సాదృశ్యములుగా, కొన్ని నిదర్శనములుగా, కొన్ని అర్థాంతర న్యాసములుగా, కొన్ని ఏ గాథనో ఏ జానపదగేయమునో ఏ సన్నివేశమునో పురస్కరించుకొని పుట్టిన జనశ్రుతులుగా వాడుకలో నలిగియుండును. సామెతలు లౌకికములైనవి.

అన్ని సూక్తులు, సుభాషితములు నిత్యవ్యవహారములో తరచుగా వాడుటచే సామెతలుగా చెల్లిపోవుచున్నవి. "ఆత్రగానికి బుద్ధి మట్టు" "నిజము నిలకలడమీదగాని తెలియదు" "అంత్యనిష్ఠురముకన్న ఆదినిష్ఠురము మేలు" "ఆడి తప్పరాదు... పలికి బొంకరాదు" వంటి సూక్తులలో అలంకార రమ్యతగాని, వ్యంగ్యవైభవముగాని కనుపించదు. వాక్యము కేవలము వాచ్యముగను, ప్రభుసమ్మితముగను నుండును. అనుభవసిద్ధములైన సత్యములను సూటిగా, అలంకారరహితముగా నివేదించును. వాడుకలో పదేపదే వినబడుటచేతను, తాము చెప్పు మాటలకును చేయుపనులకును బలము చేకూర్చుటకు వ్యవహారములో జనులు వానిని ప్రయోగించుటచేతను నివిగూడ సామెతలవలె భాసించును.

సామెతలు సాధారణముగా జనసామాన్యమునుండి పుట్టుకొని వచ్చును. వారి అనుభవములు, అభిరుచులు వానిలో ప్రతిబింబించుచుండును. ఎక్కడనో కొన్ని పండితవర్గములో పుట్టి పెరిగినవి జనసామాన్యములోనికి రావచ్చును. "యత్రధూమః తత్రవహ్నిః" వంటిది "నిప్పులేనిదే పొగరాదు" అను సామెతగా మారి జనసామాన్యములో నిలిచియుండవచ్చును. "గతజలసేతుబంధనం" అను లోకోక్తి "పోయిన నీళ్ళకు కట్ట పెట్టినట్లు" అను సామెతగా మారి యుండును. సామాన్య కుటుంబ జీవితములోని చిన్న చిన్న సన్నివేశములనుండి పుట్టి సామెతలు రూపురేఖలు ఏర్పరచుకొనును. "అన్నీ వున్న విస్తరి అణగే వుంటుంది... ఏమీలేని విస్తరి ఎగిరెగిరి

పడుతుంది'' ''గుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించిందట'' ''తినబోతూ కూరల రుచి అడగడమెందుకు? ''ఎంచబోతే మంచమంతా కంతలే'' ''ఇంటికి ఈలకత్తి పొరుగుకు బంగారు కత్తి'' ''దీపముండగా యిల్లు చక్కబెట్టుకోవలెను'' వంటివి సామాన్యకుటుంబజీవితమునుండి పుట్టినవే.

మన దేశము ప్రధానముగా వ్యవసాయముతో కూడిన దేశము. పల్లెపట్టులు ఎక్కువగా వున్న దేశము. కర్షకజీవితమునకు సంబంధించిన సామెతలు, లోకోక్తులు, పాడిపంటలు, పల్లెటూళ్ళ బ్రతుకుతెరువు. పంటలు, పశువులు, పొలములు మొదలయినవి రైతుల జీవితములో భాగములై సామెతలకు గావలసిన పంటభూములగుచున్నవి. ''కోటివిద్యలు కొంబ్రకు లోకువ'' ''చేనుచేసి చెడలేదు.... చెడ్డచేసి బ్రతుకలేరు...'' ''రైతు దున్నితే రాజులకు అన్నం'' ''చెఱువు ఓడు, ఊరు పాడు'' వంటి సామెతలు పాడిపంటలనిన తమ పంచప్రాణములుగా చూచుకొను ప్రజలు సగర్వముగా కల్పించినవని వేరుగా చెప్పనక్కరలేదు.

''నెమలికంటినీరు వేటకానికి ముద్దా'' ''పందిని పొడిచినవాడే బంటు'' ''మాటలు నేర్చిన కుక్కను వేటకు పంపితే వుసుకో అంటే వుసుకో అందట'' ''గురికాడు నక్కను కొడతాడా?'' ''తాటాకు చప్పుళ్ళకు కుందేళ్ళు బెదురునా!'' వంటివి వేటకు సంబంధించిన సామెతలు ప్రచారములో నున్నవి. ఇంగ్లీషులో వేటకు సంబంధించిన సామెతలు ఎక్కువగా నున్నవి. ఆ జాతి మృగయాశీలమైనది. మనది కాదు. మనలో ఏ రాజులకో అది చెల్లుచుండెను. సామాన్యనకైనచో వ్యసనమగును. తెలుగుజాతి భూమిని దున్నుకొని బ్రతికిన జాతి. వ్యవసాయమే బ్రతుకుతెరువుగానున్న జాతి. కనుకనే పాశ్చాత్యులలోవలె తెలుగువారిలో వేటకు సంబంధించిన సామెతలు ఎక్కువగా లేవు.

జాలరులు గూడ కొన్ని సామెతలు కల్పించినారు. ''పట్టుకొన్నవాడు మట్టిగిడస అంటే పైనున్నవాడు జెల్లకొంక'' అన్నాడట, ''దరిద్రుడేరేవుకెళ్ళినా ముళ్ళపరిగే దొరికిందట,'' ''వలకంటే ముందు రాళ్లు విసిరినట్లు'' ''ఎఱ్ఱనువేసి చేపను పట్టినట్లు'' వంటివి. నావికులకు సంబంధించి సామెతలు ఎక్కువగా లేవు. అయినను ''ముత్యపుచిప్పలన్నీ ఒక రేవున నత్తగుల్లలన్నీ ఒక రేవున'' ''డబ్బివ్వనివాడు పడవ ముందెక్కును'' ''ఒడ్డు చేరేదాకా ఓడుమల్లయ్య... ఒడ్డుచేరాక బోడిమల్లయ్య'' ''కళాసుపని గాలివానతోసరి'' వంటి సామెతలు ప్రచారములో గలవు.

వాణిజ్యమునకు సంబంధించి సామెతలు కొన్ని యుండినను ఎక్కువగా లేవనియే చెప్పవలెను. వ్యాపారులు సామెతలు ఎక్కువగా సృష్టించలేదేమో! మచ్చుకు (అప్పు) "అడిగితే చిరాకు... అడక్కపోతే పరాకు" "అసలుకంటె వడ్డీ ముద్దువంటిది" వంటివి వడ్డీవ్యాపారమునకు చెందినవి. "అసిమిలోదొకటి... అమ్మేదొకటి" "కొన్నంగడిలోనే మారుబేరమా" "కొన్నది వంకాయలు కొసరింది గుమ్మడికాయలు" "కొనగా రానిది కొసరగా వచ్చునా?" మొదలగునవి వాణిజ్యమునకు సంబంధించిన సామెతలని చెప్పవచ్చును.

పాత సామెతలను మాతృకలుగా చేసికొని కొత్త సామెతలను కల్పించుటయేగాక సంప్రదాయములనుండియు, కథలనుండియు, గాథలనుండియు కొన్ని సామెతలు నిర్మింపబడుటయు గలదు. ప్రాయికముగా సామెతలను కల్పించుటకు కొన్ని గాథలు అనుకూలించును. పంచతంత్ర కథలు, కథాసరిత్సాగరము, ఈసఫ్ కథలు సామెతలకు మంచి పంటభూములు.

అందని ద్రాక్షపళ్ళు పుల్లన" "రెంటికీ చెడ్డరేవడు" "మంచి చేసిన ముంగికి మరణం వచ్చినట్లు" "కోడీకుంపటీ లేనిది తెల్లవారదా?" "నక్కజిత్తులన్నీ నావద్ద ఉండగా తప్పించుకుపోయెనే తాబేటి బుర్ర" "పిట్ట పోరు పిట్ట పోరు పిల్లి తీర్చినది" "తనకు మాలినధర్మం మొదలు చెడ్డబేరం" "దొంగదాడికన్న లింగదాడి ఎక్కువ" వంటి సామెతలు ఆయాగాథలనాధారముగా చేసికొని పుట్టిన సామెతలే. భారత రామాయణాదులు గూడ చక్కని సామెతలకు కారణములయినవి. "ఆవుల మళ్ళించినవాడే అర్జునుడు" "కర్ణునిమీదే కథంతా నిలిచింది" "రామునివంటి రాజుంటే హనుమంతునివంటి బంటూ వుండును" "హనుమంతుని ముందు కుప్పిగంతులా" వంటి మరికొన్ని చూపవచ్చును.

కథలను, గాథలను పురస్కరించుకొని సామెతలు పుట్టినట్లే సామెతలను ఆధారముగా చేసికొని కథలు, గాథలు పుట్టుటయు గలదు. ఇటీవలి సినిమా కథలు కొన్ని సామెతలను ఆధారముగా చేసికొని వెలసినవే. జానపదగేయములనుండిగూడ సామెతలు వ్యవహారములోనికి వచ్చుచుండును. "అత్తలేని కోడలుత్తమురాలు.... కోడలు లేని అత్త గుణవంతురాలు" అను సామెత జానపదగేయమునుండి వచ్చినదే. "దాసుని తప్పు దండముతో సరి" అను సామెత రామదాసు చరిత్రనుండి వచ్చి యుండును.

ఏ సామెతనైనను ఎప్పుడో ఒకసారి, ఎవరో ఒకరు కల్పించి యుందురు. ఏవో కొన్ని కారణాలచేత అది ప్రజల మనస్సు నాకర్షించి యుండును. ఆనోట ఆనోట దొరలి ప్రచారమునకు వచ్చి యుండును. పదిమంది నడచినది బాటయైనట్లే పదిమంది పలికినది 'మాట' యగుచున్నది. ప్రారంభమున కర్త ఎవరనునది తెలిసియున్నను కాలక్రమమున అది విస్మరింపబడును. కొన్ని సామెతలను పరిశీలించినచో ఎవరు కల్పించిరో చెప్పుట సాధ్యము గావచ్చును. "గతకాలము మేలు, వచ్చు కాలము కంటెన్" అనునది నన్నయభిక్షయని నిస్సందేహముగా చెప్పవచ్చును. ఇంత కచ్చితముగా నితర లోకోక్తుల విషయమున చెప్పలేము. నన్నయ తన కావ్యమున వాడిన మొదటి సామెత "వాలుపయి నడుచునట్లు"... ఇది భావములో కాకపోయినను భాషలో క్రమక్రమముగా మార్పు చెందినది.

తిక్కన తన కావ్యములలో లోకోక్తులను, సామెతలను ఎక్కువగా వాడెను. "ఏయువాడుండ అమ్మేమిసేయు" ననునది తిక్కన కాలములో ప్రచారములోనుండి యుండవలెను. ఈ సామెత తమిళమున నేటికిని వున్నది.

''ఏగిరవన్ ఏయిత్తాల్ అంబు ఎన్నసెయ్యుం?'' ''తిండిపోతు నీకు భండనమేమిటికి'' అను తిక్కన వాక్యము క్రమముగా ''తిండిపోతుకు భండనమెందుకు?" అన్న లోకోక్తిగా మారియుండును. తెలుగుసాహిత్యమున వేమనకవి "సామెతల పుట్ట'' యని యిదివరకే చెప్పియుంటిమి. "తలలు బోడులైన తలపులు బోడులా?'' పుట్టమీద కొట్ట భుజగంబు చచ్చునా'' ''కనిగ్రుడ్డి వినిచెవుడు వంటి చక్కని లోకోక్తులు వేమన స్వకల్పితములని చెప్పుట సాహసము కాదేమో!

సంస్కృతమునుండి పూర్వము ఎన్నియో సామెతలు తెలుగులోనికి అనువదింపబడినవి. "వినాశకాలే విపరీతబుద్ధిః'' అనునది వేమన రచనలలో "చేటు కాలానికి చెడుబుద్ధి'' గా మారి మూలములోని గౌరవమును తెచ్చుకొన్నది. ఇట్లే సంస్కృతమునుండి వందలకొలది సామెతలు, లోకోక్తులు వచ్చి తెలుగువ్యవహారములో చితించిపోయినవి.

## అధ్యయన వేదిక

**అర్థములు :**

వ్యంజనము = కూర; వ్యుత్పత్తి = పుట్టుక; బొంకు = అబద్ధము; ధూమః = పొగ; వహ్ని = అగ్ని; కొండ్ర = మళ్లించి దున్నిన చాలు; మృగయ = వేట; పాశ్చాత్యులు

= విదేశీయులు; దండము = శిక్ష; భుజగము = పాము

**సంధులు :**

**ఈ క్రిందివానిని విడదీసి సంధి పేర్లను, సూత్రములను వ్రాయుము.**

ముత్యపుచిప్ప, గుణవంతురాలు, లోకోక్తి.

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహవాక్యములు వ్రాసి సమాసముల పేర్లను వ్రాయుము.**

రూపురేఖలు, నక్కజిత్తులు, దాసుని తప్పు, రామదాసు చరిత్ర.

**అర్థ సందర్భములు :**

1. నిప్పులేనిదే పొగరాదు.
2. కోటివిద్యలు కొంగ్రకు లోకువ.
3. కొనగా రానిది కొసరగా వచ్చునా!
4. వాలుపయి నడుచునట్లు
5. వినాశకాలే విపరీతబుద్ధిః

**ప్రశ్నలు :**

1. సామెతల పుట్టుపూర్వోత్తరములను వివరించుము?
2. పండితవర్గములో పుట్టిన సామెతలు ఎట్టివి?
3. కర్షకజీవితమునకు సంబంధించిన సామెతలు తెలుపుము?
4. వేటకు సంబంధించిన సామెతలు పేర్కొనుము?
5. జాలరులు, నావికులు, వర్తకులకు సంబంధించిన సామెతలు కొన్నింటిని పేర్కొనుము?
6. సామెతలనుండి పుట్టిన కథలు, గాథలు తెల్పుము?
7. సంస్కృతమునుండి పుట్టిన అనువాద సామెతలు ఎట్టివి?

***విద్యార్థులకు సూచన :***

చక్కటి సామెతలను సేకరించుటకు ప్రయత్నింపుడు.

***ఉపాధ్యాయులకు సూచన :***

సామెతలను ఏయే సందర్భములలో వాడుదురో తెలియజేయుట యుక్తము.

# 9. కంచెర్ల గోపన్న (భద్రాచల రామదాసు)

***- బాలాంత్రపు రజనీకాంతరావు***

***శ్రీయుతులు బాలాంత్రపు రజనీకాంతరావుగారు 1920 సం॥న నిడుదవోలులో*** *జన్మించిరి. శ్రీ వేంకటపార్వతీశకవులలో నొకరైన శ్రీ వేంకటరావుగారి కుమారులు. నాటికలు, గేయాలు, ప్రబోధగీతాలు, బాలసాహిత్యము మొదలగు ప్రక్రియలలో వీరు చూపిన నేర్పు అసామాన్యమైనది.* ***చండీదాసు, శతపత్రసుందరి, విశ్వవీణ, ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము, కడలినుండి కొండదాక, మూలస్తంభాలు*** *మున్నగునవి వీరి రచనలలో పేర్కొనదగినవి.*

*వీరు రచించిన 'కడలినుండి కొండదాక' అనే రూపకం జపాన్ రేడియో నిర్వహించిన పోటీలో బహుమతి పొంది, తెలుగురూపకానికి అంతర్జాతీయఖ్యాతిని సంపాదించిపెట్టినది.*

*ప్రస్తుత పాఠ్యభాగము వీరు రచించిన* ***'ఆంధ్రవాగ్గేయకారచరిత్రము'*** *నుండి గ్రహింపబడినది. ఇందు కంచెర్ల గోపన్న జీవితము మిక్కిలి సరళముగా రచింపబడియున్నది.*

శ్రీరామనవమి నవరాత్రములలో రామదాసు భజనకీర్తనలను గానం చెయ్యని భజనకూటంగాని, భజనకూటం లేని రామమందిరంగాని, రామమందిరం లేని గ్రామంగాని నగరంకాని ఆంధ్రదేశంలో కనబడదు. రామదాసు కీర్తనలను భజనలు చేసుకొంటూ యాత్రికులు దేశం నలుమూలలనుంచీ గుంపులు గుంపులుగా భద్రాచలం వెళ్ళి ఈ తిరునాళ్ళ సమయంలో భద్రాచలరాముని, ఆ రామునికి అత్యంత ప్రియభక్తుడై కైంకర్యాలు చేసి రామదాసు బంధిఖానాలో బాధలుపడిన స్థలాలనూ దర్శించి తమ జన్మలను ధన్యం చేసుకొంటారు. భద్రాచలరామదాసని పేరు పొంది, నాటినుంచి నేటివరకు ఆంధ్రదేశంలో ఆ బాలగోపాలానికే కాక, యించుమించు భారతదేశమంతటా పరమ భక్తాగ్రేసరులలో ఒకడుగా గణ్యత కెక్కిన వాగ్గేయకారుని అసలుపేరు కంచెర్ల గోపన్న.

ఇతడు క్రీ.శ. 1620 - 1680 నడిమికాలంలో గోలకొండ రాజ్యంలో అబ్దుల్లా తానాషా, అబుల్‌హాసన్ తానాషాలు పరిపాలించినపుడు జీవించాడు. అంతేకాక మహాభక్తుడూ, భజనకీర్తనల రచయితా, వేదాంతి అయిన కబీరుదాసుకితడు శిష్యుడట. అంటే యితడు నారాయణతీర్థులకు, సిద్ధేంద్రయోగికి, క్షేత్రయ్యకు కూడా సమకాలికుడన్నమాట. రామదాసుకు పూర్వం చాలాకాలం సీతారామ లక్ష్మణ విగ్రహాలు ఆ భద్రగిరిపైని పూజా పురస్కారాలు లేక లతాగుల్మాదులతో కప్పబడి ఉండేవి. రామదాసు నాటికి వృద్ధురాలయిన తమ్మల దమ్మక్క అనే భక్తురాలు రామదాసు తహసీల్దారీకి కొన్నేళ్ళు ముందుగానే స్వప్నదర్శనం ద్వారా ఆ దేవుని కనుక్కొని గ్రామస్థుల సహాయంతో ప్రతిష్ఠ చేసి బ్రహ్మోత్సవాలు చేయిస్తుండేదట.

దండకారణ్యవనవాస సమయాన ఒకనాడు శ్రీరాముడు సీతాలక్ష్మణులతో విహరించిన శిలయే భద్రగిరియనీ, మేరుగిరి కుమారుడైన భద్రుడు భక్తితో తపస్సు చేసి సాక్షాత్కారం పొంది లక్ష్మీశేష సహితుడైన శ్రీ మహావిష్ణువు రామావతారరూపంలో తనపై నివసించే వరం పొందినట్లు భద్రాచలమహాత్మ్య కథలో అనాదిగా వినవస్తూంది. ఇది బ్రహ్మాండపురాణంలోని గౌతమీమహాత్మ్యంలో చెప్పబడిన క్షేత్రగాథ. బ్రహ్మాండపురాణం రామదాసుకంటె అత్యంత ప్రాచీనమయినది. కనుక భద్రాచలము ప్రాచీన క్షేత్రమే. ఇక్కడ వెలసిన సీతారామ లక్ష్మణులకు కొంతకాలం పూజాదికం జరుగుతూ వుంది. ఏ తురుష్కదండయాత్రలకాలంలోనో 14, 15వ శతాబ్దాలలో అడవిపొదల్లో మణిగి ఉంటుంది.

ఆ విధంగా అజ్ఞాతమైపోయిన రాముని ఆలయాన్ని వెలుగులోకి తెచ్చినదే తమ్మల దమ్మక్క అనే భక్తురాలని ఈ సందర్భంలో ఆమెకు కలిగిన స్వప్నంలో శ్రీరాముడు దర్శనమిచ్చి కొండపై వెలసిన తన్ను సమస్తజనులకు వెల్లడిపరచి నిత్యోత్సవాదులు జరిగేటట్లు ఏర్పాట్లు చేయుమనీ, కొన్నాళ్ళతర్వాత తన ప్రియభక్తుడొకడు ఆ గ్రామానికి ప్రభుత్వాధికారియై రాగలడని అతడు తనకు కోవెలను గోపురప్రాకారాదులను కట్టించునంతవరకూ ఆమె తన పూజాదికములను నిర్వర్తిస్తూ ఉంటే అప్పటికి కైవల్యం సంప్రాప్తిస్తుందనీ సెలవిచ్చాడు. తమ్మల దమ్మక్క రాముని ఆజ్ఞప్రకారమే చేసింది. 1600 ప్రాంతంలో గోలకొండ రాజ్యంలోని నేలకొండపల్లెలో లింగనమంత్రికీ కామమ్మకూ పుత్రుడై జన్మించిన కంచెర్ల గోపన్న 1650 నాటికి భద్రాచలానికి తహాశీల్దారై వచ్చేముందు శ్రీరామునిచే స్వప్నంలో తమ్మక్కవలెనే ప్రబోధితుడయినాడట. గోపన్నకు భద్రాచలం తాలూకా తహాశీల్దారీ రావడానికి అప్పుడు

తానాషా కొలువులో అధికారులుగా ఉన్న అక్కన్న మాదన్నగార్లనీ వారిద్దరూ గోపన్నకు మేనమామలనీ రామదాసుచరిత్ర అనే పేరుతో ప్రచారంలో వున్న హరికథా గ్రంథాలనుబట్టి తెలుస్తోంది.

గోపన్న బాల్యంలో బాలరామాయణము మొదలగు గ్రంథాలను పఠించినాడు. ఇతని ఇంట్లో యెల్లప్పుడూ భజనగోష్ఠులూ భాగవత సత్కారమూ జరుగుతూండేవి. తన భక్తికవితతో వేదాంతకీర్తనలతో ఉత్తర హిందూస్థానం ఉర్రూతలూగించిన కబీర్‌దాస్ ఇతని గ్రామానికి వచ్చి ఇతనికి రామమంత్రం ఉపదేశం చేశాడని రామదాసు చరిత్రం హరికథలో ఉన్నది. భక్తిమార్గంలో పడిన గోపన్న తనకున్నదంతా హరిదాసులకిచ్చి కట్టుబట్టలతో జీవిస్తూ ఉండేవాడు. సంసారపోషణకు గడవక బంధువుల సలహాపైని ఇతడు గోలకొండరాజ్యపు రాజధానియైన హైదరాబాద్‌కు పోయి తన మేనమామలయిన అక్కన్న మాదన్నలను తనకుద్యోగమేదయిన యిమ్మని అడిగాడు.

మాదన్న మహాప్రధాని, అక్కన్న షర్‌లష్కర్, వారు వెంటనే అతనికి భద్రాచలానికి తహశీల్దారుగా ఉద్యోగం వేయించారు. పదవిలో ఉన్న రామదాసు రైతులను ఆదరాభిమానాలతో చూస్తూ వారి ఆదరాభిమానాలను సంపాదించి పన్నులు వసూలు చేసిన పైకంతో భద్రాచలరాములకు కైంకర్యం చేయిస్తూ ఉండేవాడు. ఒకనాడొక సంతర్పణం జరుగుతుండగా రామదాసు కొడుకొక గంజిగుంటలోపడి అచేతనుడైపోయాడు. సంతర్పణం మధ్యలో బిడ్డ మరణవార్త పొక్కితే ఆభాస మవుతుందని రామదాసు భార్య సంతర్పణయిన తర్వాత విషాదవార్త భర్తకు తెలియజేసింది. "రామకార్యతత్పరుణ్ణయి ఉన్న సమయంలోనా రామరాజ్యగాథలలో మృతుడైన విప్రపుత్రుని బ్రతికించినట్లు విన్నది. సత్యమైతే నాపుత్రుని కూడా బ్రతికించు తండ్రి''.... అని కోవెలలో పాడాడట.

ఈపాట పాడిన వెంటనే శ్రీరాముని అనుగ్రహాన రామదాసు కుమారుడు నిద్రనుంచి లేచినట్లు లేచి కూర్చున్నాడట. అప్పటినుంచి గోపన్నగారు భక్తరామదాసుగా ప్రజలకు వెల్లడి అయి, అతని మహిమలు దేశమంతా వ్యాపించాయి. కాని శిస్తు వసూలు పైకం, గోలకొండకు పోవడంలేదు. మొగలాయి చక్రవర్తి అయిన ఔరంగజేబునుంచి దండయాత్రవల్లను కప్పములకోసము ఒత్తిడివల్లనూ చికాకుపడుతున్న తానాషా రామదాసు అంటే ఈర్ష్యాళువులైన తురక సర్దారుల చెప్పుడుమాటలు విని శిస్తు పైక మిమ్మని వెంటనే రామదాసుకు కబురు పంపాడు.

రామదాసు ఈయలేకపోగా రాజద్రవ్యాపహరణ నేరంమీద అతనిని జైలులో ఉంచి పండ్రెండేళ్ళు నానాబాధలు పెట్టాడు. భగవంతునికోసమే తాను సద్వ్యయం చేసిన ధనం, భగవంతుడే ఏలాగో ఒకలాగ తానాషాకు అప్పగిస్తాడనే అనంతవిశ్వాసంతో రాజభటులు పెట్టే బాధలన్నిటినీ రామసంకీర్తనలు పాడి ఓర్చుకుంటూ 12 ఏళ్ళు గడిపాడు. కాని చివరకు విసిగి ఒకరోజున విషము పుచ్చుకొని ప్రాణహరణం చేసుకొనపోతూ ఉండగా శ్రీరాముడు లక్ష్మణ సహితంగా తానాషాకు అంతఃపురంలో జవానువేషంలో కనబడి రామదాసుగారిచ్చినట్లుగా పైకమిచ్చి రసీదు తీసుకొని రామదాసును చెరవిడిపించాడు. ఆతర్వాత రామదాసు తానాషాసమ్మతితో భద్రాచలరాములకు ఇతోధిక కైంకర్యాలు చేయించి పరమభక్తశేఖరుడని పేరుపొంది రామసాయుజ్యం పొందాడు.

## అధ్యయన వేదిక

**అర్థములు :**

కైంకర్యాలు = సేవలు; బందిఖానా = జైలు; గుల్మము = బోదెలేని చెట్టు; కైవల్యము = మోక్షము; సంతర్పణ = తృప్తిపరచుట; అచేతనుడు = చనిపోయినవాడు; విప్రుడు = బ్రాహ్మణుడు; శిస్తు = పన్ను; అపహరణ = దొంగలించుట.

**సంధులు :**

**ఈ క్రింది పదములను విడదీసి సంధి పేర్లను వ్రాసి సూత్రములను వ్రాయుము.**

అత్యంత, భక్తాగ్రేసరులు, బ్రహ్మోత్సవాలు, ద్రవ్యాపహరణం.

**సమాసములు :**

**ఈ క్రింది సమాసములకు విగ్రహవాక్యములు వ్రాసి సమాసముల పేర్లను వ్రాయుము.**

రామమందిరం, భక్తాగ్రేసరుడు, సీతారామలక్ష్మణులు, మేరుగిరి, అచేతనుడు, పుణ్యచరిత్ర.

**అర్థ సందర్భములు :**

1. ఇతని ఇంట్లో ఎల్లప్పుడు భజనగోష్ఠులు భాగవత సత్కారము జరుగుతుండేవి.
2. నాపుత్రుని కూడా బ్రతికించు తండ్రీ.

**ప్రశ్నలు :**

1. భద్రాచలక్షేత్ర పూర్వవృత్తాంతము వ్రాయుము.
2. రామదాసు భద్రాద్రిరామాలయమును ఎట్లు ఉద్ధరించెను? గోపన్న భక్తరామదాసుగా ప్రజలకు వెల్లడియైనదెట్లు?
3. రామదాసు పారమార్థికదృష్టితో గావించిన సాధు సంతర్పణములను తెలుపుము.
4. రామదాసు కారాగారబద్ధుడగుటకు కారణము, విముక్తుడైన విధమెట్టిది?

***విద్యార్థులకు సూచన :***

పుణ్యస్థలాలకు, చారిత్రకప్రదేశములకు విహారయాత్రగా వెళ్ళుట మంచిది. వాగ్గేయకారుల కీర్తనలను నేర్చుకొనుట మంచిది.

***ఉపాధ్యాయులకు సూచన :***

రామదాసులాంటి వాగ్గేయకారుల జీవితచరిత్రలను విద్యార్థులకు తెలియజేయుట యుక్తము.

# వ్యాకరణము

## సంధులు

**సంధి :** పూర్వ పరస్వరంబులకు పరస్వరంబేకా దేశమగుట సంధి నాం బడు. సంధిలో మొదటి పదమును పూర్వపదమనియు, రెండవ పదమును ఉత్తర పదమనియు అందురు. ఈ రెండు పదముల కలయిక సంధి.

ఉదా॥ రాముడు + అతడు - రాముడతడు
మనము + ఉంటిమి - మనముంటిమి

### సంస్కృత సంధులు

**1. సవర్ణదీర్ఘ సంధి :** అ, ఇ, ఉ, ఋ - వర్ణములకు క్రమముగా అవే వర్ణములు పరమగునప్పుడు దీర్ఘమేకాదేశమగును.

| | | | | |
|---|---|---|---|---|
| ఉదా॥ వింధ్య | + | అరణ్యము | - | వింధ్యారణ్యము |
| చరిత | + | అర్థము | - | చరితార్థము |
| ప్రబల | + | ఆధారము | - | ప్రబలాధారము |
| ముని | + | ఇంద్రుడు | - | మునీంద్రుడు |
| గురు | + | ఉత్తముడు | - | గురూత్తముడు |
| పితృ | + | ఋణము | - | పితౄణము |

**2. గుణ సంధి :** 'అ'కారమునకు ఇ, ఉ, ఋ - లు పరమగునప్పుడు క్రమముగా ఏ-ఓ- అర్ - లు ఏకాదేశముగా వచ్చును. ఏ, ఓ, అర్ - లకు గుణములని పేరు.

| | | | | |
|---|---|---|---|---|
| ఉదా॥ మృగ | + | ఇంద్రుడు | - | మృగేంద్రుడు |
| లోక | + | ఉక్తి | - | లోకోక్తి |
| మహా | + | ఋషి | - | మహర్షి |

**3. యణాదేశ సంధి :** ఇ, ఉ, ఋ - లకు ఇతరములైన యచ్చులు పరమగునప్పుడు క్రమముగా య, వ, ర - లు ఆదేశంగా వచ్చును. య, వ, ర - లకు యణ్ణులని పేరు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉదా॥ | అతి | + | అంత | - | అత్యంత |
| | మధు | + | అరి | - | మధ్వరి |
| | పితృ | + | ఆజ్ఞ | - | పిత్రాజ్ఞ |

**4. వృద్ధి సంధి :** 'అ'కారమునకు ఏ - ఐ, లు పరమగునప్పుడు 'ఐ' కారము, ఓ - ఔ, లు పరమగునప్పుడు 'ఔ' కారము ఏకాదేశమగును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉదా॥ | భువన | + | ఏక | - | భువనైక |
| | మానస | + | ఓక | - | మానసౌకము |
| | దివ్య | + | ఔషధము | - | దివ్యౌషధము |

**5. అనునాసిక సంధి :** క - చ - ట - త - ప, లకు అనునాసికములు పరమగునప్పుడు తద్వర్గానునాసికములే ఆదేశంగా వచ్చును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉదా॥ | వాక్ | + | మయము | - | వాఙ్మయము |
| | రాట్ | + | మయము | - | రాణ్మయము |
| | తత్ | + | మంత్రము | - | తన్మంత్రము |

**6. విసర్గ సంధి :**

(ఎ) విసర్గకు శ - ష - స - లు పరమగు నప్పుడు క్రమముగా శ - ష - స - లు ఆదేశంగా వచ్చును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉదా॥ | చతుః | + | శతాబ్దములు | - | చతుశ్శతాబ్దములు |
| | పయః | + | షాడబము | - | పయష్షాడబము |
| | తపః | + | సాధనము | - | తపస్సాధనము |

(బి) విసర్గకు క - ఖ - ప - ఫ - లు పరమగు నప్పుడు విసర్గ లోపించదు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉదా॥ | మనః | + | కమలము | - | మనఃకమలము |
| | ప్రాతః | + | కాలము | - | ప్రాతఃకాలము |
| | తేజః | + | పుంజము | - | తేజఃపుంజము |

| | | | | |
|---|---|---|---|---|
| తపః | + | ఫలము | - | తపఃఫలము |

(సి) హ్రస్వ 'అ'కారము మీది విసర్గకు హ - య - వ - ర - లు గాని, అచ్చులుగాని, వర్గ తృతీయ, చతుర్థ, పంచమాక్షరములు గాని పరమగు నప్పుడు హ్రస్వ 'అ'కారము 'ఓ'కారముగా మారును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉదా॥ | వయః | + | వృద్ధులు | - | వయోవృద్ధులు |
| | తపః | + | వనము | - | తపోవనము |
| | శిరః | + | రత్నము | - | శిరోరత్నము |
| | రజః | + | అభిషిక్తుడు | - | రజోభిషిక్తుడు |

(డి) విసర్గకు చ - ఛ - లు పరమగునప్పుడు 'శ' వర్ణముగాను, ట - ఠ - లు పరమగునప్పుడు 'ష' వర్ణముగాను, త - థ - లు పరమగునప్పుడు 'స'వర్ణముగాను మారును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉదా॥ | తపః | + | చర్య | - | తపశ్చర్య |
| | ధనుః | + | టంకారము | - | ధనుష్టంకారము |
| | మనః | + | తత్వము | - | మనస్తత్వము |

(ఇ) విసర్గకు కొన్ని యెడల రేఫాదేశమగును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉదా॥ | ధనుః | + | బాణము | - | ధనుర్బాణము |
| | అంతః | + | ఆత్మ | - | అంతరాత్మ |
| | ధనుః | + | విద్య | - | ధనుర్విద్య |

**7. శ్చుత్వసంధి :** స, త, థ, ద, ధ - లకు శ, చ,ఛ, జ, ఝ - లు పరమగునప్పుడు వరుసగా నవియే ఆదేశములగును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉదా॥ | మనస్ | + | శాంతి | - | మనశ్శాంతి |
| | తపస్ | + | శక్తి | - | తపశ్శక్తి |
| | సత్ | + | చరితము | - | సచ్చరితము |
| | జగత్ | + | జననము | - | జగజ్జననము |

**8. జశ్త్వ సంధి :** వర్గ ప్రథమాక్షరములకు వర్గ తృతీయ చతుర్థాక్షరములు, హ, య, వ, ర - లు గాని, అచ్చులుగాని పరమగునప్పుడు క్రమముగా గ, జ, డ, ద, బ - లు ఆదేశముగా వచ్చును.

ఉదా॥ వాక్ + యుద్ధము - వాగ్యుద్ధము
రాట్ + దూత - రాడ్దూత
శరత్ + భయము - శరద్భయము

## తెలుగు సంధులు

**1. త్రిక సంధి**

(ఎ) ఆ - ఈ - ఏ - లు అను సర్వనామంబులు త్రికంబులు.

ఉదా॥ అక్కన్య = ఆ + కన్య
ఇవ్విధము = ఈ + విధము
ఎచ్చోటు = ఏ + చోటు

(బి) త్రికంబు మీది అసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు.

ఉదా॥ ఆ + క్కన్య
ఈ + వ్విధము
ఏ + చ్చోటు

(సి) ద్విరుక్తంబగు హల్లు పరంబగునప్పుడు ఆచ్చికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు.

ఉదా॥ అక్కన్య = ఆకన్య
ఇవ్విధము = ఈవిధము
ఎచ్చోటు = ఏచోటు

**2. ద్విరుక్తటకార సంధి :**

కుఱు, చిఱు, కడు, నడు, నిడు - శబ్దముల ఱ - డ - లకు అచ్చుపరంబగునప్పుడు ద్విరుక్తటకారంబగు.

ఉదా॥ కుఱు + ఉసురు - కుట్టుసురు
చిఱు + ఎలుక - చిట్టెలుక
కడు + ఎదురు - కట్టెదురు
నడు + ఇల్లు - నట్టిల్లు
నిడు + ఊర్పు - నిట్టూర్పు

**3. పుంప్వాదేశ సంధి : (ముపర్ణలోప సంధి)**

కర్మధారయము నందు 'ము' వర్ణకంబునకు పు-ంపు లగును.

| | | | | |
|---|---|---|---|---|
| ఉదా॥ | ముత్తెము | + చిప్ప | - | ముత్తెపు చిప్ప |
| | సరసము | + మాట | - | సరసపు మాట |
| | విరసము | + వచనము | - | విరసంపు వచనము |

**4. గసడదవాదేశ సంధి :**

(ఎ) ప్రథమ మీది పరుషములకు గ - స - డ - ద - వ - లు బహుళముగానగు.

| | | | | |
|---|---|---|---|---|
| ఉదా॥ | వాడు | + | కొట్టె | - వాడుగొట్టె; వాడుకొట్టె |
| | రాముడు | + | చనెను | - రాముడు సనెను; రాముడు చనెను |
| | వాడు | + | టక్కరి | - వాడు డక్కరి; వాడు టక్కరి |
| | అతడు | + | తెమ్మనెను | - అతడు దెమ్మనెను,<br>అతడు తెమ్మనెను |
| | నిద్ర | + | పోవు | - నిద్రవోవు, నిద్రపోవు |

(బి) ద్వంద్వంబునం పదంబుపై పరుషములకు గ - స - డ - ద - వ లగును

| | | | | |
|---|---|---|---|---|
| ఉదా॥ | కూర | + కాయ | - | కూరగాయలు |
| | టక్కు | + టెక్కు | - | టక్కుడెక్కులు |
| | తల్లి | + తండ్రి | - | తల్లిదండ్రులు |

**5. సరళాదేశ సంధి :**

(ఎ) ద్రుతప్రకృతికము మీది పరుషములకు సరళములగు.

ఉదా॥ పూచెను + కలువలు - పూచెను గలువలు

(బి) ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషలు విభాషనగు.

ఉదా॥ పూచెను + గలువలు - పూచెం గలువలు
పూచెఁ గలువలు
పూచెన్గలువలు

**6. ప్రాతాది సంధి :**

(ఎ) సమాసమునం బ్రాతాదుల తొలి యచ్చు మీది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు.

ఉదా॥ ప్రాత + కెంపు - ప్రా + కెంపు

(బి) లుప్తశేషంబునకు పరుషంబులు పరంబగునప్పుడు నుగాగమంబునగు.
ఉదా॥ ప్రా + న్ + కెంపు

(సి) ద్రుతప్రకృతికము మీది పరుషములకు సరళములగు.

ఉదా॥ ప్రాన్ + కెంపు - ప్రాన్ + గెంపు

(డి) ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషలు విభాషనగు.

ఉదా॥ ప్రాఁ గెంపు

**క్రొన్నురువు :**

(ఎ) సమాసమునం బ్రాతాదుల తొలి యచ్చు మీది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు.

ఉదా॥ క్రొత్త + నురువు - క్రొ + నురువు

(బి) క్రొత్త శబ్దంబున కాద్యక్షర శేషంబునకు కొన్ని యెడల నుగాగమంబును, కొన్ని యెడల మీది హల్లునకు ద్విత్వంబునగు.

ఉదా॥ క్రొ + నురువు - క్రొన్నురువు

**7. రుగాగమ సంధి :**

పేదాది శబ్దములకు 'ఆలు' శబ్దము పరమగునప్పుడు కర్మధారయమునందు 'రు'గాగమంబగు.

ఉదా॥ పేద + ఆలు - పేదరాలు
జవ + ఆలు - జవరాలు

## సమాసములు :

"సమర్థంబులగు పదంబులు ఏకపదంబగుట సమాసము నాఁబడు" అనగా ననేక పదములు కలిసి ఒక పదమై అర్థమును బోధించుటను సమాసమందురు.

భాషను బట్టి సాంస్కృతికము, ఆచ్ఛికము, మిశ్రమము - అని సమాసములు మూడు విధములు.

**ఎ. సాంస్కృతికము :** సంస్కృత పదములకు సంబంధించిన సమాసము సాంస్కృతికము. ఇది సిద్ధమని, సాధ్యమని రెండు విధములు.

ఉదా॥ రాజాజ్ఞ ; తటాకోదకము

**బి. ఆచ్ఛికము :** (ఆచ్ఛికము = అచ్చ తెలుగు) అచ్చ తెలుగు పదములకు సంబంధించిన సమాసము ఆచ్ఛికము.

ఉదా॥ తేనియానతి ; చెఱువు నీరు

**సి. మిశ్రమము :** సంస్కృత తెలుగు పదములు కలిసిన సమాసము మిశ్రమము.

ఉదా॥ రాజునానతి ; తేని యాజ్ఞ ; తటాకపు నీరు

**1. ద్వంద్వ సమాసము : (జంట పదములు) :** (ఎ) ఉభయ పదార్థప్రధానము ద్వంద్వము. అనగా రెండుపదముల యొక్క అర్థము ప్రధానముగా గలది.

ఉదా॥ కృత్యమును, అకృత్యమును - కృత్యాకృత్యములు
భక్తియును, శ్రద్ధయును - భక్తి శ్రద్ధలు
కష్టమును, నిష్ఠురమును - కష్ట నిష్ఠురములు

**(బి) బహుపద ద్వంద్వము :** ఇందు రెండు పదములకంటె ఎక్కువ పదముల అర్థము ప్రధానముగా నుండును.

ఉదా॥ సీతయును, రాముడును, లక్ష్మణుడును — సీతా రామ లక్ష్మణులు

రాముడును, లక్ష్మణుడును, భరతుడును, శత్రుఘ్నుడును — రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు

**2. ద్విగు సమాసము :** సంఖ్య పూర్వపదమందుగల కర్మధారయము. ఇందు మొదటి పదము సంఖ్యా వాచక విశేషణముగాను, రెండవ పదము విశేష్యముగా నుండును.

| | | | |
|---|---|---|---|
| ఉదా॥ | నాలుగైన విధములు | - | చతుర్విధములు |
| | మూడైన లోకములు | - | ముల్లోకములు |
| | నవ సంఖ్యగల్గిన గ్రహములు | - | నవ గ్రహములు |
| | దశ సంఖ్యగల్గిన దిశలు | - | దశదిశలు |
| | శత సంఖ్యగల్గిన అపరాధంబులు | - | శతాపరాధంబులు |
| | అష్ట సంఖ్యగల్గిన దిగ్గజములు | - | అష్ట దిగ్గజములు |

**3. బహువ్రీహి సమాసము :** అన్య పదార్థ ప్రధానము బహువ్రీహి.

| | | | |
|---|---|---|---|
| ఉదా॥ | శీత కిరణములు గలవాడు | - | శీత కిరణుడు |
| | చతుర్భుజములు గలవాడు | - | చతుర్భుజుడు |
| | పుణ్యచరిత్రము గలవారు | - | పుణ్యచరిత్రులు |

**4. రూపక సమాసము :** ఉపమాన ధర్మమును ఉపమేయమునందు ఆరోపించుట రూపకము.

| | | | |
|---|---|---|---|
| ఉదా॥ | కవిత యనెడు సౌధం | - | కవితాసౌధం |

| | | |
|---|---|---|
| ఆంధ్ర వాఙ్మయమనెడు వృక్షము | - | ఆంధ్ర వాఙ్మయ వృక్షము |
| కోపమనెడు అగ్ని | - | కోపాగ్ని |

**5. అవ్యయీభావ సమాసము :** పూర్వ పదార్థ ప్రధానము. ఇందు సామాన్యముగా పూర్వపదము అవ్యయమై యుండును.

| | | | |
|---|---|---|---|
| ఉదా॥ | యథాశక్తి | - | శక్తిననుసరించి |
| | ప్రతిదినము | - | దినము దినము |

**6. నఞ్తత్పురుష సమాసము :** అకార, నకారములు పూర్వమందుండి వ్యతిరేకార్థమును తెలుపు సమాసము. ఈ 'న'కారము హల్లు పరమగుచో 'అ'కారముగను, అచ్చుపరమగుచో 'అన్' గాను మారును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉదా॥ | న + సత్యము | - | సత్యము కానిది | - | అసత్యము |
| | న + భయము | - | భయము కానిది | - | అభయము |
| | న + అఘము | - | అఘము కానిది | - | అనఘము |

**7. కర్మధారయ సమాసము :** విశేషణ విశేష్యములతోడి సమాసము.

**ఎ. విశేషణ పూర్వపద కర్మధారయ సమాసము :** ఇందు మొదటి పదము విశేషణము గాను, రెండవ పదము విశేష్యముగా నుండును.

| | | | |
|---|---|---|---|
| ఉదా॥ | వ్యర్థమైన పదార్థాలు | - | వ్యర్థ పదార్థాలు |
| | అపూర్వమైన వరము | - | అపూర్వ వరము |
| | ప్రధానమైన అంశము | - | ప్రధానాంశము |
| | ప్రబలమైన ఆధారము | - | ప్రబలాధారము |
| | మంచిదైన కవిత | - | సత్కవిత |
| | పుణ్యమైన చరిత్ర | - | పుణ్యచరిత్ర |

**బి. విశేషణ ఉత్తర పద కర్మధారయ సమాసము :** ఇందు మొదటి పదము

విశేష్యముగాను, రెండవ పదము విశేషణముగా నుండును.

ఉదా॥ అధముడైన శశము - శశాధముడు
వృద్ధయైన (ముసలి) కపోతము - కపోత వృద్ధము
అధముడైన నరుడు - నరాధముడు

**సి. విశేషణోభయ పద కర్మధారయ సమాసము:** ఇందు పూర్వోత్తరపదములు రెండును విశేషణములుగా నుండును.

ఉదా॥ శాంతగంభీరము - శాంతమును గంభీరము నైనది

**డి. సంభావనా పూర్వపద కర్మధారయ సమాసము :** ఇందు మొదటి పదము సంజ్ఞావాచక విశేషణముగాను, రెండవ పదము జాతినామ వాచకముగా నుండును.

ఉదా॥ ఇభమను పేరుగల పురము - ఇభపురము
ద్వారక యనెడు నగరము - ద్వారకానగరము
హస్తిన అనుపేరుగల పురము - హస్తినాపురము

**ఇ. ఉపమాన పూర్వపద కర్మధారయ సమాసము :** ఇందుపమానము పూర్వ పదముగాను, ఉపమేయము రెండవ పదముగా నుండును.

ఉదా॥ తేనెమాటలు - తేనెవంటి మాటలు

**ఎఫ్. ఉపమాన ఉత్తరపద కర్మధారయ సమాసము :** ఇందుపమేయము మొదటి పదముగాను, ఉపమానము రెండవ పదముగా నుండును.

ఉదా॥ తామరల వంటి కేలు - కేలు తామరలు
అబ్జముల వంటి చరణములు - చరణాబ్జములు

**8. తత్పురుష సమాసము :**

**ఎ. ద్వితీయ తత్పురుష సమాసము :** ఇందు మొదటి పదము చివర 'నిన్ -

నున్ - లన్ - కూర్చి - గురించి - అను ప్రత్యయములలో ఒకటి యుండి సమాసము చేసినప్పుడు లోపించును.

ఉదా॥ మరుని హరించినవాడు - మరుహరుడు

చంద్రుని ధరించినవాడు - చంద్రధరుడు

**బి. తృతీయా తత్పురుష సమాసము :** ఇందు మొదటి పదము చివర చేతన్ - చేన్ - తోడన్ - తోన్, అను ప్రత్యయములలో ఒకటి యుండి సమాసము చేసినప్పుడు లోపించును.

ఉదా॥ ధనముచేత అధికుడు - ధనాధికుడు

వాక్కులతో యుద్ధము - వాగ్యుద్ధము

**సి. చతుర్థీ తత్పురుష సమాసము :** ఇందు మొదటి పదము చివర కొరకు - కై, అను ప్రత్యయములలో ఒకటి యుండి సమాసము చేసినప్పుడు లోపించును.

ఉదా॥ దేవరమేలు - దేవరకొరకు మేలు

**డి. పంచమీ తత్పురుష సమాసము :** ఇందు మొదటి పదము చివర వలన -కంటె - పట్టి, అను ప్రత్యయములలో ఒకటి యుండి సమాసము చేసినప్పుడు లోపించును.

ఉదా॥ చోరులవలన భయము - చోరభయము

ప్రాణముకంటె అధికుడు - ప్రాణాధికుడు

**ఇ. షష్ఠీ తత్పురుష సమాసము :** ఇందు మొదటి పదము చివర కిన్ - కున్ - యొక్క - లోన్ - లోపల, అను ప్రత్యయములలో ఒకటి యుండి సమాసము చేసినప్పుడు లోపించును.

ఉదా॥ నటునియొక్క ప్రతిభ - నటునిప్రతిభ

మాటయొక్క తీరు - మాటతీరు

**ఎఫ్. సప్తమీ తత్పురుష సమాసము :** ఇందు మొదటి పదము చివర అందు - న, అను ప్రత్యయములలో ఒకటి యుండి సమాసము చేసినప్పుడు లోపించును.

ఉదా॥ పుత్రునియందు ప్రేమ - పుత్రప్రేమ
వాతావరణమునందలి కాలుష్యము - వాతావరణ కాలుష్యము
నటనయందు కౌశలము - నటనాకౌశలము

## ఛందస్సు

పద్యముల లక్షణమును తెలుపునది ఛందస్సు. ప్రతిపద్యము సామాన్యముగా నాలుగు పాదములు కలిగి యుండును. పాదములు గణముల చేతను, గణములు గురులఘువుల చేతను విభజింపబడును.

**1. ఏకాక్షర గణములు :** ఏకాక్షర .గణములు - 2

లఘువు — I
గురువు — U

**2. రెండక్షర గణములు :** రెండక్షర గణములు - 4

లలము — I I
గగము — U U
వగణము — I U
హగణము — U I

**3. మూడక్షర గణములు :** మూడక్షర గణములు - 8

మగణము — U U U

భగణము — U I I

జగణము — I U I

సగణము — I I U

నగణము — I I I

యగణము — I U U

రగణము — U I U

తగణము — U U I

**4. ఉప గణములు**

**ఎ. సూర్య గణములు :**

హగణము — U I

నగణము — I I I

**బి. ఇంద్ర గణములు :**

నలము — I I I I

నగము — I I I U

సలము — I I U I

భగణము — U I I

రగణము — U I U

తగణము — U U I

**5. పద్యలక్షణములు :**

**ఎ. వృత్తములు :** వృత్తములు సామాన్యముగా నాలుగేసి పాదములు కలిగి యుండును. యతులు చెల్లును. ప్రాసనియమము గలదు. అవి

1. ఉత్పలమాల 2. చంపకమాల 3. శార్దూలము 4. మత్తేభము

**1. ఉత్పలమాల :** ఉత్పలమాల పద్యమునకు నాలుగు పాదములుండును.

ప్రతిపాదమునందు భ, ర, న, భ, భ, ర, వ – అను గణములు వరుసగా నుండును. ప్రాసనియమము గలదు. 10వ అక్షరము యతి. ప్రతిపాదము నందు అక్షరముల సంఖ్య 20.

| భ | ర | న | భ | భ | ర | వ |
|---|---|---|---|---|---|---|
| U I I | U I U | I I I | U I I | U I I | U I U | I U |
| క్రొండ కు | గొండతొ | ల్చియొక | గుజ్జదొ | రన్నెల | కొల్చిరా | యొడన్ |

**2. చంపకమాల :** చంపకమాల పద్యమునకు నాలుగు పాదములుండును. ప్రతి పాదమునందు న, జ, భ, జ, జ, జ, ర – అను గణములు వరుసగా నుండును. ప్రాసనియమము గలదు. 11వ అక్షరము యతి. ప్రతిపాదము నందు అక్షరము సంఖ్య 21.

| న | జ | భ | జ | జ | జ | ర |
|---|---|---|---|---|---|---|
| I I I | I U I | U I I | I U I | I U I | I U I | U I U |
| క్రమము | నఁదోచె | దోడుప | డరాజ | కుమారు | లరెండు | దిక్కులన్ |

**3. శార్దూలము :** శార్దూల పద్యమునకు నాలుగు పాదములుండును. ప్రతిపాదమునందు మ, స, జ, స, త, త, గ – అను గణములు వరుసగా నుండును. ప్రాసనియమము గలదు. 13వ అక్షరము యతి. ప్రతిపాదమునందు అక్షరముల సంఖ్య 19.

| మ | స | జ | స | త | త | గ |
|---|---|---|---|---|---|---|
| U U U | I I U | I U I | I I U | U U I | U U I | U |
| విన్నావా | దురదృ | ష్టవంతు | డవునీ | వేనాటి | కిన్నేటి | కిన్ |

**4. మత్తేభము :** మత్తేభ పద్యమునకు నాలుగు పాదములుండును. ప్రతి పాదమునందు స, భ, ర, న, మ, య, వ – అను గణములు వరుసగా నుండును. ప్రాసనియమము గలదు. 14వ అక్షరము యతి. ప్రతిపాదమునందు అక్షరముల సంఖ్య 20.

| స | భ | ర | న | మ | య | వ |
|---|---|---|---|---|---|---|
| I I U | U I I | U I U | I I I | U U U | I U U | I U |
| క డువే | గం బున | హంసుపై | నుఱికి | యాక్రంసా | రికాళిం | దిలో |

**బి. జాతులు :** కందము, ద్విపద మున్నగు పద్యములు జాతులకు చెందినవి. యతులు చెల్లును. ప్రాసనియమము కందపద్యమునకు మాత్రము గలదు.

**1. కందము :** కంద పద్యమునకు నాలుగు పాదములుండును. 1-3 పాదములు మూడేసి గణములుండి పొట్టిగను, 2-4 పాదములు అయిదేసి గణములుండి పొడవుగా నుండును. గగ, నల, భ, జ, స – అను గణములను వరుసక్రమమున గాక యిష్టము వచ్చినట్లుగా వాడవచ్చును. బేసి గణములు 'జగణము'గా నుండరాదు. కాని 2-4 పాదములందు మూడవ గణము జగణము గాని నలము గాని యుండవలెను. 2-4 పాదములందు చివరి యక్షరము గురువుగా నుండవలెను. ప్రాసనియమము గలదు. యతి : 2-4 పాదములందు పాదము మొదటి అక్షరమునకు 4వ గణము మొదటి యక్షరమునకు యతి చెల్లును.

| నల | భ | భ |
|---|---|---|
| I I I I | U I I | U I I |
| సిరిగల | వానికి | జెల్లును |

| నల | స | జ | స | గగ |
|---|---|---|---|---|
| I I I I | I I U | I U I | I I U | U U |
| తరుణుల | పదియా | ఱువేలఁ | ద్రగఁబెం | డ్లాడన్ |

**2. ద్విపద :** ద్విపద పద్యమునకు రెండు పాదములు మాత్రమే యుండును. ప్రతిపాదమునందు మొదట 3 ఇంద్రగణములు, చివర 1 సూర్యగణముండును. ప్రాస యతి చెల్లును. యతి : పాదము మొదటి అక్షరమునకు 3 గణము మొదటి అక్షరమునకు యతి చెల్లును.

| ర | సల | భ | హ |
|---|---|---|---|
| U I U | I I U I | U I I | U I |
| కొమ్మనీ | కొకమంచి | బొమ్మయు | లెస్స |

| ర | నల | ర | న |
|---|---|---|---|
| U I U | I I I I | U I U | I I I |
| బొమ్మపొ | త్రికలను | బోయితె | చ్చెదము |

సూత్రము : 3 ఇంద్ర గణములు + 1 సూర్యగణము

**సి. ఉపజాతులు :** సీసము, తేటగీతి, ఆటవెలది - ఉపజాతి పద్యములు. యతులు చెల్లును. ప్రాసనియమము లేదు.

**1. సీసము :** సీస పద్యమునకు నాలుగు పెద్ద పాదములుండును. ప్రతి పాదమునందు మొదట 6 ఇంద్రగణములు చివర 2 సూర్యగణములుండును. ప్రతిపాదమునకు రెండేసి యతులు చెల్లును.

(ఎ) పాదము మొదటి అక్షరమునకు 3వ గణము మొదటి అక్షరమునకు ఒక యతి చెల్లును.

(బి) 5వ గణము మొదటి అక్షరమునకు 7వ గణము మొదటి అక్షరమునకు మరి యొక యతి చెల్లును. నాలుగు పెద్ద పాదములకు చివర ఆటవెలది గాని, తేటగీతి గాని చేర్చినచో పూర్తి సీస పద్యమగును.

| ర | నగ | ర | సల |
|---|---|---|---|
| U I U | I I I U | U I U | I I U I |
| ఆంధ్రవై | ష్ణవునిశై | వాభిమా | నముచాటు |

| ర | భ | హ | హ |
|---|---|---|---|
| U I U | U I I | U I | U I |
| శ్రీవిరూ | పాక్షుని | దేవ | ళమ్ము |

**2. తేటగీతి :** తేటగీతి పద్యమునకు నాలుగు పాదములుండును. ప్రతి పాదమునందు మొదట 1 సూర్య గణము తరువాత 2 ఇంద్రగణములు, చివర మరల 2 సూర్యగణములుండును. ప్రాసనియమము లేదు. యతి : ప్రతిపాదము నందు పాదము మొదటి అక్షరమునకు 4వ గణము మొదటి అక్షరమునకు యతి చెల్లును.

| | | | | |
|---|---|---|---|---|
| హ | త | ర | న | హ |
| U I | U U I | U I U | I I I | U I |
| క్రాన | నీమేని | నుండిర | క్తమును | దీసి |

సూత్రము : 1 సూర్య + 2 ఇంద్ర + 2 సూర్య

**3. ఆటవెలది :** ఆట వెలది పద్యమునకు నాలుగు పాదములుండును. 1-3 పాదములందు మొదట 3 సూర్యగణములు చివర 2 ఇంద్రగణములుండును. 2-4 పాదములందు 5ను సూర్యగణములే యుండును. ప్రాస నియమము లేదు. ప్రతిపాదమునందు పాదము మొదటి అక్షరమునకు 4వ గణము మొదటి అక్షరమునకు యతి చెల్లును.

| | | | | |
|---|---|---|---|---|
| హ | హ | న | ర | ర |
| U I | U I | I I I | U I U | U I U |
| నీర | సంబు | వదలి | ధారుణీ | నాథుపై |

| | | | | |
|---|---|---|---|---|
| న | హ | హ | న | హ |
| I I I | U I | U I | I I I | U I |
| గురిసె | బారి | జాత | కుసుమ | వృష్టి |

సూత్రము : 1-3 పాదములు : 3 సూర్య + 2 ఇంద్ర ; 2-4 పాదములు : 5 సూర్యగణములు.

## అలంకారములు

కావ్యమునకు శోభను కూర్చునవి అలంకారములు. ఇవి రెండు విధములు.

1. శబ్దాలంకారములు 2. అర్థాలంకారములు

**శబ్దాలంకారములు :** శబ్దము ప్రధానముగా గలవి శబ్దాలంకారములు.

**1. వృత్త్యను ప్రాసము :** ఒకసారి వచ్చిన అక్షరమును మరల మరల పలుమార్లు వచ్చునట్లు చెప్పుట వృత్త్యనుప్రాసము.

ఉదా॥ అడ్డిగెద నని కడ్డువడి చను
నడ్డిగిన, దను మగడ్డు నుడ్డువడ్డని నడ్డయుడ్డుగన్
వెడ్డవెడ్డ సిడ్డిముడ్డి తడ్డఁబడ్డ
నడ్డుగిడ్డు నడ్డుగిడ్డదు జడ్డిమ నడ్డుగిడ్డునెడ్డలన్

ఇచ్చట 'డ్డ' కారము పలుమార్లు వచ్చుటచే నిది వృత్త్యను ప్రాసము.

**2. లాటాను ప్రాసము :** శబ్దార్థ భేదములు లేక, తాత్పర్య భేదమును మాత్రము కలిగిన పదములను వెంట వెంటనే ప్రయోగించుట లాటాను ప్రాసము.

ఉదా॥ కమలార్చు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ

ఇచ్చట శబ్దార్థములందు భేదములేదు. కాని, తాత్పర్యమున..... కరములు (చేతులు) కరములు (శ్రేష్ఠమైన చేతులు); జిహ్వ (నాలుక) జిహ్వ (శ్రేష్ఠమైన నాలుక) అని తాత్పర్య భేదమును చెప్పుటచే నిది లాటానుప్రాసము.

**3. యమకము :** అర్థ భేదమును కలిగి ఒకసారి వచ్చిన పదము మరల మరల పలుమార్లు వచ్చునట్లు చెప్పుట యమకము.

ఉదా॥ పురము నందు 'అంతి' పురమునందు

ఇచ్చట.... పురము = పట్టణము; 'అంతి' పురము = రాణులు నివసించు భవనము (అంతఃపురము) - అని అర్థభేదము కలిగిన పదములు పలుమార్లు చెప్పుటచే నిది యమకము.

**4. అంత్యానుప్రాసము :** పాదాంతముల యందు ప్రాసయున్న అంత్యాను ప్రాసయగును.

ఉదా॥ కన్నతండ్రి నవ్వుల పూలు గంపెడేసి
చిన్నినాన్నకు కన్నులు చేరెడేసి
చక్కనయ్యకు నెరి కురుల్ జానెడేసి
చిట్టిబాబుమై నిగనిగల్ పెట్టెడేసి

ఇచ్చట పాదాంతముల యందు ఏసి - ఏసి - ఏసి -ఏసి అని ప్రాస చెప్పుటచే నిది అంత్యానుప్రాసము.

**అర్థాలంకారములు :** అర్థము ప్రధానముగా గలవి అర్థాలంకారములు.

**1. ఉపమాలంకారము :** ఉపమేయమును ఉపమానముతో పోల్చి మనోహరముగా చెప్పుట ఉపమాలంకారము.

ఉదా॥ 'రాజా! నీ ముఖము చంద్రబింబమువలె మనోహరముగా ప్రకాశించుచున్నది'

ఇచ్చట రాజు ముఖము చంద్రబింబమువలె ప్రకాశించుచున్నదని పోల్చి చెప్పుటచే నిది ఉపమాలంకారము.

| | | |
|---|---|---|
| ఉపమేయము | - | రాజు ముఖము |
| ఉపమానము | - | చంద్రబింబము |
| ఉపమా వాచక శబ్దము | - | వలె |
| సమాన ధర్మము | - | మనోహరముగా ప్రకాశించుట |

**2. రూపకము :** ఉపమాన ఉపమేయములకు అభేదము చెప్పుట రూపకము.

ఉదా॥ పుత్తడి బొమ్మ పూర్ణమ్మ

ఉపమేయము - పూర్ణమ్మ

ఉపమానము - పుత్తడిబొమ్మ

**3. ఉత్ప్రేక్షాలంకారము :** ఉపమేయమును ఉపమానముగా నూహించుట ఉత్ప్రేక్షాలంకారము.

ఉదా॥ ఆమదకరి నడకొండయా యని నడచి వచ్చుచున్నది.

ఉపమేయము - మదకరి (ఏనుఁగు)

ఉపమానము - నడకొండ

ఇచ్చట మదకరిని నడకొండగా ఊహించుటచే నిది ఉత్ప్రేక్షాలంకారము.

(ఉత్ప్రేక్ష = ఊహించుట)

**4. సారాలంకారము :** పూర్వముకంటె నుత్తరోత్తరము గొప్పదైనట్లు వర్ణించుట సారాలంకారము.

ఉదా॥ తేనె మధురము. దాని కంటె అమృతము మధురము. దానికంటె కవి వాక్కులు మరింత మధురము.

ఇచ్చట తేనె మధురము. తేనెకంటె అమృతము మధురము. అమృతము కంటె కవి వాక్కులు మరింత మధురము - అని ఒకదాని కంటె మరియొకటి మధురమని గొప్పగా చెప్పుటచే నిది సారాలంకారము.

**5. అతిశయోక్తి :** ఒక వస్తువును గురించి మిక్కిలి గొప్పగా వర్ణించి చెప్పుట అతిశయోక్త్యలంకారము.

ఉదా॥ ఆ పట్టణమందలి మేడలు ఆకాశమును తాకుచున్నవి.

ఇచ్చట మేడలు చాలా ఎత్తుగా నున్నవని చెప్పుటకు బదులుగా, ఆకాశమునే తాకుచున్నవని గొప్పగా వర్ణించి చెప్పుటచే నిది అతిశయోక్త్యలంకారము.

**6. శ్లేషాలంకారము :** అనేకార్థములు నిచ్చు శబ్దములఁ గూర్చుట శ్లేషాలంకారము.

ఉదా॥ "రాజు కువలయానందకరుడు"

| | | |
|---|---|---|
| రాజు | - | ప్రభువు ; చంద్రుడు |
| కువలయము | - | ప్రపంచము ; కలువపూవు |

ప్రభువు ప్రపంచమునకు ఆనందమును కల్గించును. చంద్రుడు కలువ పూవులకు ఆనందమును కల్గించును.

ఇచ్చట రాజు, కువలయ పదములకు అనేకార్థములు చెప్పుటచే నిది శ్లేషాలంకారము.

**7. ఉల్లేఖనము :** ఒక వస్తువును పలు విధములుగా కీర్తించుట ఉల్లేఖనము.

ఉదా॥ ఆ రాజు అందమున మన్మథుడు, కీర్తియందర్జునుడు, వింటి యందు భీష్ముడు.

ఇచ్చట రాజును అందమున మన్మథుడనియు, కీర్తి యందర్జునడనియు, వింటి యందు భీష్ముడనియు పలు విధముల కీర్తించుటచే నిది ఉల్లేఖనము.

(ఉల్లేఖనము = కీర్తించుట)

**8. క్రమాలంకారము లేక యథాసంఖ్యాలంకారము :** క్రమ సంఖ్యగల పదములను క్రమసంఖ్య గలవానితో క్రమముగా అన్వయించి చెప్పుట క్రమాలంకారము.

ఉదా॥ రామ లక్ష్మణులు రావణ యింద్ర జిత్తులను వధించిరి.

ఇచ్చట రాముడు రావణుని, లక్ష్మణుడు ఇంద్రజిత్తును వధించుటను క్రమముగా అన్వయించి చెప్పుటచే నిది క్రమాలంకారము.

**9. స్వభావోక్తి :** జాతి గుణాదుల స్వభావమును ఉన్నదున్నట్లు చెప్పుట స్వభావోక్త్యలంకారము.

ఉదా॥ ఆజింకల గుంపు చంచలనేత్రములతో మోరలెత్తి, చెవుల నిక్కించి, నావంక బెదరి చూచినవి.

ఇచ్చట జింకలు క్రొత్త వారిని చూచినప్పుడు మెడలు పైకెత్తుట, చెవుల నిక్కించుట, బిత్తర చూపులు చూచుట మొదలగు చేష్టలు - జింకల స్వభా వమును ఉన్నదున్నట్లు చెప్పుటచే నిది స్వభావోక్త్యలంకారము.

**10. సందేహము :** సాదృశ్యముచే ఒక వస్తువును చూచి అదియా లేక ఇదియా, అని సందేహించుట సందేహాలంకారము.

ఉదా॥ ఆ స్త్రీ ముఖము పద్మమా, లేక చంద్రబింబమా మాకు నిర్ణయము గాకున్నది.

ఇచ్చట కొందరు స్త్రీ ముఖమును చూచి పద్మమా లేక చంద్రబింబమా అని సందేహించుటచే నిది సందేహాలంకారము.

**11. భ్రాంతిమదలంకారము :** సాదృశ్యమువలన నొక వస్తువును చూచి వేరొక వస్తువని భ్రమపడుట భ్రాంతిమదలంకారము.

ఉదా॥ మదించిన గండు తుమ్మెద ఆ స్త్రీ ముఖమును చూచి కమలమని వాలుచున్నది.

ఇచ్చట గండు తుమ్మెద స్త్రీ ముఖమును చూచి తామరపూవు.... అని భ్రమ పడుటచే నిది భ్రాంతి మదలంకారము.

**12. లోకోక్తి :** ఒక విషయమును లోకోక్తిచే సమర్థించుట (లోకోక్తి - సామెత)

ఉదా॥ తన్నుమాలి పరుల రక్షింపవలెననుట నీతిగాదు

"తన్నుమాలిన ధర్మము మొదలు చెడ్డ బేరము గలదా" యను లోకోక్తి విన్నాఁడవుగావా!

**13. అర్థాంతర న్యాసము :** సామాన్యమును విశేషము చేతగాని, విశేషమును సామాన్యము చేతగాని సమర్థించి చెప్పుట అర్థాంతర న్యాసము.

ఉదా॥ "ఆంజనేయుడు సముద్రమును దాటెను

ఆహా! మహాత్ములకు దుష్కరమైన కార్యము గలదా"!

ఇచ్చట ఆంజనేయుడు సముద్రమును దాటుట విశేషము.

మహాత్ములకు దుష్కరమైన కార్యముగలదా?.... సామాన్యము. కాని యిచ్చట ఆంజనేయుడు సామాన్య కోతికాడు. మహాత్ముడు గావున సముద్రమును దాటెను - అని విశేషమును సామాన్యముచే సమర్థించి చెప్పుటచే నిది అర్థాంతర న్యాసము.

# నాటకము

## నాటక లక్షణములు

కావ్యములు శ్రవ్యము, దృశ్యములని రెండు విధములు. శ్రవ్యమనగా కేవలము వినదగినవి.దృశ్యకావ్యములు ప్రదర్శన యోగ్యమైనవి.సంస్కృతమున ఒక అంకము మొదలుకొని పది అంకముల వరకు గల రూపకములు పదివిధములైనవి గలవు. ఈ దశ విధ రూపకములను గురించి ధనంజయుడు "దశ రూపక" మనెడి గ్రంథ మును రచించెను. సర్వలక్షణ సంపన్నమైన రూపకములు పది విధములు.

1. నాటకము 2. ప్రకరణము, 3. భాణము 4. ప్రహసనము 5. డిమము
6. వ్యాయోగము 7. సమవకారము 8. వీధి 9. అంకము 10. ఈహామృగము

దశ విధ రూపకములతో అన్ని విధముల ప్రథమగణ్యమైనది నాటకము. అందులకే సహృదయులు "కావ్యేషు నాటకం రమ్యమ్" అని నుడివిరి. నాటకమందు ధీరోదాత్తుడు నాయకుడుగా నుండవలయును. వీర, శృంగారములలో ఏదేని నొకటి ప్రధాన రసము కావలెను. అంకములు అయిదుకు తక్కువ గాకుండా, పదికి మించక యుండవలెను. ఇట్టి లక్షణములే కలిగి నాలుగు అంకములే యున్న దానిని **నాటిక** యందురు.

**ఇతి వృత్తము :** దశరూపకములందలి ఇతివృత్తము, ప్రఖ్యాతము, ఉత్పాద్యము మిశ్రమము అని మూడు విధములు.

**(ఎ) ప్రఖ్యాతము :** పురాణ, ఇతిహాసములయందుగాని, చరిత్రలందుగాని చెప్పబడియున్న కథ. దానిని నాటకోచితముగా, హృదయాకర్షముగా రచింప వలయును.

**(సి) ఉత్పాద్యము :** ఉత్పాద్యమనగా కేవల కల్పితమని అర్థము. అనగా ఎచ్చటనూ జరుగనిదానిని పుట్టించుట. కవి, తన నిరంతర జీవిత పరిశీలనములో

తనకు గోచరించిన నొక సత్యమును కావ్యముద్వారా తెలుపును.

**(బి) మిశ్రమము :** పురాణ, ఇతిహాసములలోగాని, చరిత్రలోగాని వ్రాయబడక పోయినను, లోకములో పరంపరగా చెప్పుకొనెడి కథలనుగూడ ప్రఖ్యాత వస్తువుగానే వ్యవహరింపవచ్చును. ప్రఖ్యాతమనగా లోకప్రఖ్యాతమనియేగాని, గ్రంథ ప్రఖ్యాతమని గాదు. కావున, ప్రసిద్ధమైన యిట్టి కథలలో నాటకకర్త తాను ఊహించి కల్పించిన కథ కొంత చేర్చినచో ఆ వస్తువు మిశ్రమమనబడును.

## నాంది :

మనము ఒక మహాకార్యము సంకల్పించినపుడు, దాని నిర్విఘ్న పరిసమాప్తికై ప్రారంభమున మంగళాచరణపూర్వకమైన దేవతా పూజాదికమును నిర్వహించెదము. ఆ సంప్రదాయమునుబట్టే మన పూర్వులు నాటకప్రదర్శనమును ఒక పవిత్ర కర్మగా నెంచి, నాట్యరంగమును సంగీత సాహిత్య నాట్యకళా సరస్వతిగా భావించిరి. ఆ ప్రదర్శనకార్యము నిర్విఘ్నముగా, సభారంజకముగా నెరవేరవలెననెడి ఆశతో నేపథ్యాంతరమున పూజాపురస్కారాది కర్మవిశేషమును నిర్వహింతురు. దీనికి **"పూర్వరంగ"** మనిపేరు. ఈ పూర్వరంగము **క్రియారూపము, వాగ్రూపము** అని రెండు విధములు. క్రియారూపమైన మంగళాంసనము నేపథ్యమున జరుగును. వాగ్రూపమైన మంగళాచరణ శ్లోకము సభాసమక్షమున రంగముమీద పఠింపబడును.

"నందయతి ఇతి నాందీ" (ఆనందింపజేయునది) అని నిర్వచనము. ప్రార్థనచేత దేవతలకు, నాటకప్రదర్శనచేత ప్రజలకు ఆనందము గలుగజేయునది గావున నాంది.

నాందీశ్లోకములోగాని లేక పద్యములోగాని దేవతలు, బ్రాహ్మణులు, రాజులు మొదలగువారిని స్తుతించవలెను. ఇందులో ఆశీస్సుగాని, నమస్కారము, మంగళ కరమైన శబ్దాలు, నాటక కథా సూచనలుండవలయును. నాంది పద్యములో మొత్తము ఎనిమి దిగాని, పంద్రెండుగాని, పద్దెనిమిదిగాని, ఇరవైరెండు పదములుండవలెను.

## ప్రస్తావన :

"రంగప్రసాదనాద్యంబు వస్త్వాది సూచనాంతంబు ప్రస్తావన."

పూర్వరంగమును నిర్వర్తించే మొదటి సూత్రధారుడు నాందిని పఠించి నిష్క్ర మించగానే రెండవ సూత్రధారుడు రంగస్థలముమీదికి ప్రవేశించును. ఆ

రంగస్థలమును రంజింపచేయుట మొదలుగా, కథా వస్తువుయొక్క ప్రారంభమును సూచించుటవరకు జరుగు కార్యక్రమమునకు **"ప్రస్తావన"** అనిపేరు. దీనికే **"ఆముఖము, స్థాపన"** అని పేర్లు గలవు. ఈ సూత్రధారుడు నటితోగాని, విదూషకునితోగాని కలిసి నాటకకర్తను గురించి, వస్తువును గురించి, పాత్రలను గురించి చిత్రోక్తులతో సంభాషణ గావించును. ఇది నాటకమునకు ఉపోద్ఘాతము వంటిది. ప్రస్తావనలో మూడు భేదములున్నవి. అవి కథోద్ఘాతం, ప్రవృత్తకం, ప్రయోగాతిశయము.

**(ఎ) కథోద్ఘాతం :** సూత్రధారుని మాటలలో నాటక కథతో సంబంధమున్న వాక్యముగాని, అర్థముగాని ఆధారముగా జేసికొని పాత్ర ప్రవేశించుట కథోద్ఘాతం.

**(బి) ప్రవృత్తకం :** ప్రస్తావనలోని ఋతువర్ణన లక్షణాలతో, గుణగణాలతో సూచింపబడిన పాత్ర ప్రవేశించుట ప్రవృత్తకం.

**(సి) ప్రయోగాతిశయం :** 'అదిగో, అతడే, అదే' మొదలైన పదములచేత సూత్రధారుడు నిర్దేశిస్తే, అతని మాటలననుసరించి పాత్ర ప్రవేశించుట ప్రయోగాతిశయము.

**అంకము :**

నాటకములోని అధ్యాయమునకు 'అంకము' అనిపేరు. నాటకములో అయిదు నుండి పది అంకముల వరకు నుండవచ్చును. కథ ఎంత దీర్ఘకాల ప్రవృత్తమైనను, ఒకటి, రెండు రోజులలో జరిగినదిగా నుండవలయును. పాత్రల సంఖ్య పరిమితిగా నుండవలయును. ప్రతి కథకును ఆది, మధ్య, అంతము అనెడి మూడు దశలుండును. వీనినే బీజ, బిందు, కార్యములని చెప్పబడును. కావున నిందలి బీజానుగుణముగా, బిందు కార్యపురస్సరముగా నుండవలయును. అంకములన్నింటియందును ప్రదర్శనీయములైన కథాభాగమే యుండవలయును. ప్రదర్శింపరానివి, ప్రదర్శింప వీలుగాని (యుద్ధము, స్నానము, భోజనము మొదలగు) ఘట్టములను అర్థోపక్షేప కములద్వారా సూచింతురు.

## అర్థోపక్షేపకములు

నాటక కర్త స్వీకరించిన యితివృత్తమంతయు ప్రదర్శనీయముగాదు. ప్రదర్శించు విధానము ననుసరించి నాటక కథా వస్తువు రెండు విధములు. దృశ్యాశ్రవ్యం, సూచ్యం. ఉదాత్తమైన, రసభావసమన్వితమైన, ప్రదర్శనా యోగ్యమైన కథావస్తువును ఆయా పాత్రలచేత అంకములలో, రంగములలో ప్రదర్శించెదరు. ఆ

విధముగా కాక రంగస్థలముమీద ప్రదర్శనార్హములుగాని, అయోగ్యములు, అసంభావ్యములు, అనావశ్యకములైన వానిని సూచించెదరు. ఆ వస్తువునకే "సూచ్యం" అని పేరు. ఈ సూచ్య వస్తువును సూచింపదగిన విధానములు అయిదు. అవి విష్కంభం, ప్రవేశకం, చూళిక, అంకాస్య, అంకావతారములు. వీటినే అర్థోపక్షేపకములందురు.

**విష్కంభము** : "భూత భావి కథాంశ జ్ఞాపకంబు
సంక్షేపార్థంబు, మధ్యమ పాత్ర
ప్రయోజితంబు విష్కంభం"

జరిగిన, జరుగనున్న కథాంశాలను క్లుప్తముగా మధ్యమ పాత్రలచేత ప్రయోగించిన అది "విష్కంభము" దీనిలో రెండు భేదాలున్నవి. ఒకరుగాని, ఇద్దరుగాని మధ్యమ పాత్రలు ప్రయోగించిన అది "శుద్ధ విష్కంభము"

ఒక మధ్యమపాత్ర ఒక అథమపాత్ర కలిసి ప్రయోగించిన అది మిశ్రమ లేక సంకీర్ణ విష్కంభము.

**ప్రవేశకము** : "నీచపాత్రప్రయుక్తము ప్రవేశకము"

విష్కంభములోవలె జరిగిన, జరుగనున్న కథాంశాలను ఒకరిద్దరు నీచ పాత్రలచేత చెప్పించినచో అది "ప్రవేశక"మందురు. ప్రవేశకము ప్రథమాంకారంభమున నుండరాదు.

**చూళిక** : "నేపథ్యపాత్రసూచితము చూళిక"

తెరవెనుకనున్న పాత్ర చేసే అర్థసూచన "చూళిక" అందురు. ఆ మాటలను ప్రేక్షకులు విని కథకు సమన్వయ పరచుకొందురు.

**అంకాస్యము** : "అంకాంత పాత్ర కృతంబగు ఉత్తరాంక
అర్థసూచనము అంకాస్యం"

ఒక అంకము చివర వచ్చిన పాత్రలు తరువాత అంకము ప్రారంభములోని కథను సూచించినచో అది అంకాస్యమగును. ఈ సూచన జరుగబోవు కథ గురించినదేగాని జరిగిన కథనుగురించినది కాదు.

**అంకావతారము** : "పూర్వాంక అవిచ్ఛిన్న ఉత్తరాంక
అర్థ సూచనము అంకావతారం"

ఒక అంకము చివర ప్రవేశించిన పాత్ర పూర్వాంక కథతో విడిపోని విధముగా ఉత్తరాంక కథను సూచించినచో అది అంకావతారమగును.

## పంచ సంధులు

నాటక కర్త రచనకు పూర్వము తాను స్వీకరించిన వస్తువు క్రమ వికాస పరిణామము పొందుటకై దానిని ఏ విధముగా సన్నివేశపరుపవలెనో, ఆ విధము నూహించి ఏర్పరచుకొనిన కథాప్రణాళికా భాగములను **"అర్థ ప్రకృతు"**లందురు. (Elements of plot) ఆ అర్థప్రకృతులలో ఏ భాగమునందు, ఏ కార్యదశకు నిబంధింపవలెనో నిర్ణయించుకొని కవి, ఆ ప్రకారము కథను నడుపును. ఈ దశలకు **"కార్యావస్థలు"** అని పేరు. (Stages in action) అర్థప్రకృతులు, కార్యావస్థలు పరస్పర విరోధము లేకుండా సమన్వయమగు సందర్భములకు సంధులనిపేరు. అవి అయిదు రకములు. ముఖసంధి, ప్రతిముఖసంధి, గర్భసంధి, అవమర్శసంధి, నిర్వహణ సంధి.

బీజము, బిందువు, పతాక, ప్రకరి, కార్యము అనునవి అర్థప్రకృతులు.

ప్రారంభము, ప్రయత్నము, పాప్త్యాశ, నియతాప్తి, ఫలాగమము అనునవి కార్యావస్థలు.

పై అయిదు అర్థప్రకృతులు, అవస్థలతో సంవదించెడి క్రమవే పంచసంధులగును.

(ఎ) కథానాయకుని ప్రయత్నము ఆరంభము గావున అది ముఖసంధి.

(బి) దృఢప్రయత్నము ప్రతిముఖసంధి.

(సి) ఒక స్థాయిలో ఆశ నిరాశామయమగును. కాని, మరలా నిరాశ తొలగి ఆశ కలుగును. ఈ ప్రాప్త్యాశను గర్భసంధి అందురు.

(సి) నిరాశ నశించి, ఫలప్రాప్తి నిశ్చయమగు నియతాప్తిని అవమర్శసంధి యందురు.

(ఇ) ఉదిష్ట కార్యఫలసిద్ధి. నిర్వహణసంధి యందురు.

| | | | | |
|---|---|---|---|---|
| బీజము | - | ప్రారంభము | - | ముఖసంధి |
| బిందువు | - | ప్రయత్నము | - | ప్రతిముఖసంధి |
| పతాక | - | ప్రాప్త్యాశ | - | గర్భసంధి |
| ప్రకరి | - | నియతాప్తి | - | అవమర్శసంధి |
| కార్యము | - | ఫలాగమము | - | నిర్వహణసంధి |

**భరత వాక్యము**

భరతులు అంటే నటులు. నాటకము చివర రాముడు మొదలైన పాత్రలను ధరించిన నటులు ఆయా పాత్రలుగా గాక కేవలం నటులుగా పలికే మంగళశాసనము.

కాని, కొన్ని నాటకములలో దివ్యులు, రాజర్షులు, పురోహితులు వంటి మహా పురుషులు కూడా భరతవాక్యము పలుకుతారు.

సాధారణముగా మన ప్రాచీన కావ్యాలన్నీ మంగళాంతాలు. "మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతాని" అన్నది మన ప్రాచీన మహాకావ్య కావ్యాలలో కవులు, "లోకాస్సమస్తాస్సుఖినోభవంతు" అన్నట్లుగా భరతకావ్యము పలికించబడును.

**నామకరణము**

రూపకమునకు పేరుబెట్టుటకును కొన్ని నియమములు గలవు. నాయికా నాయకుల పేర్లతోగాని, లేదా ఇతివృత్తమునందలి ప్రధానాంశమును సూచించినట్లుగా గాని రూపకమునకు పేరు పెట్టవలయును. ప్రతిజ్ఞా యౌగంధరాయణమందు యౌగంధరాయణుడు నాయకుడు. అతడు తాను చేసిన ప్రతిజ్ఞను నెరవేర్చుకొనెను. కనుక ఈ నాటకమునకు "ప్రతిజ్ఞా యౌగంధరాయణము" అని పేరు పెట్టబడినది.

**నాయకుడు**

ధీరోదాత్తుడు, ధీరోద్ధత్తుడు, ధీరలలితుడు, ధీరశాంతుడు అని నాయకులు నలుగురు.

**1. ధీరోదాత్తుడు** : ధీరుడు, గంభీరుడు, ఉదారుడు, వినయవంతుడు, శాంతుడు, కార్యశూరుడైన నాయకుడు ధీరోదాత్తుడగును. ఉదా॥ శ్రీరాముడు.

**2. ధీరోద్ధత్తుడు** : శౌర్యాదులచే గర్వించినవాడు అసూయపరుడు. చంచల స్వభావము గలవాడు. ఆత్మస్తుతి పరాయణుడు ధీరోద్ధతుడగును. ఉదా॥ రావణుడు.

**3. ధీరలలితుడు** : రాజ్యము సుస్థిరమొనర్చి, కార్యకలాపములు సచి వాయత్తమొనర్చి, స్వీయ యోగక్షేమాదులు వారు చూచుచుండగా నిశ్చింతుడైనాడు, విచారము లేనివాడు. సుకుమార సత్వాచార్యుడైన రాజు ధీరలలితుడగును ఉదా॥ శూద్రకమహారాజు.

4. ధీరశాంతుడు : వినయ ఔదార్యాది, నాయక సామాన్యగుణములు గలవాడు. బ్రాహ్మణ, వైశ్యసచివులతో నొకడుగా నుండవలయును. ప్రకరణమున నాయకుడితడే.

శాంతము ప్రధానగుణముగా గలవాడు ధీరశాంతుడగును. ఉదా॥ చారుదత్తుడు.

**రసములు**

"శృంగారము, వీరము, హాస్యము, కరుణము, భీభత్సం, భయానకం, రౌద్రం, అద్భుతం, శాంతము'' అనునవి నవరసములు.

ఈ నవరసాలలో శృంగారముగాని, వీరముగాని నాటకములో ప్రధానరసముగా నుండవలయును. దీనికి "అంగిరస'' మని పేరు. తక్కిన రసములు సందర్భాన్ని బట్టి "అంగరసములు''గా పోషింపబడవలయును.

## పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు

*పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు **1897** సం॥న నెల్లూరు జిల్లాలో గల సంగం గ్రామంలో జన్మించిరి. ఇతనికి **కవిశేఖర, మహోపాధ్యాయ, విద్యాలంకార** అను బిరుదములు కలవు. బాల్యమునందే శబ్దశాస్త్రములో నిష్ణాతులై అష్టావధాన, శతావధానముల నొనరించిరి. ఆంధ్రకాదంబరి, ఆత్మసమర్పణము, కైకేయీ సౌశీల్యము, శ్రీ పురుషోత్తమ వైభవము, కావ్యాలోకము మొదలగు గ్రంథములు వీరి రచనలలో పేర్కొనదగినవి.*

*సాంప్రదాయ కవితామార్గాన్ని అనుసరించిన విద్వత్కవి. సంస్కృతంలో కూలంకష పాండిత్యం సంపాదించిరి. గుంటూరు టౌన్ హైస్కూలులో సంస్కృత పండితులుగా పనిచేశారు. 'భారతి' మాసపత్రికలో పద్యాలు, వ్యాసాలు వ్రాసిరి. పాండిత్యబలం, కవితాశక్తి గల వ్యక్తిగా సమకాలికులలో మన్నన పొందారు. మహా భారతానికి, ఉద్యోగపర్వం వరకు 'టిప్పణి' వ్రాసిరి.*

*ప్రస్తుత నాటకము భాసవిరచితమైన సంస్కృత నాటకమైన ప్రతిజ్ఞా యౌగంధరాయణమునకు ఆంధ్రానువాదము.*

## ఈ నాటికయందు వచ్చు పాత్రములు

| | | |
|---|---|---|
| యౌగంధరాయణుడు | —— | వత్సరాజుగారి ప్రధానమంత్రి |
| సాలకుడు, నిర్ముండకుడు | —— | యౌగంధరాయణుని చారపురుషులు |
| హంసకుడు | —— | వత్సరాజునకు నిత్యసన్నిహితుడగు పరిచారకుడు |
| బ్రాహ్మణుడు | —— | యౌగంధరాయణుని మిత్రుడు |
| కాంచుకీయుడు | —— | మహాసేన మహారాజుగారి యంతఃపుర పరిచారకుడగు బాదరాయణుడు |
| రాజు | —— | మహాసేన మహారాజు, వాసవదత్త తండ్రియగు ప్రద్యోతుడు |
| విదూషకుడు | —— | వత్సరాజుగారి ప్రియవయస్యుడు వసంతకుడు |
| ఉన్మత్తకుడు | —— | పిచ్చివేషముతోనున్న యౌగంధరాయణుడు |
| శ్రమణకుడు | —— | బౌద్ధసన్యాసి వేషముతోనున్న వత్సరాజు మంత్రి |
| రుమణ్వంతుడు | —— | వత్సరాజు సచివుడు - శ్రమణక వేషధారి |
| భటుడు | —— | మహాసేన భృత్యుడు |
| గాత్రసేవకుడు | —— | వాసవదత్తావాహనమగు భద్రవతికి బరిచారకుడు |
| సాధారణభటులు (ఇరువురు) | —— | మహాసేనుని భటులు |
| భరతరోహకుడు | —— | మహాసేనుని ముఖ్యమంత్రి |
| శాలంకాయనుడు | —— | మహాసేనుని సచివుడు |
| విజయ | —— | వత్సరాజు గృహమున ద్వారపాలక (ప్రతీహారి) |
| దేవి | —— | మహాసేనుని పట్టపురాణియగు అంగారవతి. |

శ్రీ హయగ్రీవాయ నమః

# ప్రతిజ్ఞా యౌగంధరాయణము

## ప్రథమాంకము

సూత్రధారుడు :

గీ॥ సేమ మెల్లర కిడు మహాసేనుఁ డధిక
బలుఁడు వాసవదత్తోరుభద్రుఁ డెపుడు
వత్సరాజాభిధానుఁ డవార్యశక్తి
రాజితుం డగుయౌగంధరాయణుండు ॥

(నడచి తెరవైపు చూచి) ఆర్యులారా ! ఇటువచ్చెదవా ?

(ప్రవేశించి)

నటి : ఆర్యా! ఏమి సెలవు ?

సూత్ర : నటీ ! ఏదే నొక్కదానింగూర్చి గాన మొనర్పుము. నీ గానమ్ముచే రంగస్థలంబు ప్రసన్న మగును. మేమును నాటకప్రయోగంబున కుపక్రమింతుము. నటీ ! ఆలోచించుచుంటివేమి ?

నటి : ఆర్యా? బంధుకులంబున నేదో యస్వస్థత వాటిల్లినట్లు నేఁడు కలఁగంటిని. కానఁ గుశల మెఱింగి వచ్చుటకు నెవరినైనఁ బంపఁ గోరెద.

సూత్ర : అట్లే యొనర్చెదను.

గీ॥ పురుషు నొక్కనిఁ బంపుదుఁ బూవుఁబోఁడి !
అఖిల మెఱఁగినవాని హితాభిలాషి

(తెరలో)

సాలకా! సిద్ధముగా నుంటివా ?

సూత్ర :

అఖిల మెఱిఁగినవాని హితాభిలాషి
నదిగొ యౌగధరాయణుఁ డంపునట్లు

(ఇరువురు నిష్క్రమింతురు)

**ఇదిస్థాపన.**

(పిమ్మట సాలకునితో యౌగంధరాయణుఁడు ప్రవేశించును)

యౌగం : సాలకా ! సిద్ధముగానుంటివా ?

సాలకుఁడు : ఆర్యా ! సిద్ధముగా నుంటిని.

యౌగం : చాల దూరము పోవలయుఁ జుమా.

సాల : మహత్తరం బగుస్నేహంబుతోఁగదా యేలినవారికడ సేవ చేయు చున్నాను.

యౌగం : ఔను. అట్టిస్నేహంబుగల బలశాలియేగదా పోఁగలఁడు. ఏల యన.

గీ॥ ఇడ వలయు దుష్కరపుఁజెయ్ది నెపుడు స్నేహ
భరింతులందునొ సత్కార నిరతులందొ
వారిసామర్థ్యమును దైవవశముచేతఁ
జెడినఁ జెడు లేక యనుకూలపడినఁ బడును.

అట్లేని నర్మదానదీతీరసమీపవర్తియగు వేణువనంబు నంటి మూఁడరణ్యంబులు గలవు. వానిలో నాగవనంబునకు రేపు మహారాజుగారు వెడలుదురు. ఈలోపలనే నీవు శ్రీవారిని సందర్శింప వలయుఁజుమా.

సాల : ఆర్యా! మహారాజుగారికి మనవి చేయఁదగు విషయంబులతోడి లేఖయేగదా నన్నుఁ బోనీయకున్నది.

యౌగం : విజయా!

(ప్రవేశించి)

విజయ : ఆర్యా! ఏమి సెలవు.

యౌగం : లేఖను రక్షాసూత్రమును ద్వరితమ్ముగాఁ గొనిరమ్ము.

విజయ : చిత్తము, (నిష్క్రమించును)

యౌగం : సాలకా! నీవీమార్గము నెన్నఁడైనం జూచియుంటివా ?

సాల : లేదు. వినియుంటిని.

యౌగం : ఇదియు మేధావిలక్షణంబె. ఓయీ! ప్రద్యోతుఁడు వనగజప్రచ్ఛాదితశరీరం బగునీలగజంబు నొండొకదానిఁ గల్పించి మనప్రభువుగారిని వంచింపఁ దలంచుచున్నాఁడని నేఁడు విన వచ్చినది. మహారాజుగారిబుద్ధి యీపాటికే మోసమునఁ బడియుండ దనితలంతును. ఆహా! ప్రద్యోతునకు మా వత్సరాజువలన నెంత భయము! దీనివలన నాతని యక్షౌహిణులకు వత్సరాజు సైన్యముతోఁ బోరఁ జాలమి తెల్లమగును.

(ప్రవేశించి)

విజయ : ఇదిగో లేఖ. రక్షాసూత్రము సర్వాంతః పురజనహస్తంబులనుండి తొందరింపఁబడుచుండె నని రాజమాతగారు సెలవిచ్చిరి.

యౌగం : విజయా! సర్వాంతఃపురవధూకరస్పృష్టంబు గాని వేరొండు గాని రక్షాసూత్రంబు వేగిర మొసంగు మని రాజమాతగారికి మనవి చేయుము.

విజయ : ఆర్యా! చిత్తము. (నిష్క్రమించును)

(ప్రవేశించి)

నిర్ము : ఆర్యా! సుఖ మగుఁ గాక.

యౌగం : ఏమీ. నిర్ముండకుఁడా ?

నిర్ముం : ఆర్యా! మహారాజుగారిసన్నిహిత పరిచారకుం డగు హంసకుఁడు వచ్చియున్నాఁడు.

యౌగం : ఏమీ! హంసకుఁ డొక్కఁడే వచ్చె ననియా ? సాలకా! ఒకముహూర్తంబు విశ్రమింపుము. అవసరమగునేనిఁ ద్వరితమ్ముగా నైనఁ బోవచ్చును లేదేని విశ్రాంతినైన నందవచ్చును.

సాల : ఆర్యా! చిత్తము. (నిష్క్రమించును)

యౌగం : నిర్ముండకా! హంసకుని దోడితెమ్ము.

నిర్ము : ఆర్యా! చిత్తము. (నిష్క్రమించును)

యౌగం : ప్రభువుగారితో నవినాకృతుం డగుహంసకుఁ డిప్పుడేకాకియై వచ్చెనని వినుటచే నాచిత్త మెంతయుఁ దత్తఱపడుచున్నది. ఏల యన

గీ॥ కబురులం దెల్ప బందుగల్ కాచి యుండ
నరిగి పరదేశ మిలు సేరునరున కట్ల
ప్రియమె విందునొ యకట ! యప్రియమె విందు
నో గదా యని శంకింప సాఁగె మనసు.

(పిదప హంసకుఁడు నిర్ముండకుఁడును బ్రవేశింతురు)

నిర్ముం : ఆర్యా! ఇటు - ఇటు

హంస : ఆర్యయౌగంధయణు లెచ్చట నున్నా రెచ్చట నున్నారు?

నిర్ముం : వీరే యార్యయౌగంధరాయణులు. సమీపింపుఁడు.

(నిష్క్రమించును)

హంస : (సమీపించి) ఆర్యునకు సుఖ మగుగాక.

యౌగం : హంసకా ! మహారాజుగారునాగవనంబునకుఁ బోలేదు కదా.

హంస : ఆర్యా! మహారాజుగారు నిన్ననే నాగవనంబునకుఁ బోయినారు.

యౌగం : అయ్యో! నిష్ఫలంబుగదా యిఁక సాలకప్రేషణము. వంచితుల మైతిమి. ఇఁక నేమైనఁ దిరిగియాశ కలదా? లేక యిప్పుడే ప్రాణములఁ బాయ వచ్చునా ?

హంస : రాజుగా రింతవఱకు జీవించియే యున్నారు.

యౌగం : రాజుగా రింతవఱకు జీవించియే యున్నారనుటచే నేలిన వారి కొకపాటి యాపద గల్గినట్లు చెప్పినట్లయ్యె. మహారాజుగారు పట్టుబడిరా? ఏమి?

హంస : ఆర్యులు చక్కగా నూహించితిరి. అట్లే పట్టుబడిరి.

యౌగం : ఎట్లు. మహారాజుగారు పట్టుబడిరా? ఆహా! ఎంత దుష్కరకృత్యం బొనర్చిరి. నేఁటికిఁ బ్రద్యోతునిభాగ్యము ఫలించినది. నేఁటినుండియు వత్సరాజామాత్యుల కసమర్థతయు నపకీర్తియుఁ బ్రకటితంబులగు. రాఁబోవు ననర్థంబులకు ముందే ప్రతీకారము జింతించునారుమణ్వంతుఁడప్పుడెచ్చటి కేఁగెను ? ఆయాశ్వికసైన్యమప్పు డెందుండెను?

హంస : మహారాజుగారు సమగ్రయోధబలపరివారులేని ఈయనర్థము మూడకయే పోయెడిది.

యౌగం : ఏమీ! మహారాజుగారు సమగ్రయోధపరీతులు కారా?

హంస : ఆర్యా! చిత్తగింపుఁడు.

యౌగం : మార్గశ్రాంతిచే నీవును బడలియున్నావు. కూర్చుండుము.

హంస : ఆర్యా! చిత్తము. (కూర్చుండి)

ఆర్యా! చిత్తగింపుఁడు. మహారాజుగారు హయసుఖదాయక మీకాల మని కించిదవశిష్ట యగు రేయియందే యిసుక రేవుదారిగ నర్మదానది దాఁటి వేణువనంబున నిజకళత్రంబునుంచి యాతపత్రమాత్ర పరిచ్ఛదుండై గజమృగయార్హంబగుబలంబుతో మృగంబుల హర్షారావంబులు పిక్కటిల్లు వీథినుండి నాగవనంబునకుఁ బ్రయాణ మైరి.

యౌగం : తరువాత.... తరువాత.

హంస : తరువాత సూర్యుఁ డమ్ము వేటుదూరంబున నుండఁ గొన్ని యోజనంబులు నడచి పోవ మదగంధీర పర్వతమునకుఁ గ్రోశమీవలఁ దటాకపంకోత్థితమై యర్థనిర్మితమనశ్శిలా లేపంబుంబలె భీమదర్శనం బగు గజయూథంబు మాదృష్టిపథంబునంబడియె.

యౌగం : తరువాత

హంస : తరువాత మనసేనలు దదేకదృష్టితోఁ జూచుచుండ నాగజయూథంబు భయం బుప్పతిల్ల నొక్కెడ గుమిగూడె - అప్పుడీయనర్థంబునకు మూలకంద మగునొకభటుండు మహారాజుగారిచెంతకు వచ్చెను.

యౌగం : ఆఁపుము - ఆఁపుము, ఇచ్చటికిఁగ్రోశమాత్రదూరంబున మల్లికాలతాచ్ఛాదిత శరీరంబుతో నఖదంతశూన్యంబుగ ఏకనీలంబగు నొకయేనుఁగు నాకగుపించె నని చెప్ప లేదా?

హంస : ఏమీ! ఆర్యున కంతయు నవగతమే. ఇంత జాగ్రదవస్థయందున్నను ఇట్టియనర్థ ముప్పతిల్లినది గదా.

యౌగం : ఓయీ! జాగరూకునికంటెను విధియే బలవత్తరమని యెఱుంగుము. తరువాత

హంస : తరువాతఁ బ్రభువుగారు నూఱు బంగారునాణెంబు లాన్వృశంసునకుఁ బసదనం బిచ్చి యందఱు విననిట్లనియె. హస్తిశిక్షయందు నీలకు వలయతను వను గజసార్వభౌమ మొండు కల దని తొల్లి చదివి యుంటిని. కావున మీరెల్ల రీగజయూథంబున నప్రమత్తులరై మెలంగునది. నేను వీణామాత్ర ద్వితీయుఁడ నై యాగజేంద్రముం బట్టితెచ్చెదను. అని.

యౌగం : అప్పుడు రుమణ్వంతుఁడు స్వామి నుపేక్షించెనా ?

హంస : లేదు. లేదు. ఏలినవారిని బతిమాలుకొని రుమణ్వదమాత్యుఁ డిట్లు మనవి చేసెను.

మహారాజా! ఐరావణాది దిగ్గజ గ్రహణంబును దేవర వారి పట్ల నుపపన్నంబ. కాని రక్షణ కశక్యంబు లగుటంజేసి దేశాంతరంబులు సన్నిహితానర్థంబులై యుండును. అందును నిర్లజ్జులు దుష్కులీను లగుననార్యులు నివసింతురు. కావున గజయూథయోగ్యపదాతివర్గంబుతోనే గాక సమగ్రసైన్యంబుతో మన మందఱ మట కేగుదమే కాని దేవర వారొంటరిగ నేగుట సమంజసము కాదు.

యౌగం : రుమణ్వంతుఁడు మహాజనసమక్షమునందే మహారాజుగారితో నిట్లు మనవి చేసెనా ? అట్లేని యాతనిప్రభు భక్తినిర్దుష్ట మనియే తలంతును. తరువాత - తరువాత.

హంస : తరువాత మహారాజుగారు తన్నట్లు వారించెడురుమణ్వంతుని దనప్రాణంబులపై నొట్టిడుకొని నివారించి నీలవలాహకమను నేనుంగు డిగి సుందర పాటలనామకహయరత్న మధిరోహించి యంబరమణి సభోమధ్యంబు చేరక మున్న యిరువదిమంది భటులు వెంట రాఁ బ్రయాణ మైరి.

యౌగం : విజయంబునకా ? - ఛీ, గజగ్రహణకుతూహలంబునఁ బ్రద్యోతు నివంచనోద్యమంబు దలంపఁ డాయె. తరువాత

హంస : తరువాత ద్విగుణమాత్రంబుగ మార్గంబు గమించి యొక్కచో సాలవృక్షచ్ఛాయయందు వృక్షసావర్ణ్యంబున దేహనీలిమంబు ప్రత్యేకము కనుఁగొన రాక తళతళ మెఱయుచు నశరీరనిక్షిప్తంబులం బోలెఁ బొలుచు చతుర్దంతములతో నాదివ్యవారణప్రతికృతి ధనుశ్శత ప్రమాణ దూరంబున మా కగుపించె.

యౌగం : హంసకా! అది దివ్యవారణ ప్రతికృతి గాదు మా సంతాపాకృతి యని నుడువుము. తరువాత

హంస : తరువాత మహారాజుగారు గుఱ్ఱంబు డిగి దేవతాప్రణామం బొనర్చి వీణఁ గైకొనిరి. అంత నాదివ్యవారణప్రతికృతికి వెనుక గజనిశ్చయంబునం బోలె నొకకంఠీరవంబు గానిపించె.

యౌగం : సింహమా ? తరువాత

హంస : తరువాత సింహాన్వేషణార్థ మేమందరిగితిమి. అప్పుడు మహా మాత్రప్రధనాయుధీయులతో నిండియున్న యాకృత్రిమవారణంబు మెల్ల మెల్లగా మహీవల్లభు నెదుర్కొనియె.

యౌగం : తరువాత - తరువాత.

హంస : తరువాత మనప్రభువుగారు తనకుఁ దోడుగా వచ్చిన సత్కులప్రసూతు

లగుయోధవరుల నామగోత్రపురస్సరముగాఁ బేర్కొని యోదార్చి యిది యంతయుఁ బ్రద్యోతుని కపటప్రయోగము. మీ రెల్లరు నన్ను వెంబడింపుఁడు. నేనిప్పుడే యీప్రద్యోతునివిషమం బగుఛలప్రయోగంబు నస్మత్పరాక్రమంబుచే సమంబొనర్చు నని నుడివి వెంటనే పరబలంబుఁ బ్రవేశించిరి.

యౌగం : పరబలంబును బ్రవేశించెనా ఏమి చేయును?

గీ. వైరివంచనచే సిగ్గు వడియె, మాని,
సత్వసముపేతుఁ డెంతయు శౌర్యశాలి
ఒకడు శత్రులసన్నిధి నుండె; నింక
నెదిరిబలమును జొఱక తాఁ డేమి సేయు ?

హంస : ఆత్మాభిప్రాయానువ ర్తి యగు సుందరపాటలం బను నా హయరత్నంబుపైఁ గ్రీడించువాఁడుం బోలెఁ దనమసంబున నున్నంతకన్న మిన్నగఁ బరబలంబు నుఱుమాడుచు వైరిబలంబు బహుళం బగుటం జేసి యత్యంతము కాయక్లేశమందుచు విషణ్ణనష్టసకలపరివారుండై యేకాకి నగునాచేకాదు - తనచేతనే తాను రక్షించుకొనఁ బడుచుఁ బగ లంతయు నెడతెగక యాల మొనరించుటంజేసి డస్సి వైరిప్రహారంబులచే హయంబు గూల సూర్యాస్తమయసమయంబున మనరాజుగారు మూర్ఛిల్లిరి.

యౌగం : ఏమీ! మనరాజుగారు మూర్ఛిల్లిరా ? తరువాత

హంస : తరువాత సమీపారణ్య ప్రదేశములనుండి యేజాతియో తెలియని కొన్ని కర్కశవల్లరుల శ క్తికొలంది పెకలించుకొని వచ్చి శరీరబంధనమున సామాన్యమానవునట్లు మహారాజుగారు పరిభవింపఁబడిరి.

యౌగం : ఏమీ! మహారాజుగారు పరిభవింపఁబడిరా ? హంసకా! తరువాత నెప్పటికి మహారాజుగారికిఁ దెలివి వచ్చినది.

హంస : ఆర్యా! ఆపాపాత్ముల పని పూర్తియగునప్పటికి.

యౌగం : అట్లేని అదృష్టంబుచే మహారాజుగారిశరీరమే పరిభూతమయ్యెఁ గాని తేజంబు గాదు. తరువాత

హంస : మహారాజుగారికి స్మృతి వచ్చుటఁ బరికించియపాపు లీతఁడే మాయన్నం బన్న మొనరించె, కటకటా! ఈతఁడే మాతండ్రి నుసుఱులం బాయంజేసె, అక్కటా! ఇతఁడే నాకొడుకుఁ జక్కాడె, అయ్యో! ఈతఁడే నామిత్రుదుర్గతిపాత్రు నొనర్చె నన వేఱొకతీరునఁ బ్రభువుగారి విక్రమంబునే యభివర్ణించుచు నొక్కమాఱుగా మనతేని నెదుర్కొనిరి.

యౌగం : తరువాత

హంస : నాభయం బటులుండ రెండవభయం బొండుతారసిల్లె. ఒండొరుల ప్రోత్సాహంబున వారిలో నొకఁడొక యకార్యంబున కొడిగట్టి మనతేని దక్షిణాభిముఖునొనర్చి కదనవ్యాపారంబునఁ బెదరినతలవెండ్రుకల నిరుపచారంబుగాఁ బ్రోవు చేసి పట్టుకొని కేలం గరవాలంబుఁ దాలిచి దానికి గొంతయుసి యొసంగుటకై వెనుకకుఁ గొంతదవ్వు పరుగెత్తెను.

యౌగం : హంసకా! ఈవృత్తాంతము కొంతసేపాపుము. అంతలో నేను తెప్ప ఱిల్లుదును.

హంస : తరువాత నానృశంసుఁడు రక్తప్రవాహపంకిలం బగు నమ్మహీతలంబునఁ దనవడిచేతనే కాళ్ళు తడఁబడ జాఱిపడి ప్రతిహతారంభుఁడై తనకత్తియ తనకు మిత్తిగాఁ బ్రాణంబులఁ బాసెను.

యౌగం : ఈపాపాత్ముఁడు ప్రాణంబులఁ బాసెనా? ఆహా!

గీ. పురనృపులచేత నాక్రమింపఁ బడ కుండ
ధర్మసాంకర్య మెంతమాత్రంబు లేక
పాలితం బయి పుడమి త న్నేలుధరణి
పాలుఁ బాలింపుచుండు నాపదలయందు.

హంస : తరువాత నేలినవారిచేఁ దొలుదొ ల్తనే, బల్లెపుఁబోటున మూర్ఛిల్లిన శాలంకాయనుం డనుమహాసేనామాత్యుఁ డప్పుడే తెలిసి 'వల దీసాహసకార్యంబు వల దీసాహసకార్యం' బని యఱచుచుఁ దత్ప్రదేశంబునకు విచ్చేసె.

యౌగం : తరువాత

హంస : అట్లు విచ్చేసినపదపడి అయ్యమాత్యుండు మనఱేనికిఁ దత్కాలదుర్లభం బగు ప్రణామంబు గావించి బంధములనుండి విడిపించెను.

యౌగం : మనప్రభువుగారిని బంధనిర్ముక్తుఁ గావించెనా? మేలు! శాలంకాయనా! మేలు! దురవస్థ శత్రు నేనియు మిత్రకార్యంబునకుఁ బురికొల్పును గదా. హంసకా! ఇప్పుడు నాహృదయంబు వ్యసనంబునుండి యించుక యూఱడిల్లినదివలె నున్నది. తరువాత నాసజ్జనుం డేమి చేసెను?

హంస : అంత నాప్రద్యోతసచివుండు సాదరంబుగఁ గొన్ని సాంత్వవచనంబు నూఱడించి దెబ్బలు గాఢముగాఁ దగిలియుండుటచే వాహనంబుపైఁ గూర్చుండఁజాలరని స్కంధశయనంబుపై మనరాజుగారి నుజ్జయినికిం గొనిపోయెను.

యౌగం : మనఱేని నుజ్జయినికిఁ గొనిపోయెనా! ఇదియే కదా ఆదినుండి నే శంకించుననర్థము.

గీ. అపుడె నాతలపోయుననర్థ మిది య
కోరి ప్రద్యోతుఁ డొందినకోర్కి యిది య
ధీరచిత్తుండు కాన నీదృశము లైన
కష్టముల నెట్లో జీవింపఁ గలిగె ఱేఁడు.

ఇటుపై

శా. ఏరీతిం గను మాప్రభుండు మును లెక్కే చేయఁ డాఱేని, నిం
కేరీతిన్ వినుఁ దత్కువాక్కులు సువాక్కే యెప్డు విన్వీనులన్
పోరే కల్గమి వ్యర్థ మౌరుష నెటుల్ పూనున్ మదిన్ ; నమ్రుఁ డౌఁ
గా రుద్ధుం, డొకవేళఁ జెందుతను సత్కారంబొ ధిక్కారమో.

(ప్రవేశించి)

ప్రతీ : ఆర్యా! ఇదిగో రక్షాసూత్రము.

యౌగం : విజయా! ఉంచుము.

ప్రతీ : రాజమాత కేమని విన్నవింపను?

యౌగం : ఈలాగని

ప్రతీ : ఈలాగనఁగా

యౌగం : ఇట్లు.

ప్రతీ : ఆర్యా! సెలవిండు సెలవిండు

యౌగం : (ఆత్మగతము) ఈవృత్తాంతము దాఁచ శక్యము గాదు. రాజమాత కీవార్తఁ దెలియఁ జేసెదను. (ప్రకాశము)

విజయా : మనస్సు గట్టిచేసికొనుము. (చెవిలో నేమో చెప్పును)

ప్రతీ : అయ్యో! అయ్యో!

యౌగం : నీవు విజయవు కదా. ధైర్యము వహింపుము.

ప్రతీ : ఇదిగో పోయెదను మందభాగ్యురాలను గదా

యౌగం : రాజమాతతో రాజుగారు బంధితు లై రని యొకేమాఱు విన్నవింపకు సుమా. స్నేహదుర్బలం బగుమాతృహృదయంబు నెట్లేని రక్షింపవలయు.

ప్రతీ : అట్లేని ఈవృత్తాంత మెట్లు విన్నవింప మందురు.

యౌగం : వినుము.

మ. తొలుదొల్తం బలుసందియంబులకు నుద్బోధంబుగా నెవ్వియో
పలుకం గా వలె యుద్ధదోషముల నాపై నామె సందిగ్ధ యై
తలపోయం దనపట్టి కయ్యశుభ మాత్మన్ దుఃఖ ముప్పొంగఁ గాఁ
గలరూపంబు తెఱంగు నేర్పుమెయి వక్కాణింప నౌ నత్తఱిన్.

ప్రతీ : గ్రహించింతిని. (నిష్క్రమించును)

యౌగం : హంసకా! నీ వపుడు స్వామితోఁ గూడ నేల పో వైతివి ?

హంస : దేవా! నే నప్పుడు మహారాజుగారిని వెంబడించి నాయాత్మను గృతార్థ మొనర్చుకొన నుద్యుక్తుండ నైతిని గాని శాలంకాయనుం డీవృత్తాంతమును గౌశాంబీనగరంబునఁదెలుప నన్నుఁ బంచెను.

యౌగం : శాలంకాయనుం డి ట్లేల చేయును లాభము లే దను నిరాశతో రాజుగారు పంప మానిన యీవృత్తాంతమును స్వామిప్రీతికై యిటఁ బంపఁ దలంచెనా?

లేక అనురక్తుండగుభటుండు రాజుకడ నుండుట యపాయ మని నిన్నుఁ బరిహరించుటకుఁ గా నిట్లు పన్నియుండునా?

హంస : అవును. నన్నుఁ బరిహరించుటకే యట్లు పన్నియుండును.

యౌగం : లేక - ఆశాలంకాయనుండు గర్వంబుచేఁ దనబుద్ధిసామర్థ్యమును గౌశాంబీజనులకుఁ జాట నెంచెనా? అదియుఁ గాదేని - తనయుద్యమంబు ఫలించె నని యి ట్లానందించుచున్నాఁడా? కానిమ్ము. హంసకా! నన్నుఁ గూర్చి మహారాజుగా రేమియుఁ జెప్పియుండ లేదా?

హంస : ఆర్యా! చెప్పియుండ కేమి. శాలంకాయనుం డట్లు కౌశాంబి కేఁగి యీవృత్తాంత మెఱింగింపు మని నన్నుఁ బంచిన పదపడి నేను ప్రయాణము కాఁబోవుచు నేలినవారికిఁ బ్రదక్షిణంబు గావింప నంతర్బాష్ప కలితలోచనంబులతో నాతో నేదియో యెక్కువగాఁ జెప్పనుంకించియు స్తంభితకంఠు లగుటచే మాట రాక కాఁబోలు మహారాజుగారు. హంసకా! పొమ్ము. యౌగంధ.....

యౌగం : హంసకా! నన్నుఁ బేరితో బిలుచుచుంటి నని సంశయింపకుము. నిశ్శంకము గాఁ జెప్పుము. ఇయ్యది స్వామివాక్యముగదా.

హంస : యౌగంధరాయణుఁ జూడుమనిరి.

యౌగం : ఉండుము. ఏ మనిరి? తక్కినమంత్రి మండలము నెల్లనటుంచి యౌగంధరాయణునే చూడు మనిరా?

హంస : దేవా! చిత్తము.

యౌగం : ఇట్టియిక్కట్టు కలుగక మున్నే తగుప్రతీకారము గావింపఁ జాలని యీయదూరదర్శిని - నిరర్థకముగా నింతకాలమునుండి రాజాన్న మారగించు నీనిరర్థకజీవముని - నిరుపయోగంబు గా నిన్నినాళ్ళనుండి రాచమన్న నలనందుచున్న యీవ్యర్థుని - నన్నుఁ జూడ వలయు నని రాజుగారు తలంచిరా?

హంస : చిత్తము.

యౌగం : అట్లేని మాఱురూపంబుతోడినన్ను స్వామి చూడఁగలఁడు.

చ. అరినగరంబునందొ చెఱయందొ యరణ్యమునందొ లేక దు
ర్భరతరవేదనం దనువుఁ బాసినచోఁ బరలోకమందునో
కరము జయంబుఁ గొంటి నని గర్వితు నానృపు మోసగించుచో
స్థిరనిజరాజ్యవైభవముఁ జేకొని శ్లాఘ్యతఁ బార్శ్యమందునో

(తెరలో)

హా! ప్రాణేశ్వరా! హా! ప్రాణేశ్వరా!

యౌగం :

క. శోకమున కిదిగొ స్త్రీలు ప్ర
తీకార మొనర్తు రిట్లు దీనికె కా దీ
శోకం బగుఁ బో మంత్రుల
ప్రాకట సామర్థ్య హైన్య వర వర్ణనమున్.

(ప్రవేశించి)

ప్రతీహారి : ఆర్యా! రాజమాతగారు....

యౌగం : ఏమి ? ఏమి ?

ప్రతీ : ఇట్లుమనవిచేయుమన్నది.

యౌగం : ఎట్లు ?

ప్రతీ : సుహృజ్జవపరిగృహీతుం డగు నా వత్సరాజవృత్తాంత మిట్లాయెఁ గదా ఇప్పుడు వైరనిర్యాతనంబుకన్నఁ గర్తవ్యమెుండేమి యుండును. సుహృజ్జనంబుతో సంప్రతించి నిర్ధారింపఁ దగును. ఎవ్వఁడు మహాసంకటంబులసైతము కటకటంబడఁడో ఎవ్వఁడు విషమగతుం డయ్యు వెనుదీయడో ఎవఁడు వంచితుం డయ్యు నిర్విణ్ణుఁడు గాఁడో, ఎవఁడు ప్రతీఘాతంబులసైతము ప్రాణంబులఁ బాయఁడో, యట్టి బుద్ధిమంతుని గదా యడుగుచుంటిని. తొలుదొ ల్త మత్కుమారునకు వయస్యుండవును బదపడి యమాత్యుండవునగు పుత్రకా! మత్పుత్రకుఁ గొనిరమ్ము. అని.

యౌగం : ఆహా! ఈపూజ్యురాలు రాజకులోచతంబు గా గంభీరముగఁ బల్కినది. ఈయమ సంభావనను బహూకరింతును. విజయా! నీరముఁ గొని రమ్ము.

ప్రతీ : అయ్యో! చిత్తము. (నిష్క్రమించి మరలఁ బ్రవేశించి) ఇదిగో నీరము.

యౌగం : తెమ్ము. (ఆచమించి) విజయా! పూజ్యురా లగు రాజమాత యేమి చెప్పెను?

ప్రతీ : పుత్రకా! మత్పుత్రకుఁ గొనిరమ్ము - అని

యౌగం : హంసకా! ప్రభువుగా రే మనిరి?

హంస : యౌగంధరాయణుఁ జూడుము - అని.

యౌగం : విజయా!

గీ. రాహుసంగ్రహస్తుండౌ ద్విజరాజుఁ బోలె
వైరిసంగ్రస్తుఁ డైనయావత్సరాజు
విడిచి పెట్టింప లే నేనిఁ బిలువ వలదు
నన్ను యౌగంధరాయణుఁ డన్న పేర.

(ప్రవేశించి)

నిర్మ : ఆర్యా! ఒకయద్భుతకృత్యము జరిగినది. మహారాజుగారి దుర్దైవశాంతినిమిత్తము జరుగుసంతర్పణమున భోజన మొనర్చు బ్రాహ్మణజనంబుఁ జూచి యున్మత్త వేషధారి యగునొకద్విజుండు పెద్దగానవ్వి - 'తినుండు తినుండు మీయిష్టము వచ్చినట్లు తినుండు. దీన నీరాజకులంబున కభ్యుదయమే లెం'డని యంతలోనే యంతర్హితుం డాయెను.

యౌగం : నిజముగా ?

(తరువాత బ్రాహ్మణుఁడు ప్రవేశించును)

బ్రాహ్మ : ఇవిగో యున్మత్తవేషధారి యగునాబ్రాహ్మణుఁడుపయోగించుకొని పనితీరుపై వదలిపెట్టి పోయినదుస్తులు. ఈదుస్తుల ధరించి భగవానుం డగుద్వైపాయనుండు వచ్చియున్నాఁడు.

యౌగం : ఎట్లు! ద్వైపాయనుండు వచ్చియున్నాఁడా ?

బ్రాహ్మ : ఔను.

యౌగం : అట్లేని ఆమహామహుని జూచెదము.

బ్రాహ్మ : చూడుఁడు.

యౌగం : ఏమిది రూపాంతరమువలెఁ గన్పట్టుచున్నది. అహో! నాకిప్పుడు స్వామిసన్నిధి కరిగినట్లే యున్నది. ఈయుపకరణంబుల ధరించి రిపునగరంబున నిర్భయంబుగాసంచరింపు మని యుపదేశింపనే కాఁబోలు భగవానుండగు బాదరాయణుఁడీదుస్తుల నాకుఁ బ్రసాదించినాఁడు.

గీ. మదుపదేశంబు కొఱకె యున్మత్తవేష
మూని యేతెంచె నిప్పు డీమౌనివరుఁడు
రాజు విడిపింపఁ గలఁ డరిరాజ్యమందుఁ
గాన రాకుండ నడిపింపఁ గలఁడు నన్ను.

(ప్రవేశించి)

ప్రతీహారి : ఆర్యా! రాజమాతగారు "పుత్రకు నొక్కమాఱుచూడఁగోరెద" నని పలుకుచున్నారు.

యౌగం : ఇదిగో వచ్చుచున్నాను. ఆర్యా! శాంతిగృహమున నాకై వేచియుండుము.

బ్రాహ్మ : చిత్తము. (నిష్క్రమించును)

యౌగం : హంసకా! నీవు విశ్రమింపుము.

హంస : చిత్తము. (నిష్క్రమించును)

యౌగం : విజయా! ముందు నడుపుము.

ప్రతీ : చిత్తము. (ముందునడుచును.)

యౌగం : ఆహా!

గీ. రాయుచోఁ గట్టెనుండియు రాలు నిప్పు
త్రవ్వుచో నీ రొసంగును ధరణి యేని
కా దసాధ్య ముత్సాహుల కేది కూడఁ
దఱి నొనర్ప ఫలించు యత్నంబు లెల్ల.

(అందఱు (నిష్క్రమింతురు)

**ఇది ప్రథమాంకము.**

## ద్వితీయాంకము

(తరువాతఁ గాంచుకీయుఁడు ప్రవేశించును)

కాంచుకీయుఁడు :

ఆభీరకా! ఆభీరకా! నీవు పోయి మహాసేన మహారాజుగారి మాటగాఁ బ్రతీహారరక్షకునితో నిట్లు చెప్పుము. వీరు కాశీరాజుగారియుపాధ్యాయులు. జైవంతినామధేయులు. దూతకృత్యంబుమీఁదనిట కేఁగుదెంచిరి. ఇమ్మహాత్మునకు సామాన్యదూతలకుం బలెఁ గాక విశేష సత్కార మొనర్చి మంచిబస చూపించుటయే గాక యీ యతిథి యాతిథేయసత్కారంబుల లెస్సగాఁ బడసితినని యనుకొనులాగొనర్పఁ బ్రయత్నించునది. - అని -

ఆహా! ఈలాగునఁ బ్రతిదినమును గోత్రానుకూలంబులగు రాజకులంబులనుండి దూత లేఁగుదెంచుచున్నారు కాని మహాసేన మహారాజుగా రెవ్వరిని నిరాకరింపరు. ఎవ్వరిని స్వీకరింపరు. ఇది యేమిటో ? ఏమి యున్నది. కన్యాదాన విషయంబున దై వమే సమర్థంబు. ఏలయన.

చ. ఎవనికి భార్య కాఁగలదొ యీమనవాసవదత్త యట్టిభూ
ధవుకడనుండి దూత నృపుదండకు రాఁ డవు; లేనిచో మహీ
ధవుఁ డిటు దూతలన్ నృపకదంబము పంప వరప్రతీక్షుఁడ
య్యు వరగుణంబులన్ దెలిసియున్ వరు నేటికి నిశ్చయింపఁడో?

ఓహూ! ఇందంతఃపురపరిచారవర్గ మందంద యొదిఁగికొనుటం జేసి మహారాజుగా రీప్రదేశంబున కరుదెంచు చున్నట్లున్నది. ఇదిగో మహాసేనమహారాజుగారు ఈమహానుభావుఁడు.

గీ. నిబిడ దూర్వాంకుర స్నిగ్ధ నీలమణి వి
భాసిపీతాంగదోన్నత బాహుశిఖరుఁ
డీకనకతాళవనినుండి యేగుదెంచు
శరవణమునుండి వెడలువిశాఖు నట్ల.

(నిష్క్రమించును)

**విష్కంభము**

(తరువాత రాజును బరివారమును బ్రవేశించును.)

రాజు :

చ. మహిపతు లెల్ల భృత్యు లటు మార్గమునందున మత్తురంగమ
ప్రహితపరాగమున్ మకుటభాగము లంట ధరింత్రు గాని యా
మహిమము నాకు మోద యణుమాత్రముఁ గూర్పదు నాగవిజ్ఞతా
మహితుఁడు వత్సరాజు గుణమాన్యుండు నన్ బ్రణమిల్ల కుండుటన్.

బాదరాయణా !

(ప్రవేశించి)

కాంచు : మహాసేనులవారికి విజయ మగుఁ గాక.

రాజు : జైవంతికి బస నేర్పాటు చేసితివా ?

కాంచు : బస నేర్పాటు చేసితిమి. తగినట్లు సత్కరించితిమి.

రాజు : మంచిపని చేసితివి. నీవు రాజవంశ్యగుణాభిలాషివి. వచ్చిన పెద్దల మర్యాద చేయుటయే మంచిది. ఇట్లు దూతల నంపిన రాజులలో నెవ్వరు కన్యాప్రదానమున కర్హు లని యెవరి నడిగినను వార లొండొరుల యభిప్రాయంబునకో నాయభిప్రాయంబునకో నిరీక్షించు చుందురే కాని

తమయభిప్రాయంబుల నొక్కరును వెల్లడింపరు. (కాంచుకీయునివైపు చూచి) నీవేమో చెప్పఁ దలఁచువానివలెఁ గాన్పింతువు.

కాంచు : మ ఱేమియు లేదు. కన్యాప్రదానంబును గూర్చి యనుకొనుచున్నారు.

రాజు : సంకోచింపకుము. సంకోచింపకుము. ఈకన్యాప్రదానవిధి సర్వసామాన్యము గదా. నీవు చెప్పఁ దలఁచిన దేదియో నిశ్శంకముగాఁ జెప్పుము.

కాంచు : మహాసేనమహారాజా! నాచెప్పఁ దలచినది మఱేమియు లేదు. ఇదియే. ఇట్లు ప్రత్యహంబును గోత్రానుకూలంబులగురాజకులంబులనుండి దూత లేతెంచుచున్నను మహారాజుగా రొక్కరిని నిరాకరింపరు. ఒక్కరిని స్వీకరింపరు. ఇది యేమిటి? అని.

రాజు : బాదరాయణా! ఇది వాస్తవమే. వరగుణంబులయ దతిలోభంబునను వాసవదత్తయం దతివాత్సల్యమునను వరనిశ్చయ మొనర్పఁ జాల కున్నాను. నేను వరునియందు.

మ. మొదలన్ సత్కుల మెంతు నాపయి దయన్ ముఖ్యంబు గా నెన్నెదన్
మృదు వయ్యున్ దయ సారవత్సుగుణ మామీఁదన్ సురూపంబు నా
పిదపన్ గాంతిని, వీని నెన్న గుణలుబ్ధిన్, స్త్రీజనార్థంబె; యా
పిదపన్ వీర్యము నెంతు లేక యది పృథ్విన్ స్త్రీల నె ట్లోమ నౌ.

కాంచు : దేవరవారియందుఁ దప్ప నిప్పుడీసద్గుణంబు లెల్ల నెక్కడ నేని ఒక్కనియందుఁ గాన వచ్చునా?

రాజు : అందులకే గదా యింతగా విచారించుట.

గీ. తలఁచుగాఁ దండ్రి చేయుయత్నంబుచేతఁ
గన్యకకు సద్గుణుం డైనకాంతుఁ డబ్బు ;
తక్కువైభవములమాట దాని దాని
ప్రాక్కృతం బగుసుకృతంబుఁ బట్టి యుండు.

కన్యాప్రదానకాలంబునఁ దల్లులు దుఃఖశీల లగుదురు. కాన దేవిని గూడఁ బిలుచుకొని రమ్ము.

కాంచు : మహాసేనుల సెలవు (నిష్క్రమించును)

రాజు : అదేమో కాశీరాజు దూతను బంపినాఁ డని వినఁగానే వత్సరాజును బట్టికొన నాచేఁ బంపఁ బడినశాలంకాయనుమీఁదికి నాబుద్ధి పోవుచున్నది. ఏ మయియుండును. ఇంతదనుక నాబ్రాహ్మణుఁ డావృత్తాం మేమియుఁ బంపకున్నాఁడు.

గీ. ఏనుఁగులవేఁట యాతని కెపుడు నాట
అతనిహృదయంబు సంతతం బంద యుండు ;
కాని తన్మంత్రు లెల్లరుఁ గా ద టంచు
మెండు గా యత్న మొనరించి యుండ వలయు.

(తరువాత సపరివారయై దేవి ప్రవేశించును)

దేవి : మహాసేనులకు జయ మగుఁ గాక.

రాజు : దేవీ! కూర్చుండుము.

దేవి : చిత్తము - (కూర్చుండును)

రాజు : వాసవద త్త యెక్కడ ?

దేవి : ఉత్తర యనువై తాళికయొద్ద మహతీవీణాభ్యాసంబునకై పోయి యున్నది.

రాజు : ఏమీ! వాసవద త్తకు గాంధర్వమున నభిలాష జనించినదా?

దేవి : ఏదే నొక్కపని యుండుట మంచిదని తన చెలియగు కాంచనమాల వీణ నేర్చుకొనుటఁ జూచి తాను గూడ వీణ నేర్చుకొనఁ దలఁచినది.

రాజు : ఇది బాల్యంబున కుచితమే గదా.

దేవి : దేవరవారితో నే నొకటి విన్నవింపఁ దలఁచుకొన్నాను.

రాజు : ఏమని?

దేవి : వీణ నేర్ప నొకయాచార్యుఁడు కావలయు నని

రాజు : సన్నిహితవివాహకాల యగువాసవదత్తకు వేఱేయాచార్యుఁడేల? భ ర్తయే వీణ నేర్పును లెమ్ము.

దేవి : ఆఁ ! అప్పుడే నాబిడ్డకుఁ బెండ్లియీడా?

రాజు : దేవీ! పుత్రికను ప్రతిదినము ననురూపవరునకు నొసంగుమని మ మ్ముపరోథించుచు నిపు డిట్లు పరితపించెద వేల?

దేవి : కన్యాప్రదానము నా కభిమతమే గాని పుత్రీవియోగముమాత్రము నన్ను సంతాపపెట్టు చున్నది. అట్లేని ఎవరికొసంగితిరి.

రాజు : ఇంకను నిశ్చయము లేదు.

దేవి : అమ్మాయికి వివాహవయస్సు వచ్చినను నిశ్చయమే లేదా?

రాజు :

గీ. ఈయ లే దన్నచో సి గ్గ దేగుదెంచు
ఇచ్చితి మటన్నచోఁ జింత హెచ్చు మదికి
ధర్మమునకుఁ బ్రేమకును మధ్యమున నుండి
కూఁతులం గన్నతల్లులు కుందుదు రిటె.

ఇప్పు డన్నివిధంబుల మనవాసవదత్త య త్తమామలకుఁబరిచర్య సేయఁ దగినయీడులో నున్నది. అదియుం గాక కాశీరాజోపాధ్యాయం డగునార్యజై వంతి దూతగాఁ జనుదెంచి తదీయచారిత్రంబుచే న న్నెంతయు లోభపెట్టుచున్నాఁడు. (తనలో) దేవి ఏమియు బదులు చెప్పదు. కన్నీరు గార్చుచుఁ గలతఁ జెంది యున్నది. వరనిశ్చయమేమి చేయఁగలదు. కానిమ్ము. ఈయమకు నాయభిప్రాయమెఱిఁగింతును.

(ప్రకాశము)

అస్మదీయసంబంధాభిలాషులై రాజులు వచ్చినట్లు దూతలవలన విను చున్నాము.

దేవి : ఇది యంతయు నిప్పు డేటికి? ఎవరి కొనంగిన చో సంతాపమొందమో

యట్టివారి కొసంగుఁడు.

రాజు : ఆహా! ఎంతసులభముగాఁ బల్కితివి. తరువాత నేమైన మూఁడినచో న న్నుపాలంభించుటకా? వినుము.

గీ. వచ్చిరి మదీయసంబంధవాంఛఁ గాశి
రాజు మైథిలమగధసౌరాష్ట్రనృపులు
వంగపతి శూరసేనుండు వరగుణాఢ్యు
లిం దెవఁడు పాత్రుఁడో పుత్రి నీయఁ జెపుమ.

(ప్రవేశించి)

కాంచు : వత్సరాజు

రాజు : వత్సరాజా?

కాంచు : మహాసేనమహారాజా! అనుగ్రహింపుము. ప్రియవచన నివేదనత్వరచే సముదాచారంబుపాటింప మఱచితిని.

(నేలపైఁ బడును)

రాజు : ఏమీ! ప్రియవచనమా?

దేవి : (లేచి) ఆర్యపుత్రా! జయము. (అనిపోఁబోవును)

రాజు : (హర్షముతో) దేవీ! ప్రియవచనాకర్ణనమునకు నీవు పరిహార్యురాలవు గావు. కూర్చుండుము.

దేవి : ఆర్యపుత్రుని సెలవు. (కూర్చుండును)

రాజు : బాదనారాయణా! లెమ్ము. లెమ్ము. సంకోచింపక చెప్పుము.

కాంచు : (లేచి) పూజ్యు లగుమనశాలంకాయనామాత్యులు వత్సరాజును బట్టుకొనిరి.

రాజు : (హర్షముతో) ఏ మంటివి?

కాంచు : పూజ్యు లగుమనశాలంకాయనామాత్యులు వత్సరాజును బట్టుకొనిరి.

రాజు : ఉదయునినా?

కాంచు : అవును.

రాజు : శతానీకుని పుత్రుని?

కాంచు : నిజముగా.

రాజు : సహస్రానీకుని మనుమని?

కాంచు : అతని నే

రాజు : కౌశాంబీపురాధీశుని?

కాంచు : స్పష్టముగా నాతనినే

రాజు : గాంధర్వవిద్యాధనుని?

కాంచు : అతని నట్లే చెప్పుదురు

రాజు : వత్సరాజునే గదా?

కాంచు : చిత్తము. వత్సరాజునే

రాజు : అ ట్లేని యౌగంధరాయణుఁడు కాలధర్మ మొందెనా?

కాంచు : లేదు. కౌశాంబీనగరమున నున్నాఁడు.

రాజు : అట్లేని వత్సరాజును బట్టుకొన లేదు.

కాంచు : మహారాజ! నామాట నమ్ముఁడు

రాజు :

ఉ. నమ్మఁగఁ జాల నే నుదయనగ్రహణంబును వేయుఁ జెప్పు హ
స్తమ్ముల మందరాచలము దర్పసమగ్రతఁ ద్రిప్పినట్లు; యు
ద్ధమ్ముల వైరు లానృపునుదగ్రపరాక్రమ ముగ్గడింత్రు క
ర్ణమ్ములఁ జొచ్చుఁ దత్సచివరత్న ముమంత్రమహాప్రభావముల్

కాంచు : మహారాజా! అనుగ్రహింపుము. వృద్ధుండ నదియుంగాక బ్రాహ్మణుండ. ఏలినవారియెదుట నెన్నఁడునుదబ్బఱలాడి యుండలేదు.

రాజు : ఆఁ అవును. నీవిదివఱకెన్నడునుదబ్బలాడలేదు. అట్లేని శాలంకాయనుండే ప్రియదూత నిటకంపెను.

కాంచు : దూత నెవ్వనిఁ బంప లేదు. జవాతిశయంబు గలఖరరథంబుపై ముందుభాగమున వత్సరాజుం గూర్చుండఁ బెట్టుకొని శాలంకాయనామాత్యుండు తానే వచ్చెను.

రాజు : అలాగా? అహా! అట్లేని ఇంక మనసైనికు లెల్లరుఁగత్తళంబులు విచ్చిసుఖంబుగా విశ్రమింప వచ్చును. నేఁడు మొదలుకొని సామంతరాజు లేతద్భయంబు లేమిం జేసి నాకడకుఁ బ్రచ్ఛన్నముగా దూతల నంపుట మాని నిర్భయంబుగా నుండవచ్చును. వేయేల నేఁడు గదా నేను మహాసేనుండనైతి.

దేవి : ఏమీ అమాత్యుండు కొనివచ్చెనా?

రాజు : కొనివచ్చెను.

దేవి : ఇతనికొఱకే గదా మనవాసవద త్త నేరికి నొసఁగఁ దలంపకున్నాము.

రాజు : ఈతండు నాకు యుద్ధమున గెలుచుకొన్న శత్రువే యైనను గుణసంపదఁ బట్టి పట్టి నీతనికే యీయఁ దలంచితిని.

బాదరాయణా! శాలంకాయనుం డెక్కడ?

కాంచు : భద్రద్వారమున విడిసి యున్నాఁడు.

రాజు : పొమ్ము. యువరాజోచితగౌరవంబుతో వత్సరాజప్రధానంబుగా నమాత్యుని బ్రవేశపెట్టు మని ముఖ్యామాత్యుఁ డగు భరతరోహకునితోఁ జెప్పుము.

కాంచు : ఏలినవారి సెలవు. (పోవును)

రాజు : బాదరాయణా! ఇటు రమ్ము.

కాంచు : ఏమి సెలవు?

రాజు : వత్సరాజును జూడ వచ్చుపౌరుల నెవ్వరిని వారింప వలదు.

క. ఇతనిన్ మద్రిపు శౌర్య
శ్రుతపూర్వున్ బౌరజనము చూచుం గాతన్
క్రతు సంయతంబు నంతః
స్థితరోషము నైనకొదమసింగముఁ బోలెన్.

కాంచు : చిత్తము. అట్లే (నిష్క్రమించును)

దేవి : ఈరాజకులంబునఁ బెక్కు లభ్యుదయంబు లనుభూతంబులయ్యెఁగాని యార్యపుత్రునకింతటి ప్రీతిభాజనం బొం డేదియుఁ గా దని తలంతును.

రాజు : నేనును వత్సరాజగ్రహణసదృశం బగుప్రియవార్త నిదివఱకు విన్నట్లేనిఁ దలంపను.

దేవి : వత్సరాజా?

రాజు : అవును.

దేవి : పెక్కురాజకులంబులు మనసంబంధముఁ గోరి వచ్చియున్నట్లు విని యున్నాను గాని యీతఁ డొకదూత నేనియు నిదివఱకుఁ బంపి యుండ లేదు.

రాజు : మహాసేనుండ వని యేనియు న న్నితఁడు లెక్క సేయఁడు. ఇఁక మనసంబంధమును గోరునా?

దేవి : లెక్క సేయఁడా? అట్లేని బాలుఁడా? లేక మూర్ఖుఁడా?

రాజు : మూర్ఖుఁడు కాఁడు - బాలుఁడే

దేవి : అతని నేది యింత గర్వింపఁ జేయు చున్నది.?

రాజు : ఏదియా? వినుము. సుప్రసిద్ధరాజర్షి విరాజితంబును వేదాక్షరసమ్మితమహాభారతప్రతిపాద్యము ననుభరతవంశ మీతని నింత

గర్వింపఁజేయు చున్నది. వంశపరంపరాయాత మగు గాంధర్వవేద మీతని కింత కావరము గలిగించుచున్నది. వయో నురూపం బగురూప మీతని నింతగా విభ్రమింపఁజేయు చున్నది. ఎట్లో యేర్పడినపౌరానురాగ మీతని నింత విస్రంభపాత్రుఁ గాఁ జేయు చున్నది.

దేవి : అట్లేని అభిలషణీయంబులు గదా యీవరగుణంబులు. ఈతఁడే గుణంబుచే దోషి యయ్యె?

రాజు : దేవీ! ఏమీ! ఆశ్చర్యము లేనిచోట నాశ్చర్యపడెదవు. చూడుము.

గీ. గడ్డిపొదలో నిడినయగ్ని గతి నిరంకు
శంబుగా ధాత్రి నంతట సంచరించి
శాసనం బస్మదీయ ముజ్జ్వలిత మయ్యు
సమసిపోయెడు నితనిరాజ్యంబునందు.

**(ప్రవేశించి)**

కాంచు : ఏలినవారికి జయ మగుఁ గాక. దేవరవారియానతిచొప్పున యువరాజ సత్కారములతో శాలంకాయనామాత్యులు నగరంబుఁ బ్రవేశించి యేలినవారితో నిట్లు మనవి చేయుచున్నారు. ఇదిగో భరతకులోప భుక్తంబును వత్సరాజసంక్రాంతంబు నగు ఘోషవతి యనుధర్శనీయం బగువీణారత్నంబు. మహాసేనులిద్దాని స్వీకరింప వలయును - అని - (వీణను జూపును)

రాజు : జయచిహ్నముగా దీనిఁ బరిగ్రహించితిని. (వీణను గొనిఁ ఆఘోషవతి యియ్యదియే కాఁబోలు. ఇది.

గీ. శ్రవణసౌఖ్యద మధుర నిసర్గర క్త
సఖశిఖరఘృష్టతంత్రీసునాద మైన
వీణ ఋషి వాక్యగతమంత్రవిద్యవోలెఁ
గైవసముఁ జేసికొను బల్మిఁ గరులమనసు.

ఎందేనియు సమరసముపార్జితంబు లగురత్నంబు లిష్టానుభవంబుచేఁ బ్రీతిజనకంబులగు, ఇవ్వీణియ నాకొమరుల కొసంగదు మన్న -

గీ. అర్థశాస్త్రగుణాభిజ్ఞుఁ డంతె నాదు
బాలకుఁడు జ్యేష్ఠుఁ డైనగోపాలకుండు ;
బాలకుఁడు ద్వితీయుం డనుపాలకుండు
హరిగాంధర్వదూషి, వ్యాయామతోషి.

ఎవ్వరి కొసంగిన నిదిసార్థకం బగు? దేవీ! వాసవదత్త వీణ నభ్యసించు చున్నది గదా!

దేవి : అభ్యసించు చున్నది.

రాజు : అట్లేని ఈవీణను మనవాసవదత్త కిమ్ము.

దేవి : ఇప్పుడే వాసవదత్త వీణియమాట యెత్తిన నున్మత్తురాలగుచున్నది. ఈవీణ యొసంగతి మేని మఱింత యున్మత్తురాలగును.

రాజు : ఆఁడుకొన నిమ్ము - ఆఁడుకొన నిమ్ము - అత్తగారింట నిట్టివి సులభంబులు గావు గదా. బాదరాయణా! వాసవదత్త యెక్కడ?

కాంచు : అమాత్యునియొద్దఁ గూర్చుండి యున్నది.

రాజు : వత్సరా జెక్కడ నున్నాఁడు?

కాంచు : కాళ్ళకు సంకెలలు తగిలించుటచేతను కాయంబునఁ బలుగాయంబులచేతను డోలికమీఁద మధ్యమగృహంబునఁ బ్రవేశపెట్టఁ బడియున్నాఁడు.

రాజు : ఛీ! ఎంతకష్టము. కాయంబునఁ బలుగాయంబులా? ఇయ్యది యస్థానప్రయుక్తపరాక్రమదోషము. అన్యము గాదు. మహాఘాతుకుఁడు గదా యిట్టిపట్ల నుపేక్షించుచువాఁడు. బాదరాయణా! నీవు పోయి భరతరోహకునితో వత్సరాజునకు వ్రణచికిత్సఁ గావింపు మని చెప్పుము.

కాంచు : ఏలినవారి సెలవు.

రాజు : ఇదిగో యిటు రమ్ము.

కాంచు : ఇదిగో వచ్చితిని.

రాజు : అతని కెందుఁ గోర్కియో యెఱింగి సబహుమానముగా దానిని దీర్చునది. ఆకారమును బట్టియే యాతనిప్రీతివిషయంబుల నారయ వలయు. అతిక్రాంతసమరప్రస్తావనల నాతనిముందు తేరాదు. క్షుతాదులపట్ల వృద్ధసముదాచారంబుగా మంగళాశీర్వాదము గావింపవలయును. కాలానుగుణము లగు కైవారంబులచే మర్యాద చూపు చుండ వలయును.

కాంచు : చిత్తము (నిష్క్రమించి మరలఁ బ్రవేశించి) మహాసేనమహారాజా! జయము. వత్సరాజునకు దారియందే వ్రణచికిత్స గావింపఁ బడెను. రెండవసారి చికిత్సకు నింకను వేళ కాలేదు. ఇప్పుడు సూర్యుఁడు నడిమింటనే యున్నాఁడు.

రాజు : ఆవీరమాని యిప్పు డెచ్చట నున్నాఁడు?

కాంచు : మయూరయష్టిసౌధముముఖభాగమున నున్నాఁడు.

రాజు : అయ్యో! కష్టము. ఈప్రదేశము వాసయోగ్యము కాదు. ఎండ తగుల కుండుటకై మణిభూమికయందుఁ బ్రవేశపెట్టుమని చెప్పుము.

కాంచు : చిత్తము (నిష్క్రమించితిరిగిప్రవేశించి) ఏలినవారి సెలవు ప్రకార మంతయు నొనర్చితిని.

శ్రీభరతరోహకామాత్యులు దేవరవారిని సందర్శింప గోరుచున్నారు.

రాజు : ఓహూ! అలాగా? వత్సరాజు నిట్లు సత్కరించుట యాతని కెంతమాత్రము నిష్టములేదు. వత్సరాజపరిగ్రహణమే తదీయనీతిపరిశ్రమ ఫలితమే కాన నీతని మన్నింప వలయును. నేనే యాతని ఒప్పింతును.

దేవి : సంబంధము నిశ్చయింతిరా యేమి?

రాజు : ఇంతవఱకు నిశ్చయింపలేదు.

దేవి : అప్పుడే తొందరలేదు. ఇంకను మనవాసవదత్త బాలికయే గదా.

రాజు : నీయిష్టప్రకారమే కానిమ్ము నీ వంతిపురమున కరుగుము.

దేవి : చిత్తము (సపరివారయైనిష్క్రమించును)

రాజు : (ఆలోచించి)

చ. ఉదయనుతోడివైర మితఁ డుద్ధతుఁ డౌ నని యయ్యెఁ దొల్లియా
పదపడి పట్టి తే నితనిపట్టున మాధ్యమవృత్తి నుంటిఁ బో
కదనమునం దితండు పలుగాయములం దినె, నుండె దుస్థితిన్
బ్రదుకునొ? లేదొ? యంచు విన వచ్చుటఁ జిత్తము తత్తఱించెడిన్

**(ఇరువురు నిష్క్రమింతురు)**

**ఇది ద్వితీయాంకము**

# తృతీయాంకము

(పిదప వెట్టివానివేషముతో విదూషకుఁడు ప్రవేశించును)

విదూషకుఁడు :

(పరికించి) ఏమీ యీమాయ. ఈదేవకులపీఠికయందు నామోదకమల్లక ముంచుకొని దక్షిణామాషకంబుల లెక్కపెట్టి మూట గట్టుకొని మరల వచ్చి చూతును గదా నామోదకమల్లక మిందుఁ గాన రాకున్నది. (ఆలోచించి) ఆఁ - ఏమిది ఈయువలగ్నుండు కాఁజేసె నందుమా? ఈతఁ డొక్క మోదకంబుతోనే తృప్తిఁ జెంది నావెంట నైనను రాడు. కుక్క లేమైన వచ్చి నోటఁగఱచుకొని పోయె నందుమా? ప్రాకార మెంతయు నున్నతంబు గాన వాని కిట మసలుట కేనియు నవకాశము లేదు. లేనిచోఁ బథికు లేమైనఁ జాపలంబునఁ గొనిపోయి రనుకొన్న నదియును బొసఁ గదు. వా రక్షతభక్తులు గాన ఈమోదకము నభిలషించరు కానిచో నొకవేళ నేనే నోటఁ బెట్టికొంటి నేమో? ఇది యెట్లు తెలియును. కానిమ్ము. ఆఁ - తెలిసినది. ఒక్కపనిచేసి చూచెదను. ఇప్పు డొకమారు త్రేఁపి దానిగంధముచే నీమోదకంబును నేనే తింటినేమో తెలిసికొందును గాక. హీ హీ - పూరింపఁ బడిన వరాహవస్త్రివలె నుత్తగాలినే విడుచుచున్నాను. అట్లేని దీని నెవ్వరు తీసికొని యుందురు. లేక యీశివుఁడే నాలోహితకాత్యాయనికడ నున్నది నాదేయని తలంచి తానే యొకవేళ దీసికొనియుండునా? (నిరూపించి) కాదు - కాదు - ఈ బ్రహ్మచారిగాఁడుత్తవేషధారిగా నున్నాఁడు.

మోదకంబుపై నాసచే దుండగ మేమైనఁ జేసి యుండునేమో. కానిమ్ము మఱల వెదకెదను. ఓహూ! ఎంత పొరపాటు. తలమీఁదనే యుంచుకొని యూ రెల్ల వెదకుచున్నాను. ఇదిగో నామోదకమల్లక మీశ్వరుని కాళ్లముంగలనే యున్నది. వేగిర మేగి చేకొందును. స్వామీ! నామోదకమల్లక మిమ్ము. మోదకమల్లక మిమ్ము. స్వామీ! నీవు గూడ దొంగపనిఁ జేయుదువా? అయ్యో! ఎంతమోసపోతిని ఇయ్యది గోడమీఁదిచిత్రలేఖనము గదా. సంతాపాంధకారములో నామోదకమల్లము గానరా కున్నది. కానిమ్ము - కానిమ్ము. చేతులతోఁ దడవి చూచెదను. (తడవిచూచి బలే! శిల్పకా! మేలు మేలు. ఏమీ! ఈయుక్తవర్ణత. ఆశ్చర్య మాశ్చర్యము. చేతులతోఁ దుడిచినకొలది మఱింత యెక్కువగా మెఱయుచున్నది. కానిమ్ము. నీళ్ళతోఁ దుడిచి చూచెదను. ఇచ్చట నీరమెందుదొరుకునో? ఇదిగో శుద్ధజలాన్వితంబగు తటాకంబు. ఇచ్చటికే వెళ్లెదను. శివా! నీవు గూడ నావలెనే యీమోదకమల్లకంబున నిరాశుఁడ వగుము.

(తెరలో)

మోదకంబులారా! మోదకంబులారా! హీ హీ హీ -

విదూ : ఈపిచ్చివాఁడు నామోదకమల్లకంబు చేకొని నవ్వుచు నుఱుగుతోఁ గూడినమలినం బగువర్షాకాలరథ్యోదకంబువలె నిటె వచ్చుచున్నాఁడు. నిలు నిలు ఉన్మత్తకా! నిలు నిలు కఱ్ఱచే నొక్కేటున నీపుఱ్ఱెఁ బగులఁ గొట్టెదను.

(పిదప నున్మత్తుఁడు ప్రవేశించును)

ఉన్మ : మోదకములారా! మోదకములారా! హీ హీ హీ

విదూ : ఉన్మత్తుఁడా! నామోదకమల్లకంబు నా కొసంగుము.

ఉన్మ : ఏమి మోదకంబులు. ఎక్కడి మోదకంబులు ఎవరి మోదకంబులు. ఈమోదకంబుల వదలిపెట్టవలయునా? లేక దాఁచవలయునా? లేనిచోఁ దినవలయునా?

విదూ : తినను దినరు. వదలిపెట్టను వదలిపెట్టరు.

ఉన్మ : ఇదిగో నానాలుక తిన వలయు నని లొట్టలు వేయుచున్నది.

విదూ : ఉన్మత్తకా! నామోదకమల్లకంబుఁ గొనిరమ్ము. ఇతరుల వస్తువుల నాసించి పట్టుపడకుము.

ఉన్మ : ఎవరురా ననుఁ బట్టుకొనువారు? నాప్రాణము పోయినను నేను వీని వదలుదునా? ఈమోదకంబులే నన్ను రక్షించును.

ఎవరురా ననుఁ బట్టునీపాటివారు
ఎవరురా ననుఁ బట్టునింతసాహసులు.
కోపాన ననుఁ బట్టుకొందురు గాక
కాపాడ నీమోదకంబులు లేవె?
వివిధరూపములతో విలసిల్లునివియె
అవసరంబుల నాకు ననుకూలపడును.
కాలవశంబుచేఁ గడు వాడియున్నఁ
జాలుబో నా ప్రాణసంరక్ష కివియె.
ఎవరబ్బసొ మ్మని యి మ్మందు వీని
అవుర సొమ్మిచ్చి నే సంగడిఁ గొంటి.

విదూ : ఓ ఉన్మత్తకా! నామోదకమల్లకము నా కొసంగుము. దీని ప్రత్యయమున నే నుపాధ్యాయకులమునకుఁ బోవలయును.

ఉన్మ : నేనును దీనిప్రత్యయమున నూఱామడలదూరము వెళ్ళవలయును.

విదూ : నీవు నూఱామడలదూర మేగుట కై రావతమవా యేమి?

ఉన్మ : అవును. నే నై రావతమనే. కాని నాపై దేవరా జెక్కఁడు ఎక్కినచో నాయనను గూడఁ గొనిపోదును. కాని - ఇంద్రుఁడు పాదపాశికులచే బంధింపఁ బడినాఁడఁట. ఇదిగో యిప్పుడే ధారానిగళంబు లగునీమెఱుపుఁగొరడాలచేఁ జావమోది బెడిదంపుసుడిగాడ్పులచే నీబంధంబుల ఛిన్నభిన్నం బొనర్చెదను.

విదూ : ఉన్మత్తకా! నీవు నామోదకమల్లకము నా కీయవా? ఈయనిచో నేడ్తును.

ఉన్మ : ఏడుపు మేడువుము. మొత్తుకొనుము.

విదూ : చంపుచున్నారో చంపుచున్నారు.

ఉన్మ : నేనును ఏడ్తును - ఇంద్రుని బంధించిరో యింద్రుని బంధించిరి.

విదూ : చంపుచున్నారో చంపుచున్నారు.

(తెరలో)

భయపడకుము - భయపడకుము - బ్రాహ్మణోపాసకా! భయపడకుము.

విదూ : (సంతోషముతో) చంద్రుఁడురాఁగానేసర్వనక్షత్రములును వచ్చినవి. బ్రాహ్మణ్యము విషాదకరము, ఈహామాత్రకుఁడౌ శ్రమణకుఁడభయమీయవలసె. (తరువాత శ్రమణకుండు ప్రవేశించును)

శ్రమ : భయపడకుము - బ్రాహ్మణోపాసకా! భయపడకుము. ఇక్కడనెవరెవరున్నారు? ఏలదుఃఖించెదరు?

విదూ : ఏమీ! ఈశ్రమణకుఁడు ద్వారపాలకవృత్తి ననుభవించుచున్నాఁడే. అయ్యో! శ్రమణకా! ఈయున్మత్తకుఁడు నామోదకమల్లకంబుఁ గొనియీయకున్నాడు.

శ్రమ : ఏదీ మోదకము చూచెదను.

ఉన్మ : శ్రమణకా! ఇదిగో చూడుము చూడుము.

శ్రమ : థూ - థూ -

విదూ : అయ్యో! ఛీ - ఈయున్మత్తకునిచేతిలో ఈహామాత్రకుండగుశ్రమణకుండు థూత్కార మొనర్చినాడు. నిర్భాగ్యుండనగునే నిదివఱ కేమి చూచితినో యంతే.

శ్రమ : ఓయి యున్మత్తోపాసకా! కస్థూలికాఫేనపాండురంబులును బహుపిష్ట సమృద్ధంబులును గోమలంబులు నగునీమోదకంబులనిచ్చి వేయు మిచ్చి వేయుము. వృథాగాఁ దిని క్షయోన్ముఖుండవుగాకుము.

విదూ : ఎంతకష్టము. మోదకంబు లనుకొని కల్లులడ్డువాలకై యాసించితిని.

శ్రమ : ఓఉన్మత్తోపాసకా! ఇచ్చి వేయుమిచ్చి వేయుము. లేనిచో నిన్ను శపింతును.

ఉన్మ : శ్రమణకా! అనుగ్రహింపు మనుగ్రహింపుము. భగవానుఁడా! నన్ను శపింపకు శపింపకు. తీసికొనుము... తీసికొనుము.

శ్రమ : బ్రాహ్మణోపాసకా! నాశ క్తిని జూచితివా?

విదూ : ఈయున్మత్తకు డీహామాత్రకుం డగుశ్రమణకుని శాపంబునకు వెఱచి భయభయంబుగఁ జాఁచఁబడిన కొనవ్రేలిపై మోదకమల్లక ముంచుకొని నిలువఁబడియున్నాఁడు. ఓఉన్మత్తకుఁడా! నామోదకమల్లక మిమ్ము.

శ్రమ : ఈమోదకంబులచే స్వ స్తివాచన మొనర్తురు గాక మీరు గూడ నిటు రండు. ఇటు రండు.

విదూ : హీ - హీ - నామోదకంబులచేతనే నేను స్వస్తిచెప్పవలయునా? నేను నొకగృహస్థునికడనుండి ప్రతిగ్రహంబుగా వీనిని గొంటిని. కావలయునన్న నవి మాకు నుపాయనంబులగు లెండు. పాత్రులగుతమ కొసంగుటచే నవి సమృద్ధంబులే యగును. ఈయున్మత్తకుఁ డగ్నిగృహంబున కెదురుగా నేఁగుచున్నాఁడు. ఇప్పుడు మధ్యాహ్నమాయెను. పూర్వాహ్ణమందే యీప్రదేశంబు నిర్జనం బగును. నేను నిప్పుడీదక్షిణామాషకంబుల దారిలో నొకయింటఁ బెట్టి వెళ్ళుదును. ఒకనికి శాటితో నవసరము. మఱొకరికి మూల్యముతోఁ బని.

(అందఱు నగ్నిగృహముం ప్రవేశింతురు)

యౌగం : వసంతకా! ఈయగ్ని గృహంబున నెవరును లేరు గదా.

విదూ : లేరు. ఇయ్యది నిర్జనముగనే యున్నది.

యౌగం : అట్లేని మీ రిరువురు నన్నుఁ గౌఁగిలించుకొనుఁడు.

ఇరువురు : అట్లే (కౌఁగిలించుకొందురు)

యౌగం : కాని మీ రిరువురు దుల్యపరిశ్రములరు. కూర్చుండుము. కూర్చుండుము.

ఇరువురు : చిత్తము. (అందఱును గూర్చుండెదరు)

యౌగం : వసంతకా! నీవు స్వామిని జూచితివా?

విదూ : ఆఁ ! చూచితిని.

యౌగం : అయ్యో! ఎంతకష్టము. రాత్రి నెట్లో యనర్థము లేకుండ వెళ్ళఁ బుచ్చితిమి. ఇంకఁ బగ లెట్లు వెళ్లునా యని చూచుచున్నాము.

గీ. పగలు గడచిన రేయికై దిగులు ; రేయి
హాయిగాఁ దెల్లవాఱిన నడలు మఱలఁ
బగ లెటో యని, భావ్యశుభములఁ దలఁచు
మాకు సుఖ మెప్పు డన గతస్మరణమందె.

రుమణ్వ : తాము తథ్యము సెల విచ్చితిరి. రేవగళ్ళలోఁ గాలకృత్యభేదంబు లేకున్నను సంకటసమయంబుల రాత్రియే యనర్థపరంపరాప్రదాత్రి.

యౌగం : వసంతకా! రాజుగారితోఁ జెప్పితివి గదా

విదూ : ఆఁ - చెప్పితిని. ఈవిషయమే మాటలాడుచు స్వామివారు చాలసేపుదనుక వెడల నీయరైరి. నేఁడు చతుర్దశియగుటచే స్వామివారు స్నాన మొనర్చువఱకు నిరీక్షించుచు నే నందే యుంటిని.

యౌగం : స్వామి స్నాన మొనర్చెనా?

విదూ - ఆఁ - స్నానమొనర్చెను

యౌగం : దేవపూజఁగావించెనా?

విదూ : నమస్కారమాత్రంబుచేతనే సర్వదేవతల నారాధించెను.

యౌగం : ఇట్టి సంకటసమయంబునను మహారాజు దేవతారాధనంబున నేమఱకయున్నాఁడు. ఇయ్యది శ్లాఘనీయమేగ దా.

ఉ. స్నానము దేవపూజ శుభసత్క్రియ దీర్చినమీఁద నేమహీ
జానిగృహంబునం. బటహజాలము మ్రోఁగుచునుండునెప్పు డా
జేనికి నిప్పు డయ్యె! దురదృష్టముచేఁ దిథిదేవపూజలన్
మానుగ మ్రోఁగుచున్నవి నమశ్చలితంబులు కాలి సంకెలల్.

రుమ : ఇప్పటితమప్రయత్నము త్వరలోనే రాజుగారి కుచితతిథి సత్కారంబును జేకూర్పఁగలదు.

యౌగం : (విదూషకునివైపు చూచి) మఱలఁ జనుము తిరిగి రాజుగారిని సందర్శించి యిట్లు మనవి చేయుము. ఏప్రయాణంబుకొఱకు మన మిన్నాళ్ళు మంతనమొనర్చుచుంటిమో దానికిఁ బ్రయోగకాలము జేపే. నలాగిరికిఁ గట్టుచోటుల నీరాడుతావుల మేఁతపట్టులఁ బరుండుచోటుల నోషధీ కైతవంబున మత్తుపదార్థము లమర్చఁ బడినవి. త త్తత్కాలప్రయుక్త మంత్రౌషధులచే నది గ ర్తవ్యమూఢముగా సైత మొనర్పఁబడియె. అదియుం గాక అనుకూలపవనానుసారముగా విడిచి మత్తు గలిగించుటకై ధూపంబు లాయ త్తపఱచఁబడియె. రోషోద్రేకంబు గలుగుఁ గాకయని ప్రతిగజమదంబు సైతము సేకరింపఁబడియె. వారణంబుల కగ్ని భయకారణంబని గజశాలకుఁ జేరువ నల్పసాధనయుతం బగునొక గృహంబు దగులఁబెట్టుటకు నిశ్చయింపఁ బడియె. ఆగజరాజంబు చిత్తంబు విభ్రాంతిఁ జెందుటకై దేవాగారంబుల నగారా మున్నగు వాయిద్యంబులు వాయింపఁ బ్రయత్నంబు చేయఁ బడియె. సర్వసాధనసముపేతం బగునాధ్వనిచే మహాసేనమహారాజు తప్పక జేపు మన ప్రభువువారిని శరణుఁ జొచ్చెదరు. అప్పుడు దేవరవారు వైరియొప్పుదలమీఁదనే చెఱసాలనుండి బయలువెడలి వీణచే వశపరచు కొందు నని తనతోఁ బాటు దురవస్థ ననుభవించుచున్న యవ్వీణారత్నంబు హస్తగతం బొనర్చుకొని నలాగిరిని వశ్యంబుఁ గావించుకొని తదారూఢులై.

సీ. పట్టవచ్చెడుపరబలము చిత్తంబుతోఁ
గాక కటితటిం దాఁకనట్లు
కేవలముం ద్వర గీల్కొ నళాగిరి
భూరివేగంబునఁ బోవనిచ్చి
దాఁటి వింధ్యాటవిఁ దనుఁ గని సేయుసిం
గముబొబ్బ పూరితి గాక మునుపె
చెఱయందుఁ గాననసీమయందు స్వకీయ
నగరమందున నొక్కనాఁటియందె

గీ. ముత్తెఱఁగులైనమార్పుల మొనసి దేని
చేత మనఱేఁడు తొలుత వంచింపఁబడెనొ
అట్టికరిమిషనే యిప్పు డరుల నణఁచి
చెఱను విడి రాజు కౌశాంబిఁ జేర వలయు - అని

రుమ : వసంతకా! ఆలోచించెద వేమి?

విదూ : మఱేమియు లేదు. తా మొనర్చిన యీమహాప్రయత్నమంతయు భగ్నము కా నున్నదే యని యాలోచించుచుంటిని.

ఇరువురు : ఏమీ - మాకుఁ దెలియదే

విదూ : నాకు మొదలఁ దెలిసినది ఇంక మీకుఁ దెలియ నున్నది.

యౌగం : ఎందువలన నీ కార్యము భగ్న మగును.

విదూ : వత్సరాజుగారి స్వార్థపరాయణతవలన

యౌగం : అది యెట్టిది?

విదూ : వినుఁడు

ఇరువురు : అవహితులము గా నున్నాము

విదూ : కడచినకృష్ణాష్టమినాఁడు రాకుమారి యగువాసవదత్త ధాత్రీద్వితీయయై కన్యాదర్శనంబు నిర్దోష మని యనావృత్తంబగునందల మధిరోహించి యవఘట్టనంబుచే నీరు చిమ్ముధారాయంత్రౌత్థితోదకంబుల దుర్గమం

బని రాజమార్గంబుఁ బరిహరించి మనరాజుగారున్న చెఱసాల ముందుగాఁ బూజకై యక్షిణీదేవాలయంబునకుఁ బ్రయాణ మైనది.

యౌగం : తరువాత...

విదూ : తరువాత మనరాజుగా రానాఁడు అభ్యంతరబంధనపరిచారకుం డగుశివకుం డనురాజసేవకు నెట్లో యొప్పించి చెఱసాలముంగిట నిలుచుండియుండెను.

యౌగం : తరువాత...

విదూ : అంతట భుజములు మార్చుకొనుటకై యచ్చటనే కొంత తడవు బోయలు పల్లకినాపిరి. అప్పుడా రాకుమారి బాగుగా మనరాజుగారికంటఁ బడినది.

యౌగం : తరువాత...

విదూ : ఇంక ఁదరువాత లేదు - గిరువాత లేదు. ఇప్పుడు మన రాజుగారా కారాగా రంబునే ప్రమదాగారంబుగా భావించుచు రాగలీలలఁ దేలు చున్నాఁడు.

యౌగం : స్వామి వాసవదత్తయెడ ననురక్తుఁడు కాఁడు గదా.

విదూ : సందేహ మేల? కష్టములెప్పుడుఁ గట్టలు కట్టుకొనిగదావచ్చును. తాము తలఁచినట్లే రాజుగారు రాకుమారిపై ననురక్తులై యున్నారు.

యౌగం : మిత్రుఁడా! రుమణ్వంతుఁడా! హృదయమును దృఢము చేసికొనుము. ఈ వేసములతోనే మనము వృద్ధులముగావలయుఁ జుమా.

విదూ : పై పెచ్చు రాజుగారు నాతో నిట్లు సెల విచ్చిరి. నీవు చని యౌగంధ రాయణునితో నిట్లు చెప్పుము. మీరెత్తిన యెత్తు నాకెంతమాత్రము నచ్చదు. నాప్రయాణ మిష్టమే కాని - నాకుఁ దొలుదొల్త నవమానము కావించిన ప్రద్యోతునకుఁ దత్కన్యాపహరణంబుచేఁ బ్రత్యవమాన మొనర్ప నాలోచించుచుంటిని. ఇది యతనియెత్తున కెదురెత్తుగాఁ బన్నిన దగుటం జేసి నన్నుఁ గామపరవశుఁ డని తలంపరాదు. అని -

యౌగం : ఔరా! శత్రుజనాపహాస్యంబు గదా యీవచనంబు. ఏమీ బుద్ధి దంత

లజ్జాహైన్యము. అయ్యో! ఇది సుహృజ్జన సంతాపకారణ మయ్యె. దేశకాలంబులఁ బరికింపకుండఁగనే ప్రభువుగారు కామవిలాసంబులఁ గోరుచున్నారు.

విదూ : అయ్యా! మనకుఁ గలస్వామిభక్తిని గనఁబఱచితిమి. చేతనైనంతవఱకుఁ బ్రయత్నించితిమి. ఇంత చేసినను మహారాజు మనమాట వినకున్నాఁడు. కనుక స్వామిని విడనాడి మనదారి మనము పట్ట రాదా?

యౌగం : నీవు వసంతకుఁడవు గదా! వసంతకా! అ ట్లనకు మట్లనకుము.

గీ. చింతచేతను మన్మథచింతచేతఁ
దప్పుఁ డగు రాజు నక్కటా! తగునె విడువ?
విని మహీపాలకుడు సుహృజ్జనముమాట
యుక్తకాల మెఱుంగక యున్నవాఁడు.

విదూ : అట్లేని ఈరూపములతోనే ముసలివారమగుదము.

యౌగం : అంతటియదృష్టమే పట్టినచో నది శ్లాఘ్యమే గదా!

విదూ : లోక మెఱింగినచో శ్లాఘ్యమే - అదియే లేదు.

యౌగం : మనకు లోకంబుతోఁ బని యేమి? స్వామికొఱకుఁ గదా యీయుద్యమంబు.

విదూ : ఎవరికొఱ కీయుద్యమం బుపక్రమింపఁ బడెనో యాతఁడే యెఱుంగకున్నాడు.

యౌగం : దానివేళ వచ్చిన నెఱుంగఁ గలఁడు.

విదూ : ఎప్పటి కింక దానివేళ?

యౌగం : ఎప్పటికి మనయుద్యమంబు నెఱవేఱునో యప్పటికి

విదూ : మీప్రయత్నము ఫలింపవలయు నని మీ కంత పట్టుదల యున్నచోఁ జెఱసాలనుండి రాజుగారిని జంద్రశాలనుండి రాజకుమారిని ఇరువుర నొక్కమారే యేల లేవఁ దీయరాదు?

రుమ : ఈవిషయమునఁ దాము చక్కగా నాలోచింప వలయును.

యౌగం : ఇరువురఁ దీసికొని పోవుటకా? కానిమ్ము. ఇదియే నా రెండవప్రతిజ్ఞ.

గీ. దేవి నల్లశుభద్ర గాండీవి వోలెఁ
బద్మవల్లరిఁ గుంజరప్రభువు వోలె;
పూవుఁబోఁడిని ఱేఁడు గొంపోవునట్లు
చేయలేకున్న యౌగంధరాయణుఁడనె?

మరియు -

గీ. ఘోషవతిని నళాగిరికుంజరంబు
వత్స వాసవదత్త మావత్సరాజు
ఎల్లి కౌశాంబికిం జేర్పనేనిఁ బిలువఁ
జనదు యౌగంధరాయణుం డనుచు నన్ను.

(చెవియొగ్గి) ఏమీ శబ్దంవలె నున్నది. ఆశబ్ద మేమియో తెలిసికొని రమ్ము.

విదూ : చిత్తము. (వెళ్ళివచ్చి) సూర్యభగవానుండు పశ్చిమాభిముఖుం డగుటచే నెండభయము తగ్గి జనము విచ్చలవిడిగా సంచరించుచున్నా. ఇపు డేమి చేయుదము.

రుమ : అట్లేని ఈయగ్నిగృహంబునకుఁ జతుర్ద్వారంబులు గలవు గాన మనసంఘము నలుముఖంబుల విడిపోవుఁ గాక.

యౌగం : కాదు - కాదు - మనసంఘము కలసియే యుండుఁగాక - మనశత్రు సంఘాతమే విడిపోవుఁ గాక. మీపనుల మీరు చూచుకొనుఁడు.

ఇరువురు : అట్లే (నిష్క్రమింతురు)

ఉన్మ :

- ద్విపద -

(బంగారు మాచంద్రుఁ బట్టఁ జూచెదవె
దొంగ రాహువ! నీకు దొరక నిచ్చెదనె?
పొంగకు మ్రింగితిఁబో వీని నంచు

అంగిలిఁ జీల్చి యియ్యదె విడిపింతు.
గగ్గోలు సేయుచు గరువంపుఁ దేజి
పగ్గాలు ద్రెంచుక పాఱెడు నదిగొ
ఇద్దానిపై నెక్కి యిప్పుడే నేను
పెద్దయెత్తుగఁ గోట బిచ్చ సాఁగింతు
చిట్టినాయనలారా! ఛీ! కొట్టకండి
కొట్టినచో మిమ్ముఁ గొట్టెద మఱల
ఆడు మందురొకొ! న న్నాడు మందురొకొ!
చూడండి నాయాట చూడండి నేఁడె)

హీ - హీ - రాహువు చంద్రుని మ్రింగుచున్నాఁడు విడువు చంద్రుని విడువు. విడువవేని నీనోరు బ్రద్దలుచేసి విడిపింతును. ఇదిగో ఇదిగో పొగరుఁబోతుగుఱ్ఱము పగ్గాలు త్రెంచుకొని యిటే పరుగెత్తుకొని వచ్చుచున్నది. ఇదిగో ఇదిగో నాల్గువీథులబాజారులో నున్నది. దీని నెక్కి భిక్ష యెత్తికొందును. వీరే వీరే పిల్లదొరలు. పిల్లదొరలారా! నన్నుఁ గొట్టుచున్నారా? నన్నుఁ గొట్టకండి కొట్టకండి ఏమనుచున్నారు. కొంచె మాడు మనియా? చూడండి చూడండి దొరలు. పిల్లదొరలారా! నన్ను మఱలఁ గఱ్ఱలతోఁ గొట్టుచున్నారా? కొట్టకండి కొట్టకండి. కొట్టినచో నేను గూడ మఱలఁ గొట్టెదను. (నిష్క్రమించును)

**ఇది తృతీయాంకము**

## చతుర్థాంకము

(తరువాత భటుఁడు ప్రవేశించును)

భటుఁడు : ఎంతకాలమాయెను. వెదకి వెదకి వేసారి పోవుచున్నాను. రాకుమారి జలక్రీడ సలుపుతలంపున భద్రవతిని గొనిరమ్మని యానతిచ్చినది. భద్రవతీపరిచారకుఁ డగునా గాత్రసేవకుఁ డింతవఱకుఁ గాన్పింప కున్నాడు. బావా! పుష్పదంతా! నీకు గాత్రసేవకుఁ డేమేని గాన్పించెనా? ఏమనుచున్నావు? ఈగాత్రసేవకుఁడు కండిల శౌండికియింటఁ జేరి

కల్లు త్రాగుచున్నాఁ డనియా? అట్లేని నీవు నీపనిఁ జూచుకొమ్ము. ఇదియే కండిలశౌండికి యిల్లు. వీనిని బిలిచి చూచెదను. గాత్రసేవకా! గాత్రసేవకా!

(తెరలో)

గాత్రసేవకుడు :
ఎవడోసీడు. రాదారిలో వుండి గాత్రసేవకా! గాత్రసేవకా! యని ఒకే మోయన పిలుత్తాడు.

భటుఁడు : వీఁడే గాత్రసేవకుఁడు. కల్లు త్రాగి త్రాగి మత్తిల్లి మత్తిల్లి జపాకుసుమంబులఁ బోలునెఱ్ఱనికన్నులతో నిటే వచ్చుచున్నాఁడు. వీని కెదురుగా నుండరాదు.

(పిమ్మట యథోక్తాకారంబుతో గాత్రసేవకుఁడు ప్రవేశించును)

గాత్ర : ఎవడోసీడు. రాదారిలో వుండి గాత్రసేవకా! గాత్రసేవకా! అని ఒకే మోయన పిలుత్తాడు.

భటుఁడు : (సమీపించి) గాత్రసేవకా! ఎంతసేపటినుండి నిన్ను వెదకుచున్నాను. రాకుమారి జలక్రీడ సేయుతలంపుతో నున్నది. భద్రవతీగజంబు గానరాదు. నీ విట్లు కల్లుద్రావి యొడ లెఱుంగక తిరుగుచున్నావు.

గాత్ర : ఔ ఆమె వొళ్లెఱుగదు. ఆయనవొళ్లెఱుగడు. నేనూ వొళ్లెఱుగను. నీవూవొళ్ళెఱుగవు. అందఱూ వొళ్ళెఱుగరు. ఏమంటావ్

భటుఁడు : అది యంతయు నటుండ నిమ్ము. కోటలో భద్రవతిని బ్రవేశపెట్టకుండ నీ వెక్కడఁ దిరుగుచున్నావు?

గాత్ర : ఇదిగో యిక్కడ దిరుగుచున్నాను. నే నిప్పు డేం శేయాలె.

భటుఁడు : త్వరగా భద్రవతిని బ్రవేశపెట్టు.

గాత్ర : దా - దా - భద్రవతీ! దా - అమ్మో! భద్రవతి అంకుశాన్ని కుదెట్టి కల్లు నీళ్ల తాగానే మఱెట్లా?

భటుఁడు : స్వభావవినమ్ర యగుభద్రవతికంకుశ మేటికి. త్వరగా వెళ్ళి భద్రవతిని బ్రవేశపెట్టుము.

గాత్ర : దా - దా - భద్రవతీ! దా - అమ్మో! ఇంకెట్లా? భద్రవతిదండకుదెట్టి కల్లు తాగానే.

భటుఁడు : పుష్పమాలాలంకృత యగుభద్రవతి కాదండతో నేమి? శీఘ్రముగా వెళ్లి భద్రవతిని బ్రవేశపెట్టుము.

గాత్ర : దా - దా - భద్రవతీ! దా - అయ్యో! ఎట్టా? భద్రవతి గంట కుదెట్టి కల్లుతాగానే.

భటుఁడు : జలక్రీడాసమయంబున భద్రవతికి గంట యేమిటికి లెమ్ము, జాగుచేయక భద్రవతిని బ్రవేశపెట్టుము.

గాత్ర : దా - దా - భద్రవతీ! దా - భద్రవతి కొరడా కుదెట్టి కల్లు తాగానేయెట్టా?

భటుఁడు : కొరడా యేటికి లే వేగిరమే భద్రవతిని బ్రవేశపెట్టుము.

గాత్ర : దా - దా - భద్రవతీ! దా - అమ్మో!

భటుఁడు : అమ్మో! ఏమిటి

గాత్ర : అమ్మో! నేను.

భటుఁడు : ఏమిటి? నీవు

గాత్ర : అమ్మో! భద్ర

భటుఁడు : భద్ర - ఏమిటి?

గాత్ర : అమ్మో భద్రవతిని

భటుఁడు : భద్రవతిని ఏమిటి?

గాత్ర : భద్రవతిని గూడఁ గుదెట్టినాను.

భటుఁడు : అట్లేని నీవు కాదు దోషివి - ఆకండిలశౌండికియే -

రాజవాహనమును గొని నీకుఁ గల్లు పోయునా?

గాత్ర : నే చెప్పాను గూడ మొదలంటా చెడకని -

భటుఁడు : ఏమీ! శబ్దము?

గాత్ర : ఆఁ - తెలిసింది. తెలిసింది. ఆకల్లమ్మేదానిల్లు పడగొట్టుకొని భద్రవతి పాఱిపోతున్నది.

భటుడు : ఏ మనుచున్నావు. (ఆకాశమునఁ చెవియొగ్గి) వత్సరాజు వాసవదత్తను గొనిపోవు చున్నాఁడనియా?

గాత్ర : (సంతోషముతో) వత్సరాజున కవిఘ్న మగుఁగాక.

భటుఁడు : త్రాగుము. త్రాగుము.

ఇంకను మత్తిల్లి యిందే తిరుగుచుండుము -

గాత్ర : ఆఁ ! ఏ మంటివి? ఎవఁడు రా మత్తుఁడు ఎవ్వనికి రా మదంబు. మమ్ముల ఆర్యయౌగంధరాయణమహామాత్యులచేఁ దత్తదుచితస్థానంబుల నియోగింపఁబడిన చారపురుషులను గా నెఱుంగుము. నేనును మిత్రులకు సైగఁ జేయుదును. వీరే నామిత్రులు నిర్బంధములనుండి విడివడిన నల్లత్రాచులవలె నిటునటు పరుగిడుచున్నారు. ఓహూ! మిత్రులారా! వినుఁడు - వినుఁడు.

గీ. సలిలపూర్ణంబు సకుశంబు సంస్కృతంబు
నవశరావంబుఁ గొనఁ ; డొందు నరకమతఁడు
స్వామియన్నంబుఁ దినుచు నాస్వామికొఱకు
సమయ మేతేర సమరంబు సలుపఁ డెవఁడు.

ఎక్కడ నున్నాఁడు సెపుమా యిపు డార్యయౌగంధరాయణుఁడు - ఇదిగో ఆర్యయౌగంధరాయణుఁడు - ఈమహనీయుడు -

మ. ఉరుతీక్ష్ణామలఖడ్గ మూని విడి యా యున్మత్తవేషంబు నం
బరముల్ దాల్చి పసిండికేడె మలరన్ వామాగ్రహస్తంబునన్

శిరమందుం దలపాగ తెల్లనిసిరుల్ సింగారముం గూర్చ గో
చరమౌఁ దళ్కనిమించు చందురుఁడు పజ్జం బొల్చుమేఘంబునాన్.

ఔరా! యుద్ధంబు మహత్తరంబుగా జరుగుచున్నది.

అయ్యో! ఛీ! ఆర్యయౌగంధరాయణుఁడు పట్టువడెఁ గదా. ఇప్పుడు నే నార్యయౌగంధరాయణుచేరువనే మెలంగుదును.

(నిష్క్రమించును)

భటుఁడు : ఏ మిది! ప్రాకారతోరణంబులు దప్ప సర్వము కౌశాంబీనగరమువలెనే యున్నది. కానిమ్ము. ఈవృత్తాంతమంతయు నమాత్యున కెఱింగించెదను.

**(ప్రవేశము)**

(తరువాత ఇరువురు సామాన్యభటులు ప్రవేశింతురు)

ఇరువురు : అయ్యలారా! తొలఁగుఁడు - తొలఁగుఁడు.

ప్రథముఁడు :
అయ్యో! గొంతెంత బ్రద్దలుచేసికొనుచున్నను బౌరులకోలాహల మెక్కువగానే యున్నది.

ద్వితీయుఁడు :
అయ్యో! నే నెంత బిగ్గఱగా నఱచుచున్నను రాజదారిక యగువాసవదత్తను గొనిపోయి రని వినుటవలనఁ బొడమినవిభ్రాంతిచే నాపలు కొక్కఁ డేనియు లెక్క సేయకున్నాఁడు -

అయ్యలారా! ఏ మనుచున్నారు. తొలఁగుఁ డని వారించుట యెందుల కనియా? ఆర్యయౌగంధరాయణుఁడు పట్టువడియెను - ఏ మనుచున్నారు. ఎట్లు పట్టువడియె ననియా. వినుఁడు. ఖడ్గద్వితీయుండై యార్యయౌగంధరాయణుండు ముహూర్తకాలం బక్షౌహిణుల యుగ్రవేగంబు నాఁపి యతిభీకరంబుగ నాలంబు గావించుచు విజయసుందరం బనునొక్క దంతావళంబుపైఁ గరవాలంబు విసరుడు

నయ్యది దానిదంతంబునకుఁ దగిలి భగ్నంబాయెను. ఖడ్గదోషంబుచేఁ బట్టువడియెఁ గాని పురుష దోషంబుచేఁ గాదు.

ప్రథముఁడు :

ఓహూ! జాగరూకులరై యుండుఁ డిది ప్రాకారతోరణంబులులేని కౌశాంబియే సుమా.

ఇరువురు : అయ్యూ! దిగుఁడు - దిగుఁడు -

(అప్పుడు బద్ధబాహుడై ఫలకశయ నీయంబుపై గొనిరాబడుచు యౌగంధరాయణుండు ప్రవేశించును)

యౌగం : ఇదిగో - దిగుచున్నాను.

ఉ. వైరులచేతినుండి యటు వత్సనృపున్ విడిపించి బల్మిమైఁ
బోరి స్వఖడ్గదోషమునఁ బోరున వైరులచేతఁ జిక్కి యా
తీరున జేనియిక్కటులఁ దీరిచి చేరుచు నుంటి గెల్పుచే
కూరె నటన్నవేడుక దిగుల్ సన రాజకులంబు హాయి గన్.

ఔరా! సౌఖ్యము గదా నిష్కళత్రులకుఁ గాంతారప్రవేశంబు. రమణీయంబు గదా యువా ప్తకాములకు దైవవినిపాతంబు. అపశ్చాత్తాపకరంబు గదా సంచితధర్ములకుఁ గాల ధర్మంబు. నే నన్నో —

చ. భయమును వైరమున్ బరిభవంబు సమంబుగ వీడి కార్యమున్
నయవినయంబులన్ శరగణంబులఁ దీరిచి శత్రురాజ్యల
క్ష్మియుఁ దొలఁగంగఁ జేసి నిజమిత్రులయయ్యపకీర్తితోడనే
జయమును వత్సభూపతిని శాశ్వతకీర్తిని గాంచఁ గల్గితిన్.

ఇరువురు : తొలగుఁడు - తొలగుఁడు - అయ్యలారా! తొలగుఁడు.

యౌగం : నన్నుఁ జూడ నభిలషించుజనంబును దొలఁగింపఁ జనదు

చ. అరయుఁడు రండు మంత్రిపద మం దభిలాష మనంబులోపలన్
వరలెడురాజపూరుషు లవారిగ జేనినిమిత్త మిట్లు దు
ర్భరదురవస్థ లన్నిటికిఁ బా లగునన్ బరికించుచో మదిన్
దిరమగునో తదీప్సితము ధీరత లేమి వెసన్ దొలంగునో?

ఇరువురు : తొలఁగుఁడు - తొలఁగుఁడు - మీ రిదివఱ కెన్నఁడీయౌగంధరాయణుఁ జూడరా? ఏమి?

యౌగం : పూర్వము చూచిరి గాని యీరూపుతోఁ గాదు

గీ. పిచ్చివేసంబుతో నటు రచ్చలందుఁ
బరుగిడెడునాకు నీరూపు భావ్య మగునె?
ఇట్టిరూపంబు గొనినందు కిపుడు చూపఁ
బడుచున్నవి గనుఁడు నాపనులు ప్రజలు.

(ప్రవేశించి)

భటుఁడు : ఆర్యా! తమ కొకప్రియవార్తను దెలుపుచున్నాను. వత్సరాజును గూడఁ బట్టికొనిరఁట.

యౌగం : ఇదియెన్నఁటికిని జరుగఁబోదు.

భద్రా! అట్లేని ఎట్లు పట్టుకొని రని వింటివి?

భటుఁడు : నళాగిరిని వెంటఁ బరుగెత్తించి పట్టుకొని రంట

యౌగం : నళాగిరి కంతసామర్థ్య మున్న మాట వాస్తవమే గాని అది స్వస్థచి త్తముతో లేదు. అదియును గాక సరిగా శిక్షఁబొందినదియుం గాదు.

గీ. ఏనుఁగుల కగు వడి మావటీనిశిక్ష
అట్టియెడ శిక్షయే లేని యాగజంబు
వత్సనరపతి నడిపెడుభద్రవతిని
మించి నడువంగఁ నల్లవిరించివశమె?

భటుఁడు : ఆర్యా! ఈప్రదేశం బాయుధీయసురక్షితం బగుటం జేసి తా

మీయాయుధాగారంబుననే యుండ వలయు ననిమంత్రిగారు సెలవిచ్చుచున్నారు.

యౌగం : ఔరా! ఎంతపరిహాస్య మీవచనము.

గీ. వత్సరా జనువహ్నిని వైచి చెఱను
జాగరూకత వలసినసమయమందు
మంత్రులు పరుండినారు మై మఱచి యిపుడు
రత్న మేగినఁ బెట్టె కీరక్ష యేల?

(నడిచి)

భటుడు : ఇదియే ఆయుధాగారము ఆర్యులు ప్రవేశింతురుగాక.

(ప్రవేశించి)

భటుఁడు : మంత్రిగారు తమకుఁ గట్లు దొలఁగిఁప సెల విచ్చిరి.

యౌగం : అట్లేని - తొలఁగింపుము. నిజము. భరతరోహకుఁడు నన్నుఁ జూడఁ దలఁచుచున్నాఁడు. నేనును భరతరోహకుని జూడఁ గోరుచున్నాను.

(తరువాత భరతరోహకుఁడు ప్రవేశించును)

భరత : ఎచ్చట యౌగంధరాయణుఁ డెచ్చట యౌగంధరాయణుండు?

భటుఁడు : యౌగంధరాయణమంత్రిగా రేలినవారికొఱ కెదురుచూచుచు - నాయుధాగారముననే యున్నారు.

భరత : సరే కానిమ్ము.

ఆ. వె. కపటనీలహస్తి గావించి వంచింపఁ
బడియె నితఁడు మంత్రిపదవియందు
తద్విరోధ మివుడు తలపెట్టి యెవొ యన
నెదురు సూచుచుండె నిట్లు నాకు.

భటుఁడు : ఆర్యా! ఈతఁడే యార్యయౌగంధరాయణుఁడు.

భరత : (సమీపించి) ఓహూ! యౌగంధరాయణా!

యౌగం : ఓ....

భటుఁడు : ఏమీ యీస్వరగాంభీర్యంబు. ఈ మహామహుని యేకాక్షరాత్మికం బగుమాట చేతనే యీప్రదేశమెల్ల నిండిపోయినది.

భరత : (కూర్చుండి) వత్సరాజామాత్య! యౌగంధరాయణుఁడను నశరీరంబు లగునక్షరంబులనే యిదివఱకు వినుచున్నాము. నేడు మాభాగ్యంబుచే నిన్నుఁ జూడఁ గల్గితిమి.

యౌగం : ఏమీ! మాభాగ్యంబుచేతనే చూడఁ గల్గితిమనియా?

ఆ. వె. కనుమ రక్తసిక్తగాత్రు నీగతి వైర
సద్వ్రతైకనిష్ఠ సలుపునన్ను
జనకుఁ బరభవించుచెనఁటిని నుఱుమాడి
తనిసి శాంతి నున్నద్రౌణిఁ బోలె.

భరత : గజవ్యాజంబునఁ బ్రభువుఁ గొనిపోవుటయు శౌర్య మనియు గర్వించుచున్నావా?

యౌగం : ఏమీ! గజవ్యాజంబునఁ బ్రభువుఁ గొనిపోవుటయనియా? అట్లేని ఇది మాత్రము మీకున్యాయమా?

మ. వరనాగం బని సాలవృక్షముదరిన్ వత్సేశు వంచించుటల్
చఱఁ జే దిండు గరిత్తనేలఁ బతికిన్ సెజ్జం బొనర్పించుటల్
కరి వశ్యత్వము తేఁడు గోల్పడు నటుల్గా వీణఁగైకొంటలున్
మఱిన్యాయంబులు? త్వత్కృతం బనుకరింపన్ మావి యన్యాయముల్?

భరత : యౌగంధరాయణా! మహాసేనాత్మజ యగువాసవదత్త నగ్నిసాక్షిగా శిష్యురాలిఁ జేసికొని మీవత్సరాజు అదత్తాపహారంబు గావించె. ఈచోరవర్తన మాతనికి న్యాయమో?

యౌగం : అట్లనకు మట్లనకుము. పాపముశమించుఁ గాక! పాపము శమించుఁ గాక! శిష్యురాలిగఁ గొనుటయే తేనికి వివాహంబని యెఱుంగుము.

భరత : అది యటుండ నిమ్ము. వత్సరాజు మామహాసేనమహారాజువలన బంధమోచనసత్కారంబు వడసెఁగదా దాని సైతము పరిగణింపక తత్సుతఁ గొనిపోవుట సమంజసమా?

యౌగం : ఇటు లాడకు మిటు లాడకుము.

గీ. విను నళాగిరి గజశాస్త్రవిదులమాట
దాన నొనరించు మాటేనియాన గాన
రాజు మారాజు విడిచె స్వరక్షకొఱకు
నెయ్యురకుఁ బ్రాణమానముల్ నిలుపుకొఱకు.

భరత : అట్లు నళాగిరిగ్రహణార్థమే మీఱేఁడు విడిపింపఁబడినచో మహాసేనులచే మఱల నేల బంధింపఁ బడఁడు?

యౌగం : ఏల బంధింపఁబడఁడా! తన్నుఁ దనయాప్తులను రక్షించినమహనీయుని గృతఘ్నుఁడై బంధించినచో లోకంబు దూఱు ననుభయంబుచేత.

భరత : రాజ్యతంత్రజ్ఞుఁడ వయ్యు నిటుపలికెద వేల? యుద్ధాపజితులవిషయమై శాస్త్ర మేమి దండంబు విధించుచున్నది?

యౌగం : మరణదండమును.

భరత : వత్సరాజు మరణదండార్హుఁడేని మాచే న ట్లేల సత్కృతుండయ్యె.

యౌగం : కనుకనేగదా మహాసేనులశరీర మంట లేదు.

భరత : ఇదియు శక్య మనియే తలంచెనేమి మీరాజు?

యౌగం : సంశయ మేమి?

గీ. హస్తగతుఁ డైనమీఱేని నణఁచకుండ
బ్రోచె ధర్మాత్ముఁ డైనమాభూవరుండు
కరివరముపైకి నెక్క కేకరణి ధరణి
వైజయంతిని గొనుటకు వలను పడును?

భరత : కానిమ్ము.... కానిమ్ము.... మహాసేనులకుఁ బ్రతికూలంబు గావించి మఱలఁ గౌశాంబి కేగుదు ననియే తలంచితివా?

యౌగం : ఏమీ? ఎంత పరిహాస్య మీమాట

గీ. ఏగుదెంచితి మీయెట్టయెదిరి కేను
తక్కు(బనులను సవరింప లెక్కయేమి?
పెల్లగించితి మొదలంట( బెద్దమ్రాను
చిన్నకొమ్మల( దునుము టేచిక్కొ యింక.

(ప్రవేశించి)

కాంచుకీయు(డు :
(చెవిలో) ఈలాగీలాగు

భరత : బిగ్గఱగా(జెప్పుము.

గీ. కారణంబులు పెక్కులు గలిగియున్న(
గావు మా కెన్న(టికి నపకారి వీవు
నీదుసుగుణంబులందున లేదు గినుక
ఇదిగొ భృంగార మొస(గితి మిద్ది గొనుమ.

యౌగం : అయ్యో! ఛీ! ఛీ! వలదు. వలదు.

గీ. ఆఱ వింతకు నే( గాల్చినట్టియిండ్లు
శాంతపడ విప్పటికి మంత్రిజనులమదులు.
ఇంతలో నాకు దోషికి నింత పూజ!
దండ్యునకు వధ గాదె సత్కార మన్న.

(తెరలో హాహాకారము విన(బడును)

భరత : ఓయీ!

గీ. అయ్యో! ఆకస్మికముగ సౌధాగ్రసీమ
నేగుదెంచెడియాధ్వని యేరి దొక్కా
డేగటెక్కలతా(కున డీలు వడిన
యట్టికురరీనినాదంబు ననుకరించె.

ఈశబ్ద మెవరిదో తెలిసికొనిరమ్ము -

కాంచుకీయుఁడు :

చిత్తము.

(పోయి తెలిసికొనివచ్చి)

పూజ్యులారా లగునంగారవతీదేవి వాసవదత్తాపహరణంబువలని శోకాతిరేకంబున సంతప్తస్వాంత యై ప్రాసాదంబునుండి పడియేనిఁ బ్రాణంబులు బాయఁ దలంచినపుడు మహారాజులుంగా రీతీరుగాఁ బలికిరి. దేవీ! యేటి కీసంతోషసమయంబున సంతాప మందెదవు? భవదీయతనుజాతకు క్షత్రియోచితం బగుగాంధర్వవివాహ మితః పూర్వంబె నిర్వృత్తంబయ్యె. కావున మన మిప్పుడు ఫలకస్థితు లగు వాసవదత్తా వత్సభూపతులకు వివాహ మాచరింతుముగాక. అని. అందువలన అచ్చట

గీ. కంటఁ దడితోడ మోములఁ గౌతుకంబు
గాన రాకుండఁ బనుల నాకస్మికముగ
మంగళద్రవ్యములు సెలగంగ నిపుడు
చేయుచున్నారు కౌతుకశ్రీలు స్త్రీలు.

యౌగం : అట్లేని మాఱేనితో మహాసేనమహారాజులు వియ్యమందఁ దలంచుచున్నారు గాన భృంగార మిటు గొనిరమ్ము.

కాంచుకీయుడు :

ఇదిగో. చేకొనుఁడు (దగ్గఱకుగొనిపోవును)

భరత : యౌగంధరాయణా! మహాసేనుఁడు మీ కింతకంటె మఱల నేమి ప్రియంబు గావింపవలయును?

యౌగం : మహాసేనుండు నాయందుఁ బ్రసన్నుఁ డేని నా కింతకంటెఁ గావలసినది యే మున్నది?

(భరతవాక్యము)

గీ. గోవులకు వ్యసనము లేక పోవుఁ గాత
శాంతి జెందుత మఱి పరచక్రమెల్ల
ఈచతుర్వార్ధి సహిత మహీతలంబు
నెపుడు మారాజసింహుఁడే యేలుఁ గాత.

(అందఱు నిష్క్రమింతురు)

**ఇది చతుర్థాంకము.**

కవి శేఖర శతాబ్దపువాని పళ్లె పూర్ణప్రజ్ఞాచారాంద్రీకృతం

బగుప్రతిజ్ఞాయౌగంధరాయణంబు

సమాప్తము.

